# జి-11 తో తయారయిన సింథాల్ మిమ్ములను, మిగతవానికంటె, కాపాడును

సింథాల్ టాయిలెట్ పౌడరుయందు గల జి-11 (హెక్సాక్లోరాఫీన్) హానికరమైన, క్రిములను నిర్మూలించు, అసమాన పదార్థము. చెమటతో కూడిన దుర్గంధమును నిరోధించును. మిమ్ములను రోజల్లా సువాసనతో హాయిగా ఉంచును.




INTERPUB/GCP/15




మే 4వ తేదీ ఆంధ్ర ప్రదేశమంతటా విడుదల

ఏవియమ్ ప్రొడక్షన్స్

# రాము

AVM PRODUCTIONS

దర్శకత్వం: A.C. త్రిలోకచందర్ M.A. మాటలు: D.V. నరసరాజు B.A. నిర్మాణం: ఉమా ప్రొడక్షన్స్

## కృతజ్ఞత

ఈ 'ఉద్యోగపర్వాల'ను వరుసగా ప్రచురించి నా కెంతో ప్రోత్సాహం యిచ్చిన 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక' కెంతగానో కృతజ్ఞుణ్ణి యీ కథలను చదివిన తర్వాత అభిమానంతో ఆంధ్రదేశంనుండి, దేశంలోని యితర ప్రాంతాల నుండేగాక విదేశాల నుండి కూడా ఆంధ్రమిత్రులు అభినందిస్తూ నాకు వుత్తరాలు వ్రాశారు వారికందరికీ కృతజ్ఞత తెల్పుకుంటూ, ఉత్తరాలు వ్రాశాను కానీ పొరపాటున ఎవరికయినా జవాబు వ్రాయకపోవటం, వ్రాసినా చేరకపోవటం జరిగితే వారికి పత్రికా ముఖంగా కృతజ్ఞత తెల్పుకుంటున్నాను

యింకొక్క మాట — 'చిరుద్యోగపర్వం'లో విహంగరావునీ యింకా అలాంటి అవినీతిపరుల్నీ ఆవిధంగా అలాపైకి వెళ్ళిపోనివ్వటం కొందరికి కొంతవరకూ నచ్చలేదని వ్రాశారు నిజం చెప్పాలంటే అలా వ్రాయటం నాకు పూర్తిగా నచ్చలేదు (అలా వ్రాయటం నచ్చలేదంటే వ్రాసిన వారు నా కలా వ్రాయటం నచ్చలేదంటున్నానుకోకండి అలా కథల్లోనే నేను వ్రాయటం నాకే పూర్తిగా నచ్చలేదు) అందుకని సినిమా చివరి సీనులో మాదిరి వాళ్ళకేదైనా శిక్ష యిద్దామా అని 'గురుద్యోగ పర్వం' వ్రాసిన తర్వాత 'ఉద్యోగ విరమణ' కథ వ్రాసేటప్పుడు అనుకున్నాను కానీ చుట్టూవున్న ప్రపంచాన్ని చూస్తూ అలా వ్రాయలేక పోయాను నిజానికి దూరంగా వెళ్ళలేకపోయాను అది నా బలహీనత అదీగాక ప్రపంచంలోని కొన్ని విషయాల్ని యథాతథంగా హ్యూమరస్‌గా చిత్రీకరించటమే యీ రచనల లక్ష్యం అంతకు మించి యింకేమీ కాదు

శేళ్లపల్లి వెంకట లక్ష్మీనారాయణ శర్మ
(బెంగుళూరు.)

## కథలు

చాలాకాలానికి శ్రీయుతులు పింగరాజా రామచంద్రమూర్తి, మునిపల్లె రాజు పత్రికాముఖాన కలుసుకొనుటయు చాలా సంతోషము వారు వ్రాసిన కథలు "నాలుగవ మజిలీ" "జయమూ అపజయమూ" బాగున్నాయి

ముండూరు కొండయ్య, (అనంతపురం)

*　*　*



# ఉత్తరాలు

'గురుద్యోగ పర్వం' కాకాసురోత్తాంతముతో, మంచి పాకాన బడ్డది అందులో "పట్టు—విడుపు" లుతెలిసిన ముక్తేశ్వరరావు జన్మరహస్యము అత్యద్భుతము ముఖ్యముగా ఈకథచదువుటకు మరునటి పత్రిక కోసమై ఎలా నేను ఎదురుచూస్తున్నానో చెప్ప వలివిగాదు ఇంతచక్కటి వ్యంగ్యకథా రచన కర్త అయిన శేళ్లపల్లి వెంకటలక్ష్మీనారాయణగార్కి నా నమస్కారములు

ది 26—4—68 నాటి పత్రికలో "పార్వతి" కథకే మొదటి స్థానము పార్వతి తల్లిపాత్రను, పార్వతిపాత్రను రచయిత చాలా సహజముగా చిత్రీకరించినారు

"వన్నెటివూట—కన్నీటి బాట" కథమొదలు బాగున్నా ముగింపు రాణించలేదు మొదట ద్వేషించి, చివరకు పశ్చాత్తాపముతో చేరువయ్యే సమయములో చేతికందకుండ పోయే సంఘటనలు చాలా కథలలో చదివియున్నదే

శ్రీమతి కె రామలక్ష్మిగారి "హృదయంచిగిర్చింది" సీరియల్ చాలా బాగుంది

మన్నె శైలజ, (మద్రాసు)

## ఫిలిం బాలట్

మీరు ప్రకటించిన ఫిలింబాలెట్ ఫలితాలపై ఒక పాఠకుని విమర్శ నాచేత ఈ ఉత్తరం వ్రాయించింది ఈయనకు ఉత్తమ చిత్రం, ఉత్తమనటుడు ఎన్నిక సంతృప్తి కరంగాలేదట బహుశా ఆయన అనుకున్నచిత్రం, నటుడు ఎన్నికకాకపోవడమే అయి వుంటుంది బాలెట్ నిర్వహించినది పత్రికల వాళ్ళే అయినప్పటికీ పాల్గొన్నది ప్రేక్షకులు(పాఠకులు) అధికసంఖ్యాకులు ఉత్తమంగా భావించినది ఎన్నిక కావడం సహజం అలాగే జరిగిందికూడ ఈ పాఠకుని అభియోగం ఎలా వుందంటే పత్రికవాళ్ళే తమకునచ్చిన వారిని ఉత్తములుగా ప్రకటించినారని ఇలా చేసివుంటే బాలెట్టెందుకు? పాఠకులు పాల్గొనడం ఎందుకు?

అబ్దుల్ రహిమాన్, (గద్వాల్)

### గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి 5. సిరాతోనే రాయాలి. —సం॥


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం · 10—5—'68
కీలకనామ సం॥ వైశాఖ శుద్ధ త్రయోదశి
సంపుటము : 60 సంచిక 35

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26 00 |
| 6 మాసముల చందా | 13 00 |
| 3 మాసముల చందా | 6 50 |


## విషయానుక్రమణిక



కేరళ మునిసిపల్ ఎన్నికలు
ప్రజలు నిన్ను నమ్మడం లేదని తెలియపర్చారు
యునైటెడ్ ఫ్రంట్
పాకిస్తాన్ ఎప్పుడూ తాష్కెంట్ ఒప్పందం మీద నిలబడుతుంది
అయూబ్
కోసిగిన్
తాష్కెంట్ ఒప్పందం
ధుబారాదార పురాగమనం
యస్.యస్.పి. విచ్ఛిత్తి
బీహార్‌లో గొడవ
ఉత్తర ప్రదేశ్‌లో గొడవ
యస్.యస్.పి
మధ్య ప్రదేశ్‌లో గొడవ
లోహియా వర్గం
BOMMEH

శ్రీకృష్ణ

# వ్యవసాయరంగంలో రాజకీయాలు

'నేషనల్ ప్రొడక్టివిటి కవున్సిల్' వారి పత్రికలో బాబూ జగజీవనరావ్‌గారు ఒకసారి ఇలా రాశారు.

'దురదృష్టవశాత్తు మన సంఘంలో ఉత్పత్తికి సరయిన స్థానంలేదు ఎంత తక్కువ పనిచేస్తే అంతగౌరవం, అసలే పనిచెయ్యకపోతే అత్యంత గౌరవం ఇవి మన ప్రస్తుత సమాజపు విలువలు వీటిని మనం తప్పించుకొనలేము అందుకనే, మనం పారిశ్రామికవర్గం ఉత్పత్తిని గురించి మాట్లాడినప్పుడు సమాజంలో పాతుకు పోయిన ఈ రకం విలువలనే మార్చెయ్యటం ఎలాగా అని ఆలోచించాలి"

ఇదంతా మహర్షి మహేష్‌యోగి పాశ్చాత్యులలోనూ భారతీయుల విలువలకి బహుళ ప్రచారం చెయ్యటానికి ముందు!

బాబూ జగజీవనరావ్‌గారు యదార్థవాదులు తాము కేంద్ర పారిశ్రామిక మంత్రిగా వున్నప్పుడు ఒక 'పారిశ్రామిక సంఘం' నిర్మించారు దీనిద్వారా శ్రమపట్ల భారతీయులు పెంపొందించుకున్న వైఖరులతో యుద్ధంచేసి ఉండవచ్చు ఆయన ఇప్పుడు ఆయన ఒక 'వ్యవసాయ సంఘం' నెలకొల్పుకున్నారు 1928 లో రాయల్ కమిషన్ అధ్యక్షుడుగా లార్డ్ లిన్‌లిత్‌గో పనిచేశారు ఇప్పుడు శ్రీ జగజీవనరావ్ అభినవ లిన్‌లిత్‌గో కోసం వెతుకున్నారుట పారిశ్రామిక విషయాలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండిటికీ సంబంధించినది వ్యవసాయం, విద్య, ఆరోగ్యం రాష్ట్ర ప్రభుత్వాలకి మాత్రం సంబంధించిన విషయాలు. నిజం చెప్పాలంటే, జగజీవనరావ్, త్రిగుణసేన్, సత్యనారాయణ సిన్‌హా గారల సామ్రాజ్యాలు మన ఫెడరల్ రాజ్యాంగాన్ని అపహాస్యం చేస్తున్నాయి

కేంద్రప్రభుత్వం పప్పుధాన్యాల వ్యాపారం పట్ల నిషేధం తప్పు అన్నప్పటికీ మధ్య ప్రదేశం ఆ నిషేధాన్ని ఇంకాకొనసాగిస్తోంది– ఈ ధాన్యాలపంట బాగాఉన్నప్పటికీ. అలాగే ఆహారం సేకరణ నిషేధాలు కూడా ఇందు కోసమే ఇలాగే కొనసాగుతాయి ఒకవేళ కేంద్రప్రభుత్వం వద్దన్నప్పటికీ కాంగ్రెసు పరిపాలనకింద ఉన్న రాష్ట్రాలు కూడా లెక్కచెయ్యకపోవచ్చు కేంద్ర ఆహార, వ్యవసాయశాఖకి అధికారాలు తక్కువ. రాష్ట్ర ప్రభుత్వాలు అమలుపరచే పథకాలకి డబ్బు ఇవ్వగలదు, అంతే

ఉదాహరణకి, పార్లమెంటులో మొత్తం 5,785,636 నూతులు తవ్వామని అన్నారు, ఇందులో 213,879 బీహారులో మూడవప్రణాళికలో తవ్వినవిట 1966–67 లో మొత్తం 175,418 బావులు తవ్వారుట (బీహారులో 6840), 1967–68 లో 192,525 నూతులు తవ్వారుట (బీహారు 10,000) ఈ మంత్రిత్వశాఖకి మాత్రం ఉపయోగంలో ఉన్న బావులసంఖ్య తెలియదుట.

విత్తనాల సంగతీ ఇంతే ఏయే రాష్ట్రానికి ఎంతెంత ఎక్కువ–పంటవిత్తనాలు ఇచ్చారో చెప్పలేరు పంట ఎక్కడెక్కడ ఎంత పండిందో చెప్పలేరు

భారతదేశంలో నేల (మట్టి) రకాలకి సంబంధించిన సమాచారం అంతగా సేకరించటం జరగలేదు. దేశం మొత్తంమీద మట్టి దినుసుల పరిశీలనజరిపి సమాచారాన్ని శాస్త్రీయంగా ఏర్పరచటం జరగలేదు. ఇదంతా పెద్దఎత్తున జరగవలసి ఉంది

భారతదేశంలో చాలాకాలంగా నీటి పారుదల పథకాలని నీటిఎద్దడిరాకుండా ఉండేందుకు తయారుచేసే వారేకాని ఉత్పత్తి పెంచటానికి చెయ్యలేదు అంతేకాక నేల ఎటువంటిదో చూసి నీటిపారుదల ఏర్పాటు చేసేవారుకారు. ఇక పయిన కొత్తదృక్పథం అలవరుచుకోవాలి కొత్తరకం ధాన్యం విత్తనాలు వాడుకలోకి వస్తున్నాయి వీటి నీటి అవసరాలని గమనించి తగిన ఏర్పాట్లు చెయ్యాలి.

వర్తమానకాలంలో సుమారు 99 శాతం భూమి ఎడ్లచేత దున్నటం జరుగుతోంది. మరికొన్ని శతాబ్దాలుగా ఈ పరిస్థితి అంతగా మారకపోవచ్చు అసలు నాగలి నిర్మాణంలో ఎంతమార్పు అభివృద్ధి వచ్చాయి? ఏ నేలని ఏరకం ఎద్దు ఎటువంటి నాగళ్లతో దున్నాలో పరిశోధనల ద్వారా తెలుసుకోవాలి

నేడు భారతదేశంలో వివిధప్రదేశాలలో ఉత్పత్తి అవుతున్న ధాన్యం మొత్తాలు ఆ ఆ చోట్లలోనే కర్చుఅయిపోతున్నాయి. దీనికి తోడు ధాన్యం పాతరకేసేపద్ధతులు మంచివి కావు ఎలుకలు, పురుగులు ఎంతోధాన్యాన్ని తిని చెడగొడ్తాఉంటాయి ఈరకంనష్టం ఏటా 30 శాతందాకా ఉంటుందని అంచనా ఒక్కొక్కఇంట్లో, పొలందగ్గిరా పోయే మొత్తం తక్కువగా కనిపించినా దేశం మొత్తంమీద చాలాపోతుంది

పి ఎల్ 480 ధాన్యం దిగుమతులు ఇప్పుడప్పుడే తగ్గించటం మంచిదికాదని ఆహారమంత్రి శ్రీ జగజీవనరావ్ అన్నారు. 1971 కి కనీసం 60 లక్షల టన్నుల నిలవ ఉండాలన్నారు

1942 లో సర్ తియోడోర్ గ్రెగరీ నిలవగురించి కొన్ని సూచనలు చేశారు

నిలవని దాచేందుకు చోటు ఉండాలి. భారతదేశానికి ప్రస్తుతం 83 లక్షల టన్నులు పాతరవేసే సదుపాయాలు ఉన్నాయి అవి—

ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా . 25 లక్షల టన్నులు.
వివిధ రాష్ట్రాలు, సహకార సంఘాలు .. 40 ,,
వివిధ కార్పొరేషనులు . 18 ,,

1971 కి ఈ సంఖ్యని 103 లక్షలకి పెంచాలని సంకల్పం 1971 కి 1200 లక్షల టన్నుల ఉత్పత్తి ఉంటే నిలవ, అమ్మకం ఎలా చేస్తారు? ఎవరూ చెప్పటంలేదు.

"ఆడదానికి కావలసింది ఐశ్వర్యమే కాదు"
మరేమిటి? 'తిక్క శంకరయ్య' చూసి మీరే చెప్పండి!




డి.వి.యస్. ప్రొడక్షన్స్ వారి

# తిక్క శంకరయ్య

దర్శకత్వం
డి. యోగానంద్

నిర్మాత:
డి.వి.యస్. రాజు

# న్యూఢిల్లీ లేఖ

ఈ సమస్యలని ఎవరూ 'లేవు' అన లేరు. లిన్‌లిత్‌గో రిపోర్టు కాలంనుంచి ఎంతో విలువకల సమాచారాన్ని సేకరించి ఉంచారు. వంగరాష్ట్ర క్షామం సందర్భంలో ఉడ్‌హెడ్ రిపోర్టు వ్యవసాయాన్ని ఎలా బాగు చెయ్యవచ్చో చెప్పింది, జనాభా, కుటుంబనియంత్రణ సమస్యలకి పరిష్కార మార్గాలని సూచించింది

ప్రపంచ బాంకువారి 'బెల్' రిపోర్టు మన వ్యవసాయాన్ని గురించి నాలుగు గంథాలని ప్రచురించింది. అమెరికన్ సహాయసంస్థ కూడా ఎన్నో రకాల సమాచారాన్ని సేకరించి ఉంచింది. అమెరికా అధ్యక్షుడి సలహాసంఘం ప్రపంచంలో ఆహారం ఉత్పత్తి గురించి రాస్తూ భారతదేశం మీద ఒక అధ్యాయం ప్రచురించింది

రష్యా, పశ్చిమజర్మనీ, నార్వే, డెన్మార్క్ దేశాలు మన ఆహారోత్పత్తిని గురించి పథకాలు తయారుచేశాయి

రాజకీయాలు మంచి ప్రాజక్టులని ఎలా చెడగొడ్తాయో తెలుపటానికి ఒక ఉదాహరణ ఇస్తాను

భారతదేశంలో 5,50,000 గ్రామాలు ఉన్నాయి. వాటిమధ్య సమాచారప్రసారానికి సదుపాయాలు లేవు. ఈ పరిస్థితి మన అభివృద్ధికి అవరోధంగా ఉన్నది.

ఈ పరిస్థితిని చక్కపెట్టాలంటె రేడియో ప్రసారావకాశాలు చాలా సృష్టించాలి. శ్రీమతి ఇందిరాగాంధి సమాచార మంత్రిగా ఉన్నప్పుడు దేశంలో ఎన్నో చోట్ల రేడియో ప్రసార కేంద్రాలు స్థాపించే పథకం తయారు చేస్తున్నట్లు ప్రకటించారు. ఇటువంటివి ఉన్నప్పుడె సమాచారప్రసారానికి తగిన అవకాశం కలుగుతుంది. ఇది అందరూ గ్రహించిన సత్యం.

ప్రతి జిల్లాకీ ఒక ట్రాన్స్‌మిట్టర్ ఏర్పాటు చెయ్యాలని నిపుణులు సూచించారు. ఈ పద్ధతిప్రకారం దేశంలో 325 రేడియో ట్రాన్స్‌మిట్టర్లు నెలకొల్పాలి

ఈ పెద్ద పథకాన్ని నలుగురు అమెరికన్ నిపుణులు అనుశీలించారు. వారి సిఫార్సులు—

1. దేశంలో చవక ట్రాన్సిస్టర్ రేడియోల ఉత్పత్తి బాగా పెంచాలి.

2 దానికి కావలసిన కార్మికుల సంఖ్య పెంచాలి.

3 ప్రోగ్రాముల నాణ్యాన్ని పెంచాలి

4 వీటన్నిటికీ కావలసిన మనుష్యులని తరిఫీదు చెయ్యాలి.

ఇంకా—

1 వెంటనే 114 జిల్లాలలోని 15 జిల్లాలలో ట్రాన్స్‌మిట్టర్లని స్థాపించటం.

2. 20 లక్షల డాలర్ల అప్పు అమెరికా ఇవ్వటం,

3 సాంకేతిక సహాయం, తరిఫీదు వగయిరా అమెరికన్ నిపుణులు ఇవ్వటం కూడా జరగాలని ఈ నిపుణుల సంఘం సూచించింది

అదనంగా 70 లక్షల డాలర్లు అప్పుగా అమెరికా ఇస్తానని అన్నది. మొత్తంమీద 8 సంవత్సరాలు అమెరికా ఈ పథకంలో పాల్గొంటానన్నది

వెంటనే ఒక పెద్ద అలజడి బయలుదేరింది. వాయిస్ ఆఫ్ అమెరికా వొప్పందం పోవటంచేత ఈ కొత్త కుట్ర అమెరికా పన్నుతున్నదనే నినాదం వినపడింది

పథకాన్ని పూర్తిగా వదులుకున్నారు

దీనినిపట్టి మనం గ్రహించగలిగింది, భారతప్రభుత్వం కార్యదక్షత లేనిప్రభుత్వం అని. రేడియో విషయంలోనే ఏమీ చెయ్యలేకపోతే ఆహారం విషయంలో ఏమి చెయ్యగలదు?

కొన్ని విషయాలలో సరయిన సమాచారం కూడా దొరకటంలేదు. ప్రచురించే సమాచారం కూడా నమ్మతగ్గదికాదు. ఇది ఆహారధాన్యాల ఉత్పత్తి విషయంలో మరీ నిజం. అరణ్యాలని ఇష్టం వచ్చినట్లు నాశనంచేస్తున్నారు, వాటి వైశాల్యం ఎంత ఉందో ఎవరికీతెలియదు

భారతదేశంలో ఉన్నన్ని పశువులు ప్రపంచంలో ఎక్కడాలేవు. కొంతకాలంగా నగరాలు గ్రామాల ఆర్థికవ్యవస్థని చెడగొడ్తున్నాయి. ఊరిమీద వదిలిన పశువులు చేలమీదపడి నష్టం కలిగిస్తున్నాయి. బీహారులో గొడ్లు మల మల మాడుతూ ఉంటే చూస్తూ ఊరుకున్నవారు పశువులని

(64 వ పేజీ చూడండి)




# ఉద్యోగ విరమణ
## గురుద్రోహపర్వం

వేళ్లపల్లి వెంకటలక్ష్మీనారాయణ

౨

విహంగరావు కుర్చీలో పడుకుని పేపర్చదువు తున్నాడు పక్కనేవున్న గదిలో చిన్న పిల్లాడొక డేడుస్తున్నాడు అతగాడు విహంగరావు మనవడు

'ఎవరక్కడ? . వాడలా గోల్చేస్తుంటె పట్టించుకోరేం? . వాడట్టా ఏడుస్తుంటె యిక్కడ కూర్చున్న వాళ్ళకి తోచద్దా?' అంటూ అరిచి కళ్ళజోడు తీసి సిల్కులాల్చీ చివరలో తుడుచాడు విహంగరావు లోపల్నుంచి కోడలుపిల్ల గబాగబావచ్చి మెల్లగా పిల్లాణ్నెత్తుకుని లోపలి కెళ్లింది విహంగరా వయిదేళ్ల క్రితం గవర్నమెంటు సర్వీసులో రిటరయి, తర్వాతో నాలుగేళ్లేదో ప్రయివేటు కంపెనీలో మేనేజరుగాచేసి, వో ఏడాదిక్రితం అదొదిలేసి ప్రస్తుతం ఉద్యోగం ప్రమేయం లేకుండా విశ్రాంతి తీసుకుంటున్నాడు ఉద్యోగం చేసేటప్పుడు అడ్డమైన గడ్డికరచి, కొందర్ని నిజంగానే కరిచి, మరికొందరి వీపులు చరిచి పైకెళ్లాడు. వాగా సంపాదించి ఒక పెద్ద యిల్లూ, వో కారు, నాలు గెకరాల మావిడితోట, యింకేవో పొలాలు కొనుక్కుని యిప్పుడు పేపర్చదువుతూ కూర్చు న్నాడు. దానికి తోడితగాడి కొక్కడే కొడుకు. కానీ వాడికి చిన్నప్పట్నుంచీ దేంట్లోనూ అభిరుచి లేదు బజార్లవెంట తిరగటం, సినిమాల్చూట్టం అంటె ఎక్కళ్లేని సరదా ఎట్టాగో వాణ్ణి నెట్టు కెళ్లి బి ఎ దాకా లాక్కొచ్చాడు వాడు బి ఎ. పరీక్ష్రాసి, దాని ఫలితం రాకముందే వాడి పెళ్లి చేశాడు కోడలో ఏభై వేల కట్నం తీసుకొచ్చింది బి ఏ పరీక్ష్రాసిన వేసంగిలో పెళ్లయితే యిత గాడు కొడుకు పుట్టిన మూడో ఏటికి బి ఎ అయిందని పించాడు విహంగరావు తన పరపతి నువయోగించి కొడుకు నా వూళ్లోనే వున్న వో బ్యాంకులో ప్రొబేషనరీ ఆఫీసరుగా వేయించాడు

కొడుకు ఆఫీసుకు బయల్దేరి వెడుతూ, మెల్లగా తండ్రి దగ్గర కొచ్చి—

'నాన్నా! కారేసుకెళ్ళనా?' అంటే విహంగ రావు పేపర్లోంచి తల తియ్యకుండానే—

'వద్దురా నే నివ్వాళ ప్రమోదరావింటికెళ్లాలి వాడు చావు బతుకుల మీదున్నాట్ట అందుక నా కారుంచు పైదాకా నడిచి వెడితే రిక్షా ల్దొరుకు తయ్ రిక్షాలో పో నే నీ రిక్షాలు వెతుక్కుంటూ కూర్చోలేను అద్సరే అదేదో కారమ్మకాని కొచ్చిందన్నావ్ దాన్సంగతేవిటయ్యింది?' అన్నాడు

'వాడింకా ఏ విషయం తేల్చి చెప్పడల్లేదు' అన్నాడు కొడుకు నెమ్మదిగా

'నీ మొహం చూస్తే ఎవ్వరూ ఏదీ తేల్చిచెప్పరు కానీ, వాణ్నోకసారి మనింటికి తీసుకురా తేల్చేస్తా నా విషయం' అన్నాడు కొడుకు 'సరే' నంటూ బయట కెళ్లిపోయాడు

ఆ రోజుల్లో ప్రమోదరావుది, విహంగరావుది ఒకే ఆఫీసుకాదు అయినా యిద్దరూ ఒకరి ప్రతిభ ఒకరు విన్నారు యిద్దరూ అకస్మాత్తుగా ఒకసారి క్లబ్లో కల్సుకున్నారు

'మీ గురించి విన్నాను కానీ యిప్పుడే చూస్తు న్నాను యిహనించి తరచు చూసుకుంటూవుందాం' అన్నాడు విహంగరావు

'ఏవిటండోయ్ మా ఆఫీసు చేవుకు... వస్తున్నారా ఏం కొంప తవ్వి' అన్నాడు ప్రమోద రావు అని నవ్వాడు విహంగరావూ నవ్వాడు ప్రమోదరావుకి కొంపల్తియ్యటంలో నిద్దుర పట్టదు కొంపల్తవ్వుతాడు మళ్ళీ ప్రమోద రావే మొదలు పెట్టాడు

'మా ఆఫీసులో ఏవన్నా పనుందా మీకు? పనున్నా మీకేం? మీరు పైనుంచే కట్టుకు రాగల్రు పునాది లేకుండా పైనంతా గట్టిగా కట్టార్టగదా మీరు విన్నాన్లెండి' అన్నాడు ప్రమోదరావు నవ్వుతూ

'దాంట్లో అబద్ధ వేం లేదు లెండి బోల్డు నిజం వుంది అయినా మీరే ముఖాముఖి కను పిస్తే యింకా ఎందుకు?' అన్నాడు విహంగరావు తను కూడా నవ్వేస్తూ . విహంగరావు మొద లెట్టి—

'యింతకూ ఏం లేదు ... చిన్న విషయమే ....
మా ఆఫీసునుంచో వెండరొస్తోంది దాని
తాలూకు విషయాలు మీ ఆఫీసు ద్వారా చేయిం
చాలి' అంటూ చెప్పి, యింకేవేవో మాట్లాడు
కున్నారు రెణ్నెళ్లల్లో చెరో పదివేలు మిగుల్చు
కున్నారని తర్వాతందరూ చాటుగా అనుకున్నారు
యిలా స్నేహితులయ్యా రిద్దరూ

విహంగరావు చావు బతుకుల్లో వున్న ప్రమోద
రావుని చూసేందుకు వెళ్లాడు ప్రమోదరావో
పెద్ద యిల్లు కట్టుకున్నాడా వూళ్లోనే అతగాడి
కిద్దరు కొడుకులు పెద్దవాడా వూళ్లోనేవున్న
కాలేజీలో లెక్చరర్‌గా వుంటున్నాడు చిన్నవాడు
పెద్ద ఆఫీసరయ్యి బొంబాయిలో వుంటున్నాడు
బొంబాయికి టెలిగ్రాం యిచ్చారుట కానీ యింకా
చిన్న కొడుకు రాలేదు పెద్ద కొడుకుని కూడా
తన లైన్లో దింపుదామని ప్రమోదరావు విశ్వ
ప్రయత్నం చేశాడు స్నేహితుడైన విశ్వపతిచేత
కూడా చెప్పించాడు కానీ అతగాడికివంటె సరి
పళ్లేదు

' సరే వాడి కర్మకి మనం కర్తలమా? .
కర్త, కర్మ క్రియలనేవేవో వుంటయ్ గదా!' అని
వదిలేశాడు ప్రమోదరావు విహంగరావు వెళ్లే
సరికి కళ్లు తెరుచుకు చూస్తున్నాడు ప్రమోద
రావు మాట మాత్రం పడిపోయింది బొడ్లో
ఏదో మూట కట్టుకున్నాడు ఆ మూట మాత్రం
జారిపోకుండా పట్టుకున్నాడు పెద్దకొడుకు సదా
నందం కాలేజీకి శలవుపెట్టి దగ్గిరే కూర్చుని తుల
శాకుతో నీళ్లు నోట్లోపోస్తుంటె గొంతు దిగటం
లేదు నోట్లోంచి బయట కొచ్చేస్తున్నయ్ నీళ్లు
విహంగరావు వెళ్లి కాస్సేపు చూసి, సదానందాన్ని
మాత్రం పక్కనుంచుకుని మిగతా వాళ్లని బయట
కెళ్లమని—

'మీ నాయనకీ, నాకూ బోల్డు డబ్బాశ యీ
ఆస్తంతా అట్నానే సంపాదించాడు నీ గురించే దిగు
లుగా వుంది యిప్పటికీ దిగులు పడ్తూనేవున్నాడు,
అట్నాడు' అని ప్రమోదరావొంక చూపిస్తే
ప్రమోదరావు 'అవునన్న'ట్టు తలాడించాడు సదా
నందం తండ్రి వేపు తిరిగి—

'నాన్నా' నా గురించేం దిగులు పడబోకు
యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ స్కేళ్లు యింప్లి
మెంటు చేస్తేనట్ట వచ్చేఏణ్ణించి' అన్నాడు ప్రమోద
రావు మూలిగాడు విహంగరావు ఫెళఫెళా నవ్వ
బోయి, యిప్పుడలా నవ్వగూడ్దనుకుని, చిన్నగా
నవ్వి—

'ఏంస్కేళ్లూ, ఏం బద్దలూనోయ్ పైసంపా
దన్లేకపోతే యీ స్కేళ్లూ, బద్దలూ ఏంచేస్తయ్
అందుకే నిన్ను గురించి మీ నాన్నకు దిగులు
అద్సరే అంత డబ్బాపేక్ష వున్నవాడికి తులశాకుతో
నీళ్లుపోస్తే మింగుతాడా? లంచాలు మింగే
వాడి కిట్లానా పోసేది? వో రూపాయి బిళ్ల
తీసి దాని మీదుగా నీళ్లుపొయ్యి' అన్నాడు విహంగ
రావు సదానందం అలమర దగ్గిర కెళ్లి పర్సులోంచి
రూపాయి బిళ్లతీసుకుని దానిమీదగా తండ్రినోట్లో
నీళ్ళు పోశాడు కానీ ప్రమోదరావు మింగలేదు,
పైగా వుమ్మేశాడు కిందికి

విహంగరావు కాస్సేపాలోచించాడు. వెంటనే

# గురుద్యోగ పర్వం

తన జేబులోని రూపాయి బిళ్లతీసి దానిమీదుగా
ప్రమోదరావు గొంతులో నీళ్ళు పోశాడు ప్రమోద
రావు నీళ్లు మింగకుండా కళ్లు చిట్లించి విహంగ
రావు వంక చూశాడు విహంగరావది గ్రహించి—

'అహ యీ రూపాయి నీ కొడుకు సంపా
దించినట్లు సంపాదించింది కాదు మన దార్లో
వచ్చిందే మొన్న నెవడో వచ్చి వో పై ఆఫీసరుకి
రికమెండేషన్ లెటరు రాయించు కెళ్లాడు, ఆ ఆఫీ
సరు మనవాడేలే ఆ లెటర్రాసిచ్చి పుచ్చుకున్నానీ
డబ్బు' అన్నాడు ప్రమోదరావు సంతోషించి
నీళ్లు మింగాడు రెండు రోజులుగా నీళ్లు మింగని
వాడు రెండుగ్లాసుల నీళ్లు తాగాడు

'చూశావా? అన్ని లంచాలు పట్టిన వాణ్ణి
నా గతెట్లా అయ్యిందో చివరికి లంచం మింగ
లేకపోయినా లంచం డబ్బులోత్తే నీళ్లు మింగుదా
వంటె ఒక్క రూపాయి గతిలేకుండా పోయింది
యిలాంటి అప్రయోజకుడు దొరికాడు' అంటూ
న్నట్టు సదానందం వేపు కొరకొరా చూ శా డు
ప్రమోదరావు




ఒప్పట్టు ఆయాసపడకు ఏంచెప్తాం'
చెట్టున పూచిన పువ్వులన్నీ కాయలవుతయ్యా
అదృష్టవంతులకి మూడు పువ్వులు పూస్తే ఆవే
ఆరు కాయలై జీవితం 'మూడు పువ్వులూ— ఆరు
కాయ'ల్లా వుంటుంది లేనివాళ్లకి ఆరుపువ్వులూ
మూడు కాయలే వారి అయినా నీకేంలే! అరవై
కాయల పెట్టు, అరవై మందిని పట్టి, వందల
మందిని కొట్టితినే నీ చిన్నకొడు కున్నాడుగా?'
అన్నాడు విహంగరావు

ప్రమోదరావు చిన్న కొడుకు పేరు రంగారావు
రంగులు మార్చటంలో సిద్ధహస్తుడు గోడమీది
బల్లిలా రంగులు మారుస్తాడు, గోడమీదిపిల్లిలా
చెంగున అటో యిటో, ఎటు వీలుంటె అటు దూకు
తాడు. ఆఫీసర్నిబట్టి తన రంగు, తన షర్టురంగు
మార్చేస్తాడు, అట్లా మార్చేసి వాళ్లని పడ్తాడు
యిప్పుడు బొంబాయిలో ఏదో కంపెనీలో చీఫ్
ఎక్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుంటున్నాడు

'వాడే నా కొడుకు .. నా పరువు నిలబెట్టే
వాడు.... మా వంశం కరువు తీర్చేవాడు' అని ప్రమో
దరావు మెచ్చుకుంటాడు సదానందాన్ని తిట్టు
కుంటాడు సదానందానికో కోరికంటూ లేదు.
ఎప్పుడూ సరిపెట్టుకు పోవటమే అతగా డలవాటు.
యింట్లో అన్నీ సరిగా లేకపోయినా సరి పెట్టుకు
పోతాడు అంతేగానీ, అది తెచ్చుకుని అనుభవిద్దాం
అనే జ్ఞానం లేదు సదానందం పెళ్లాంకూడా అప్పు
డప్పుడూ మావగార్తో అనేది—

'ఏవిటోనండీ! . యీాయన కసలు పై సంపా
దన సంపాదిద్దావనే ధ్యాసే లేదు కాలేజీ వాళ్లం
తిప్పే అంత పుచ్చుకు చక్కా వస్తారు ఆయనకి
మీరన్నా నేర్పరాదు మావగారూ !' అనేది గుమ్మం
దగ్గిర నిలబడి

'అమ్మాయ్ నేర్పటం అంత కష్టంకాదు ...
పైన సంపాదించే మార్గాలు బోల్డున్నయ్ .
వాటినేం మనం సృష్టించక్కర్లేదు, అందుకే
ఆదే వంత బ్రహ్మ విద్యకాదు అసలు మన
వాడికి కోరికంటూ వుంటేగా? కోరికంటూ వుంటే
నా దగ్గిరో కోటి వుపాయాలున్నయ్, నీ మరిది
దగ్గిర కూడా దగ్గిర్దగ్గిర అన్ని వుపాయాలూ
వున్నయ్ అసలిక్కడ మొదలే లేదుగదా?! ..
మొన్నటికి మొన్ననూ అంతే అదేవిట్రా? అలా
పీక్కుపోయిన చొక్కా వేసుకెడ్తున్నావ్? కాలేజీలో
పిల్లల్నాశారంటె అది కూడా లాక్కుపోతారు .
ఏ వయింది? ప్రింకయిందా?' అంటే

'కాదునాన్నా! యీ నెల్లో ఎనిమిది రూపా
యిలే మిగిల్నయ్ పది రూపాయలయితేగానీ పూర్తి
చొక్కారాదు అందుకని ఎనిమిది రూపాయ
ల్లోనే కుట్టించు కున్నాను, అందుకని కొంచెం
పొట్టిదయింది 'కట్ యువర్ కోట్ ఎకార్డింగ్
టు యువర్ క్లాత్' అన్నారుగా అదీగాక పేష
ననుకుంటార్లే' అంటాడు ఊయిహ వాడంతే
నమ్మా! యీ ముసల్తనంలో వీడిదో పెద్ద
బెంగయ్యింది నాకు' అని నెత్తిమీద కొట్టుకునే
వాడు ప్రమోదరావు

ఎప్పుడన్నా రంగారావచ్చినప్పుడు వదినగారు
అతగాడ్తో కూడా చెప్పేది—

'ఏ విటోనయ్యా! మీ అన్నయ్య ధోరణి నాకేం
నచ్చలేదు' అంటూ.

'వదినా! వో వన్పెయ్యి అన్నయ్యవనతే
అంతంత మాత్రం కోరికలు అందులో యీ
మధ్య కథలు కూడా రాస్తున్నాడాయె యీ రచ
యితల కసలు కోరికలుండవ్ ఎందుకో తెల్సా ?
వీళ్ల క్కావల్సినవి, కావాలనుకున్నవీ అన్నీ కథల్లో
పాత్రల కిచ్చి, 'ఆహా! కోరిక తీరెనుగా యిక
కోరికే లేదుగా!' అని పాడుకుంటూ గడుపుతారు
అందుకని అన్నయ్యచేత కథ వ్రాయటం మాన్పించు'
అని చెప్పి—

'అయినా యింక అన్నయ్యేం మార్తాడుగానీ .
యీ వాసుగాణ్ణి నా దగ్గిరకి పంపించు, లేకపోతే
వాణ్ణికూడా చెడగొడ్తాడన్నయ్య నేను వీడినో
పెద్ద ఆఫీసర్ని చేసి నీ కప్పగిస్తాను' అనే వాడు
రంగారావు

'ఏ వో నాయనా చూడుమరి' అనేది వదిన
గారు అలాంటి చిన్న కొడుకు రంగారా
వొచ్చాడు రంగారావుని చూడంగానే ప్రమోద
రావు పొంగిపోయాడు మంచం మీంచి లేవ
బోయాడు, కానీ పడిపోయాడు.

'నాన్నా! లేవకు' అంటూ రంగారావచ్చి ప్రమోదరావుని పట్టుకున్నాడు ప్రమోదరావు రంగారావు పొట్టమీద, తర్వాత జేబుమీద చెయ్యివేసి—

'బాగా పెరుగుతోందా?' అన్నట్టు కళ్ళు తిప్పాడు

'ఆహా బాగానే వుంది మొన్నద్దాకా పైవాడు పైనొచ్చే వాటిల్లో మూడొంతులిమ్మనే వాడు యిప్పుడదేంలేదు యిద్దరికీ సగం సగం' అన్నాడు రంగారావు ప్రమోదరావు సంతోషంతో మెరిసిపోయాడు కానీ సదానందాన్ని, అతగాడి జేబున్నీ చూడంగానే కన్న కడుపు తరుక్కుపోయింది సదానందం చెయ్యి రంగారావు చేతిలో పెట్టి—

'జాగ్రత్త' అన్నట్టు తలూపి కళ్ళుమూశాడు కానీ చచ్చిపోలేదు ఆ సాయంత్రానికి కన్ను మూశాడు

విహంగరావింటి ఎదురుగా వో పెంకుటిల్లుంది దాంట్లో అయిదేళ్ళనాడు రిటరయిన వెంకట్రావుగారు కొడుకు పంచన చేరి ముందు వసారాలో మంచం వేసు క్కూర్చుంటాడు వెంకట్రావుగారు వెర్రిబాగులవాడు ప్రతిదీ రూల్సు ప్రకారం చెయ్యాలనే యితగాడి తాపత్రయం ఆఫీసులో పన్చేసేటప్పుడు కూడా అట్లానే చేశాడు యిప్పుడు రిటయిరయ్యాక్కూడా అట్లానే చేస్తున్నాడు రేషన్ షాపు కెళ్ళి, షాపుకి ఫర్లాంగు దూరంవరకూ వున్న క్యూలో నిలబడి నాలుగు తడవలు కళ్ళు తిరిగి పడినా, పడి దెబ్బలుతిన్నా మనిషిలో ఏం మార్పు లేదు క్యూలో నిలబడకుండా బియ్యం తేగలిగే నేర్పేలేదు పదింటి కెళ్ళినవాడే వంటి గంటకో తిరిగొస్తే కోడలు విసుక్కునేది, అందులోనూ నోర్పు తక్కువ పిల్ల కావటంతో యితగాడి కేనేర్పూ లేదని విసుక్కునేది

'అవును అసలా నేర్పు లేకపోబట్టేగా యిట్లా ఏడుస్తున్నాం అందరం' అనేది యీ మాట యీవిడ రోజుకో నలభై సార్లంటుంది దీనివెనకాలో కథుంది

అవి వెంకట్రావుగారు ఏదో ఒక ఆఫీసులో సూపరింటెండెంటుగావుండే రోజులు 'ఆ ఆఫీసులోనా వుద్యోగం యింకేం, ఫరవాలేదు' అన్నారందరూ కానీ వెంకట్రావు గారెప్పుడూ రిక్షా ఎక్కిన పాపాన పోలేదు అంటె రిక్షా ఎక్కటం పాపం అనికాదు పాపం డబ్బుతో రిక్షా ఎక్కలేదు

'ఏవిటండీ! మీ ఆయన ఆ ఆఫీసులో పన్చేస్తూ కూడా మొహం అట్లా పెట్టుకొస్తాడేం ఆ ఆఫీసులో ప్యూన్ కూడా కళకళ్లాడుతూ వుంటాట్ట' అనేవాళ్ళు కొందరీయన పెళ్ళాంతో పెళాం ఏఁవీ మాట్లాడేది కాదు..

వెంకట్రావుగారికి ముగ్గురు పిల్లలు రెండు చేతులా సంపాయించలేనివాడు కావటం మూలాన ఒంటి రెక్కతోనే వాళ్ళందరికీ కాలేజీ చదువు లెప్పించాడు పెద్ద కొడుక్కి యింటర్మీడియట్ అవంగానే యింజనీరింగ్ సీటొచ్చింది 'అదృష్టం' అన్నారందరూ కానీ వెంకట్రావుగారు చాలా మధన పడ్డాడు 'తను కొడుక్కి యింజనీరింగు చెప్పించ గలడా?' అని ఆలోచించాడు ఎంతో ఆలోచించి చివరికి—

'అబ్బాయ్ . యీ చదువులు మనబోటి వాళ్ళ క్కాదురా మనం ఎప్పుడూ తాహతుకు మించిన పన్లు తల పెట్ట కూడదు తలబెట్టితే ఆ బరువుతో ఎన్నో అవినీతిపన్లు చెయ్యాల్సొస్తుంది అలాటివి మన కొద్దు' అని అతగాణ్ణి బి ఎ చదివించి తరువాత బి యిడి చెప్పించి మాస్టరుగా చేర్చాడు అందుకని కోడలుపిల్ల ఎప్పుడూ అట్లా సాధిస్తూ వుంటుంది కొడుక్కూడా అట్లానే మాట్లాడ్తాడు యింతమందిచేత చివాట్లు తింటూ కూడా వెంకట్రావుగారు ఒక్క ముక్క కూడా మాటాడ్డు ప్రతి మధ్యాహ్నం నిద్ర పట్టక తన సర్టిఫికెట్లు, యింకేవో కాగితాల కట్టలూ ముందేసు క్కూర్చుని చూస్తూ, వారాని కొకసారి తనకి రావాల్సిన పెన్షన్ డబ్బు పంపమని పైవాళ్ళకి వుత్తరాలు రాస్తూ వుంటాడు యీ అయిదేళ్ళ నించీ వారాని కో వుత్తరం రాస్తూనే వున్నాడు శనివారం నాడుత్తరం రాసి పైవాళ్ళు మనియార్డరో, వుత్తరం రాస్తారని మళ్ళీ శనివారం దాకా కని పెట్టు కూర్చునేవాడు రోజూ పోస్టుమేన్ని పిల్చి 'నాకేదన్న వుత్తరంగానీ, మనియార్డరుగానీ వుందేమో చూడు' అని శుక్రవారందాకా అడిగేవాడు శనివారం వాడొస్తే 'నా కో మనియార్డరుంది చూడు' అంటె వాడు నిజమేనను




కుని పది తడవలు వెదికి లేదన్చెప్పి చక్కాపోయేవాడు వెంకట్రావుగారు వాడి వెనకాల పోస్టాఫీసు కెళ్ళి పై వాళ్ళ కింకో వుత్తరం రాసి డబ్బాలో వేసొచ్చేవాడు యిలా ప్రతి శనివారం దాకా దేనికైతే కనిపెట్టు క్కూర్చుంటున్నాడో ఆ పెన్షను యీ అయిదేళ్ళనించీ రాలేదు ఆదివారం వచ్చిందంటే యీయన కేంతోచదు 'పోస్టు వాడివ్వాళ రాడుగదూ' అనుకుంటూ గడిపేవాడు మిగతా రోజుల్లో పోస్టుమేన్ రావటం కొంచెం ఆలశ్యం అయితే బజారు చివర్దాకా అతగాడి కెదురెళ్ళి, మరీ వచ్చేవాడు అప్పుడప్పుడూ ఆ పోస్టుమేన్ "మీకేం లేవండి . మీ పక్కిళ్ళల్లో యీ రెండూ యిచ్చెయ్యండ"ని మూడుత్తరా లిచ్చేవాడు

పెన్షనొస్తే కళ్ళద్దాలు మార్పించాలని కలలు కనేవాడు ప్రతి మధ్యాహ్నం ఏం తోచక 'వో తెల్ల కాగితం యివ్వరా' అని మనవడ్దగ్గర్నించొక కాగితం తీసుకుని, పెన్షనొచ్చాక ఏవేం కొనాలో వో లిస్టు తయారేసుకునేవాడు రోజారోజుకీ ఆలిస్టు పెరిగి పోయేది కానీ పెన్షన్ మాత్రం ..

వెంకట్రావు గారింటి పక్కనే సర్వేశ్వర్రావ నొకాయ నుంటున్నాడు. యితగాడు కూడా రిటయిరయ్యింది చిరుద్యోగిగానే. వో ఆరేళ్ళ క్రితం రిటయిరయ్యాడు .. సర్వేశ్వర్రావుకి సర్వవిద్యలూ వచ్చు. అతగాడు రిటయిరయ్యింది గుమాస్తాగా "రిటయిరయ్యింది దగ్గర్నించీ సర్వేశ్వర్రా వేంచేస్తున్నాడ"ని ఎవరన్నా అడుగుతే నలుగురూ నాలుగు విధాల చెపుతారు ఆయన డాక్టరంటారు కొందరు మరి కొందరు ప్లీడరు గుమాస్తా అంటారు యింకొందరు ఆయన మాస్టరంటారు. యింకొందరు ఆయన మంత్రాలు వేస్తాడంటారు యిట్లా యింకే వేవిటో అంటారు .

సర్వేశ్వర్రావు పొద్దున్నే అయిదింటికి లేచి స్నానంచేసి వీధి పంపులో మంచి నీళ్ళపట్టి, కాస్సేపు పూజ్జేసుకుని బయట కొస్తాడు బయటికి రాంగానే నలుగు రయిదుగురు పిల్ల లెత్తుకు నిలబడి 'పంతులు గారూ! యీడికి కాలు బెణికిందండీ' 'దీనికి కన్ను ఒణికిందండీ' అని 'మంత్రం వెయ్యండి' అంటారు సర్వేశ్వర్రావు నాలుగు గడ్డిపోచ లీసుకుని వాటితో కాలిమీదో, కంటిమీదో రాసి, 'రెండు పూట్లా వేడి నీళ్ళతో కాపు పెట్టండి' అని చెప్పి పంపించేస్తాడు ఆ రెండు గడ్డిపోచలు తీసుకెళ్ళి గుడి దగ్గరున్న పూలచెట్టు మొదట్లో వెయ్యమనేవాడు దేవుడికో దండం పెట్టుకు వెళ్ళమని కూడా చెప్పేవాడు వాళ్ళట్టా వో వారం రోజులు తిరిగి 'పంతులు గారి మంత్రానికి తగ్గిపోతోంది' అని వారం అయ్యాక 'తగ్గిపోయింది' అంటారు కూరా, నారా తీసుకొచ్చిచ్చే వాళ్ళు సర్వేశ్వర్రావు కూర తీసుకుని 'నారయ్యా నారొద్దోయ్ ఆ నారని కొంచెం పేని తాడు తీసుకురా' అంటే నారయ్య ఆ నార నామరూపాల్లేకుండా పేని తాడుగా తీసుకొచ్చేవాడు

సర్వేశ్వర్రావుకి బతకటం తెల్సు 'కోటివిద్యలు కూటికొరకే' అన్న సామెతని బాగా అర్థం చేసుకుని కూటికి కోటి విద్యలు కావలెను అని భాష్యం చెప్పుకున్నాడు అందుకే సర్వేశ్వర్రావు సర్వవిధాలా సంపాదించాలని చూస్తాడు అట్లా పొద్దున్నే అందరికీ 'మంత్రం' వేసి పంపించేసి కాసిని మజ్జిగ తాగి వూరుమీద పడ్తాడు యితగాడు ధర్మామీటరు లేని వాళ్ళందరికీ డాక్టరు సర్వేశ్వర్రావుని చూడంగానే 'డాక్టరు గారొచ్చా'రంటూ మంచం తీసుకొచ్చి బయట పడేస్తారు సర్వేశ్వర్రావు మంచం మీద కూర్చుని జేబులోంచొక చిన్న పెట్టె తీస్తాడు ఆ పెట్టె రిస్టువాచీ పెట్టుకునేది కానీ అందులో వున్నది రిస్టువాచీ కాదు ఆ పెట్టె లోంచొక చిన్న తగరం చుట్ట తీసి చుట్టూ వున్న తగరం తీస్తాడు చుట్టూ వున్న వాళ్ళెంతో ఆసక్తితోనూ, ఆశతోనూ చూస్తూ వుంటారు తగరం తీశాక యింకో తెల్లకాగితం చుట్ట బయట పడ్తుంది ఆ తెల్ల కాగితాన్ని తొలగించి ?? ధర్మామీటర్ని బయటికి తీస్తాడు దాన్ని చూడంగానే రోగి తాలూకు మనుష్యుల మొహాల్లో 'రిలీఫ్' కనిపిస్తుంది రోగిలో మాత్రం ఏం 'రిలీఫ్' కనిపించదు ధర్మామీటరు రోగి నోట్లోంచి తీసి చూస్తూ సర్వేశ్వర్రావు కొంచెం సంతోషం చూపించి—

'నిన్నటి కంటె కొంచెం తగ్గింది జ్వరం' అంటాడు. 'అట్లానా' అంటారు వాళ్ళు. అంతే గానీ 'నిన్నెంత?' అనీ 'యివ్వాళ్ళెంత?'నీ అడగరు తర్వాత ఏవో మాత్రలిచ్చి బయట కొస్తాడు వార్రోజులు నల్లమాత్రలు, మూడ్రోజులు తెల్ల

## 18 క్లూలకు తెలుగు అనువాదం

1 దేశంలో పేదరికం, ఆకలి, శోషణ, అన్యాయం ప్రబలియున్నంత వరకు ప్రజలకు హింసక ఆందోళన / తిరుగుబాటు యందు ఆకర్షణ వుంటుంది

2 కళ/విజ్ఞానం, సత్యానికి తన దూరవు మరియు ఎడతెగని ప్రయాణంలో వివిధ ఉరవడులతో ప్రవహించుచూ నానావిధభూములందుపొంగిపొరలే నదివంటిది

3 కేవలం నిజమైన విశ్వాసం, నిజమైన జ్ఞానం మరియు నిజమైన కర్మ / విచారణయే ఆత్మకు సంపూర్ణ శుద్ధిని కలిగిస్తుంది

4 అధికారశక్తి కోసం పోటీ లోకతంత్రము / సమాజమునకు చెరుపు

5 మానవుని గుణవిశేషం అతనికృత్యం/ఉనికినిబట్టి నిర్ణయింపబడగలదనికాని అతనివాక్చాతురినిబట్టికాదు

6 కవితాసంబంధం సత్యంతో కూడియుంటుంది, భావన/ కల్పనయొక్క ప్రతిభ శోభాయమానంవలెనే

7 విజ్ఞానం యొక్క సంబంధం యదార్థవిషయాలతో గూడినది, అవి తాత్వికతలోనివి, ఇతర విషయాలతో సంబంధ రహితమైనవి, మరియు భావనాత్మక / నైతిక విషయవస్తువులతో పూర్తిగా విరహితం కానివి గనుక

8 ఆర్థికసమానత / స్థిరత వ్యక్తిగత స్వతంత్రం మరియు లోకతంత్రం, ఇవన్నియు మానవకోటి యొక్క భావిఅభ్యుదయానికి అత్యంత ముఖ్య ప్రాముఖ్యాంశములు

9 మానవ సేవ అంత సులభసాధ్యం కాదు, ఎందుకనగా మీరు చిత్తస్థిరత / వినమ్రతను అలవర్చుకోకపోయినట్లయితే శుద్ధత మరియు జ్ఞానం సహితం మిమ్మలను పథభ్రష్టులను గావిస్తుంది

10 పరమ సుఖప్రద భావనయొక్క ఉద్బోధన అనుభూతి మరియు ఉపభోగంకోసం వినయం మరియు ఆత్మసమర్పణ అవసరం

11 బాహ్య / మానసిక శాంతి లేనప్పుడు మానవుడు అంతర్ముఖి అయిపోతాడు

12 మన వికాసం హీనమైనందుచేత మరియు మన శ్రద్ధ / బుద్ధి పైపై బూటకముగుట చేతను జనులలో శాంతి సౌహార్ద్రములను నెలకొల్పే యత్నంలో మనం విఫలులమై పోతున్నాం

13 ప్రేరణ / అంతర్జ్ఞానం నిజంగా సాధారణాంశం కాదు దాని ఉనికియే అరదు, అభివృద్ధి చేయుటసాధ్యం

14 ఏదైనా శ్రుతిగలది/స్వాభావికమైనది మధురం

15 వ్యక్తులు ఏకాంత వాసమున పనిచేయ గలరు, కాని పూర్తిగా సమాజం కేవలం సమగ్రతతో స్థిరమైన / ఆధ్యాత్మికమైన జీవన సందర్భంలో యోచించగలరు

16 కళాకారుని సృజనాత్మక కృతిని దాని వ్యక్తిత్వ / దర్శన లేక జీవన సంబంధమైన దృష్టి నుండి వేరుపరచడం తప్పు

17 సాధారణ మరియు తరుచుపైకి కనిపించే అర్థరహిత సంఘటనలలో కవి/యోగి గాఢమైన నీతిసంబంధ సందేశభరితమగు చిహ్నములను చూస్తాడు

18 జాతీయ/ ధార్మిక మతభేద వైషమ్యము లున్ననూ ప్రతి సాంస్కృతికి ప్రాణసారం ఒక్కటే

## No. 33: 18 CLUES

1. People will have an attraction for violent **Agitation / Revolution** so long as there is poverty, hunger, exploitation and injustice in the country
2. **Art / Science** is like a river leaping over a diverse terrain and moving with varying tempo during its long and ceaseless journey to reality
3. Right faith, right knowledge and right **Conduct / Thought** alone will bring about the complete purification of the soul
4. The rivalry for power is the bane of **Democracy / Society.**
5. Man is to be judged by what he **Does / Is** and not by what he professes
6. Poetry deals with truth as coloured by **Emotion / Imagination**
7. Science deals with facts as they are in abstraction, unrelated to other things and altogether devoid of **Emotional / Moral** content
8. Economic **Equality / Stability** and individual liberty and democracy are all values of utmost importance to the future welfare of mankind
9. It is not so easy to serve humanity for even purity and knowledge may lead you astray unless you have acquired **Equanimity / Humility**
10. Humility and self — surrender are essential to the **Evocation / Realization** and enjoyment of blissful feeling
11. When there is no **External / Mental** peace man turns inward
12. It is because our trust is weak, our **Faith / Growth** superficial, that we do not succeed in our attempts to create peace and goodwill among men
13. **Inspiration / Intuition** to be sure is not a common commodity **Rare in its existence** it is hardly cultivable
14. Anything **Musical / Natural** is harmonious
15. Individuals can work in solitude, but society as a whole can think of **Normal / Spiritual** life only in plenitude
16. It is wrong to separate the creative work of the artist from his **Personality / Philosophy** or outlook on life
17. In ordinary and often apparently meaningless happenings, the **Poet / Saint** sees symbols full of deep ethical message
18. Despite **Racial / Religious** differences the core of every culture is the same

గమనిక పై క్లూలు భారతీయ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి అవి పూర్తి వాక్యములు మరియు వేరు వేరుగా పూర్తి అర్థవంతమైనవి గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు రిటక్కీ జ్ నిక్కీ లో ప్రచురించబడును

## గురుద్యోగ పర్వం

మాత్రలు యిస్తాడు 'యితగాడ్చేతుల్లో నయం కానీ జబ్బంటూ లేదం'టూరంతా వీధి వంపుల్దగ్గిర నీళ్ళు పట్టుకుంటూ దీంటో నిజమెంతో తెలియదు కానీ ఒకటి మాత్రం నిజం— సర్వేశ్వర్రావు సీరియస్ జబ్బుల జోలికి పోడు జలుబు, జ్వరం, తలకాయ నొప్పి యిలాంటివే యితగాడ్చూసేది కానీ సర్వేశ్వర్రావు వో పది రోజులకి జలుబు తగ్గించి—

"నేను ఆపరేషన్లు తప్ప మిగతావన్నీ చేస్తాను. ఈ రేషన్లొచ్చాక బలంపోయి చెయ్యి కొంచెం వణుకుతోంది అందుకని ఆపరేషన్లిప్పుడు చెయ్యటం లేదు" అంటాడు. కానీ యితగా డాపరేషన్లు కాదు గదా, యింజక్షన్లు కూడా చెయ్యలేదని ఆ వీధిలోనే బోర్డు కట్టి 'డిస్పెన్సరీ' అని ఒకటి వోపెన్చేసిన కృష్ణమూర్తి అంటాడు 'కృష్ణమూర్తి కూడా డాక్టరే! కానీ ఎం బి బి యస్ కాదు యితగాడ్దగ్గిర ధర్మామీటరె కాకుండా, స్టెత స్కోపు కూడా వుంది యింజక్షన్లు కూడా చేస్తానని బోర్డు మీద రాసుకున్నాడు కానీ యితగాడు పెద్ద డాక్టర్నని క్లబ్బులో కల్సుకుని వాళ్లతో మాట్లాడి మర్రోజొచ్చి పేషంటుకు యింజక్షన్చేస్తాడని ప్రతీతి ప్రతివాడూ అనుకునేమాట యిలాంటి కృష్ణమూర్తి 'సర్వేశ్వర్రావు కింజక్షన్చెయ్యటమే రాదు స్టెతస్కోపు లేదు' అని చెపుతూవుంటాడు దానికి ప్రతీకారంగా సర్వేశ్వర్రావు

"యింగ్లీషు మందుల్లో ఏం వుందండీ?! మీకో సంగతి చెప్పనా? మన తెలుగు మందుల్లో తప్ప యింగ్లీషు మందుల్లో జలుబుకి మందే లేదు! ఏ యింగ్లీషు డాక్టర్నైనా జలుబుని తగ్గించమనండి చూద్దాం?!! అట్నా గనక తగ్గిస్తే నా ప్రాక్టీ సొదిలేస్తాను మళ్లీ యీ ధర్మామీటరు ముట్టుకొనే ముట్టుకోను" అనేవాడు అని నవ్వేవాడు పక్క వాళ్లు కూడా నవ్వేవాళ్లు

యిలా పదింటిదాకా వైద్యం చేసి పదిన్నర కల్లా కోర్టు దగ్గిర కెళ్లి ఆ వరండాలో కూర్చుని స్టాంపులూ, అవీ అమ్ముతాడు వో గంట అక్కడమ్మి పన్నెండింటికల్లా తాలుకా ఆఫీసు కొస్తాడు అక్కడ "చలానా" ఫారా లమ్ముతాడు తాలుకా ఆఫీసులో ఎవడన్నా డబ్బు కట్టానికెడితే చలానా ఫారా లివ్వరెందుకనో?! ఏ బ్యాంకులో అన్నాకడితే వూరికెనే యిస్తారు కానీ యీ తాలూకా ఆఫీసులో యివ్వరు " 'చలానా ఫారం' ఒకటివ్వండి" అంటె నిద్రపోతున్న క్లర్కులేచి ఏం మాట్లాడకుండా సర్వేశ్వర్రావు వేపు చూపిస్తాడు సర్వేశ్వర్రా వయిదు పైసలు పుచ్చుకుని ఒకటిస్తాడు అతగాణ్ణే అది పూర్తి చెయ్యమంటె ఎనిమిది పైసలు పుచ్చుకుంటాడు యిలా ఒంటి గంటదాకా అమ్మి యింటి కొచ్చి భోంచేసి మళ్లీ రెండింటి కల్లా బయల్దేరి కొన్ని కాఫీ హోటళ్ల కెళ్లి అక్కడేవో ఎకౌంట్లు రాసి ఆరింటి కింటి కొస్తాడు. యింటి కొచ్చి స్నానం చేసి మళ్లీ కొందరికి

(63వ పేజీ చూడండి)

14 భాషలు 100 ఏజెంట్లు 150 పత్రికలలో ప్రకటనలు

అఖరు ముగింపు తేది: 15—5—68.
సొల్యూషన్ ఆంధ్రపత్రిక 19-5-68.
ఫలితాలు భారత్ జ్యోతిలో 2-6-68
* సొల్యూషన్ వెంటనే పొందుటకు 6 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను • లిట్‌క్విజ్ వీక్లీ 10 సంచికలకు రు 2/- పంపవలెను. * మీ ఎంట్రీలను తేది 14-5-68 బుధవారమునాడు కూడా పంప వచ్చును కాని వాటిని ఎక్స్‌ప్రెస్ డెలివరీలో పంపవలెను

LITQUIZ NO 33
Rs. 35,000
FIRST PRIZE - Rs. 17,500
RUNNERS-UP (UPTO 4 ERRORS) Rs 9,000
MINIQUIZ (A) ALL CORRECT ONLY Rs 2,000
RELIEF FUND - Rs 1,000
FOR EVERY MINIQUIZ (B) ALL-CORRECT HAWKINS PRESSURE COOKER
TOTAL PRIZES (UPTO 2 ERRORS) Rs 5,500

—— లిట్ క్విజ్ నెం. 33 అధికార ఎంట్రీ ఫారము ——

ADDRESS LITQUIZ No 33, ALANKAR, BALARAM STREET, BOMBAY-7 (W B)

గమనిక (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి (3) ఎంట్రీలను M O ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M O రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M O రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P O. క్రాస్ చేయ వద్దు. అది లిట్‌క్విజ్ నెం. 33 బొంబాయి–7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| | 1 | Re 1 | | 2 | Re 1 | | 3 | Re 1 | | 4 | Re 1 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | AGITATION | REVOLUTION | 1 | AGITATION | REVOLUTION | 1 | AGITATION | REVOLUTION | 1 | AGITATION | REVOLUTION |
| 2 | ART | SCIENCE | 2 | ART | SCIENCE | 2 | ART | SCIENCE | 2 | ART | SCIENCE |
| 3 | CONDUCT | THOUGHT | 3 | CONDUCT | THOUGHT | 3 | CONDUCT | THOUGHT | 3 | CONDUCT | THOUGHT |
| 4 | DEMOCRACY | SOCIETY | 4 | DEMOCRACY | SOCIETY | 4 | DEMOCRACY | SOCIETY | 4 | DEMOCRACY | SOCIETY |
| 5 | DOES | IS | 5 | DOES | IS | 5 | DOES | IS | 5 | DOES | IS |
| 6 | EMOTION | IMAGINATION | 6 | EMOTION | IMAGINATION | 6 | EMOTION | IMAGINATION | 6 | EMOTION | IMAGINATION |
| 7 | EMOTIONAL | MORAL | 7 | EMOTIONAL | MORAL | 7 | EMOTIONAL | MORAL | 7 | EMOTIONAL | MORAL |
| 8 | EQUALITY | STABILITY | 8 | EQUALITY | STABILITY | 8 | EQUALITY | STABILITY | 8 | EQUALITY | STABILITY |
| 9 | EQUANIMITY | HUMILITY | 9 | EQUANIMITY | HUMILITY | 9 | EQUANIMITY | HUMILITY | 9 | EQUANIMITY | HUMILITY |
| 10 | EVOCATION | REALIZATION | 10 | EVOCATION | REALIZATION | 10 | EVOCATION | REALIZATION | 10 | EVOCATION | REALIZATION |
| 11 | EXTERNAL | MENTAL | 11 | EXTERNAL | MENTAL | 11 | EXTERNAL | MENTAL | 11 | EXTERNAL | MENTAL |
| 12 | FAITH | GROWTH | 12 | FAITH | GROWTH | 12 | FAITH | GROWTH | 12 | FAITH | GROWTH |
| 13 | INSPIRATION | INTUITION | 13 | INSPIRATION | INTUITION | 13 | INSPIRATION | INTUITION | 13 | INSPIRATION | INTUITION |
| 14 | MUSICAL | NATURAL | 14 | MUSICAL | NATURAL | 14 | MUSICAL | NATURAL | 14 | MUSICAL | NATURAL |
| 15 | NORMAL | SPIRITUAL | 15 | NORMAL | SPIRITUAL | 15 | NORMAL | SPIRITUAL | 15 | NORMAL | SPIRITUAL |
| 16 | PERSONALITY | PHILOSOPHY | 16 | PERSONALITY | PHILOSOPHY | 16 | PERSONALITY | PHILOSOPHY | 16 | PERSONALITY | PHILOSOPHY |
| 17 | POET | SAINT | 17 | POET | SAINT | 17 | POET | SAINT | 17 | POET | SAINT |
| 18 | RACIAL | RELIGIOUS | 18 | RACIAL | RELIGIOUS | 18 | RACIAL | RELIGIOUS | 18 | RACIAL | RELIGIOUS |

SEND FIRST TWO COUPONS & ENTER MINIQUIZ (A) FREE — No 33 — SEND FOUR COUPONS & ENTER BOTH MINIQUIZ (A&B) FREE

**MINIQUIZ (A)** — 6 CLUES FREE COUPON

| AGITATION | REVOLUTION |
|---|---|
| ART | SCIENCE |
| CONDUCT | THOUGHT |
| DEMOCRACY | SOCIETY |
| DOES | IS |
| EMOTION | IMAGINATION |

**MINIQUIZ (B)** — 12 CLUES FREE COUPON

| EMOTIONAL | MORAL | INSPIRATION | INTUITION |
|---|---|---|---|
| EQUALITY | STABILITY | MUSICAL | NATURAL |
| EQUANIMITY | HUMILITY | NORMAL | SPIRITUAL |
| EVOCATION | REALIZATION | PERSONALITY | PHILOSOPHY |
| EXTERNAL | MENTAL | POET | SAINT |
| FAITH | GROWTH | RACIAL | RELIGIOUS |

**33** (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు 1/- ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు 4/- M O రసీదు/I P O/లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను వాటి నెం ... ...

CAPITAL LETTERS

NAME ..................................................

ADDRESS ..................................................

..................................................

—— ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను ——

ముఖ్యాంశము లిట్ క్విజ్ పోటీలు నిస్సందేహంగా నేర్పుతో కూడాని సాహిత్య పోటీలు లిట్‌క్విజ్ పోటీ జవాబులు స్థిరమైనవి మా కంపైలర్ వానిని స్థిరపర్చరు అతను వానిని మార్చుటకు కూడా వీలులేదు ఈ జవాబులను నిర్ణయించుటకు అడ్జుడికేషన్ కమిటీకూడా లేదు రచయిత వాడిన పదమే కోట్ చేయబడిన ప్రతి క్లూకు సరియైన జవాబు అందుచేత లిట్‌క్విజ్‌నందు విజయం అదృష్టం లేక అవకాశంమీద ఆధారపడివుండదు మీ నేర్పు, వివేకం, సమయస్ఫూర్తి, అనుభవం ఉపయోగించండి తప్పక గెలుపొందే అవకాశం ఉండును

# నా అహింసాయాత్ర



## కీ.శే. మార్టిన్ లూథర్ కింగ్



**1964 లో నోబెల్ శాంతి బహుమానం వచ్చినప్పుడు అట్లాంటాలో జరిగిన సన్మానసభలో లూథర్ కింగ్, శ్రీమతి లూథర్ కింగ్.**

(ఈ వ్యాసాన్ని మార్టిన్ లూథర్‌కింగ్ కొన్ని సంవత్సరాల క్రితం రాశారు, మళ్లీ దిద్దిరాశారు)

నేను కళాశాలలో అధికంగా తత్వశాస్త్రం, పరమార్థ విద్య వీటిని గురించే చదువుకున్నాను కాని, చిన్న వయసులోనే నాకు సాంఘికనీతి మీద ఆసక్తి కలిగింది. నాకు పదిహేను ఏళ్ళు నిండకముందే జాతి విచక్షణ సమస్య పట్ల ఎంతో శ్రద్ధ కలిగింది. జాతి విచక్షణ హేతువాదానికీ, ధర్మానికీ కూడా వ్యతిరేకమని అనుకున్నాను. ఒక బస్సులో, రయిలుబండిలో వెనుకభాగంలో, వేరుగా కూర్చోవటం నాకు ఏమాత్రం అంగీకారంగా ఉండేది కాదు. నేను మొట్టమొదటిసారి రయిలుబండిలో భోజనాల పెట్టెలో తెరవెనుక కూర్చున్నప్పుడు నా వ్యక్తిత్వం పయిన తెర కప్పేసినట్లు భావించాను. అంతేకాదు, జాతి విచక్షణ వల్ల కలిగే అన్యాయం ఆర్థికంగాకూడా అన్యాయానికి ఆస్కారం అవుతుందని తెలుసుకున్నాను. 'జాతివిభేదం' బీద తెల్లవారినీ, నీగ్రోలనీ కూడా దుర్వినియోగం చెయ్యటం నేను గమనించాను.

నేను ఒక బ్రహ్మజ్ఞాన కేంద్రంలో చేరేదాకా ఈ సాంఘిక దురన్యాయాన్ని తొలగించగలిగే పద్ధతి కోసం బుద్ధిపూర్వకంగా వెతకటం ప్రారంభించలేదు. 1950 ప్రాంతంలో వాల్టర్ రవుష్చెన్‌బుష్ రాసిన 'క్రిస్టియానిటీ ఎండ్ ది సోషల్ క్రయిసిస్' అనే పుస్తకం చదివాను. ఈ పుస్తకం నామీద చెరపరాని ముద్ర వేసిందనవచ్చు. కొన్ని విషయాల మీద నేను రవుష్చెన్‌బుష్‌తో ఏకీభవించలేను. అతను 19శతాబ్దపు 'అభివృద్ధి అనేది తథ్యం' అనే మతంవాడు. ఈ మతంవల్ల సహేతుకంకాని ఆశావాదాన్ని నమ్మాడు. దైవరాజ్యం అనేది ఒక సాంఘిక ఆర్థిక వ్యవస్థ అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తాడు. ఈ రకం నమ్మకానికి ఎప్పుడూ దూరంగా ఉండాలి. భగవంతుడి సందేశం, ఉపదేశం సంపూర్ణ మానవుడికి—అతని ఆత్మ, దేహాలకి సంబంధించినది. అతని ఆధ్యాత్మికాభివృద్ధికేకాక వాస్తవికాభివృద్ధికి కూడా సంబంధించినది. మానవుల ఆత్మల పట్ల ఆదుర్దా చూపి వారు నివసించే మురికివాడలని అశ్రద్ధ చేసేమతం, వారిని యమయాతనపెట్టే ఆర్థిక పరిస్థితులని అశ్రద్ధచేసే మతం, వారిని కుంటివారిని చేసే సాంఘిక పరిస్థితులని గమనించని మతం— ఇది ఆధ్యాత్మికంగా కొన ఊపిరితో ఉన్న మతం.

రవుష్చెన్‌బుష్ తర్వాత పెద్ద తత్వవేత్తల సాంఘిక నైతిక సిద్ధాంతాలని మనస్ఫూర్తిగా అనుశీలించాను. కరుణ అనేది సాంఘిక సమస్యలని పరిష్కరించలేదేమో అనే నిస్పృహతో మునిగిపోయాను. 'రెండవ చెంప చూపటం, శత్రువుని ప్రేమించటం' అనే సిద్ధాంతాలు మంచివే కాని కేవలం వ్యక్తుల మధ్య వైరుధ్యాలు వచ్చినప్పుడే ఇవి వర్తిస్తాయి అని అనిపించింది నాకు, జాతుల, వర్గాలమధ్య వైరుధ్యాలు వస్తే ఇంతకన్నా వాస్తవిక విధానం అవసరం.

ఆతర్వాత నాకు మహాత్మాగాంధి ఉపదేశాలతో పరిచయం కలిగింది. ఆయన గ్రంథాలు చదువుతున్నకొద్దీ ఆయన హింసారహితమయిన పోరాటపు ఉద్యమాలు నన్ను ముగ్ధుడని చేశాయి. గాంధి 'సత్యాగ్రహ' సిద్ధాంతం నాకు ఎంతో ముఖ్యమయినదనిపించింది. గాంధీ సిద్ధాంతాలని అనుశీలించినకొద్దీ కరుణ అనే దాని శక్తి పట్ల నాకు కలిగిన అపనమ్మకం క్రమంగా నశించింది. ఏసుక్రీస్తు బోధించిన కరుణ సిద్ధాంతం గాంధీ అహింసాపద్ధతిద్వారా ఏవిధంగా పనిచేసి ఇతరుల క్రౌర్యానికి గురి అయిన జనం కష్టాలని శమింపచెయ్యగలదో నాకు అర్థం అయింది. అయితే, ఆ కాలంలో నేను పరిస్థితిని, నా వివేకం ద్వారా, అర్థం చేసుకున్నానేగాని దానిని ఏ విధంగా దారిలోకి తీసుకురావాలో ఆలోచించి ఒక నిర్ణయానికి రాలేదు.

1954లో అలబామాలోని మాంట్‌గొమెరీకి పాస్టర్‌గా వెళ్ళాను. అప్పటిలో నాకు ఒకపెద్ద శాంతియుతమయిన ఉద్యమంలో చిక్కుకోబోతున్నానని తెలియదు. అక్కడ ఒక ఏడాది గడిచింది. బస్సుల బాయికాట్ ప్రారంభం అయింది. మాంట్‌గొమెరీ నీగ్రోలు తమ అవమానాన్ని ఇక సహించలేకపోయారు. ఒకపెద్దసహాయనిరాకరణోద్యమంమొదలుపెట్టారు. తలవంచి బస్సులలోవెళ్ళే బదులు అభిమానంతో వీధులలో నడచివెళ్ళటమే గౌరవమయినదని గ్రహించారు. ఈ ఉద్యమం మొదలయ్యే సమయంలో నన్ను వచ్చి తమ ప్రతినిధిగా ఉండాలన్నారు. వారి సూచనని స్వీకరించాను. స్వీకరించినప్పుడు బుద్ధిపూర్వకంగాకాదోకాని నా ఆలోచనలో ఏసుక్రీస్తు పర్వతం మీద ఇచ్చిన ప్రసంగం పయిన్నకీ, గాంధీ అహింసా పద్ధతిమీదకీ మళ్ళాయి. ఈ సిద్ధాంతం నాకు వెలుగుని ప్రసాదించే జ్యోతి అయింది. ఏసుక్రీస్తు ఆధ్యాత్మికమయిన బలాన్నీ, ప్రేరేపణశక్తినీ ప్రసాదించాడు, గాంధీవిధానాన్ని ప్రసాదించాడు.

మాంట్‌గొమెరీ అనుభవం ఒక్కటి నేను చదివిన పుస్తకాలన్నిటికన్నా అధికంగా నాకు మార్గదర్శి అయింది. రోజులు గడిచినకొద్దీ అహింసా పద్ధతి యొక్క బలం నాకు మరింత స్పష్టం అయింది. అహింస నేను కేవలం బుద్ధిపూర్వకంగా స్వీకరించిన విధానం మాత్రమేకాక ఒక రకమయిన జీవిత ధర్మం అయిపోయింది. అంతేకాక నా బుద్ధి బలంతోత అహింసని గురించి నేను తెలుసుకోలేని

[illegible] పోయాయి.

భారతదేశానికి వెళ్లి రావటం నా అదృష్టం స్వాతంత్ర్యం సాధించటానికి అహింసా పద్ధతి ఎంత తోడ్పడిందో నేను నా కళ్లారా చూడగలిగాను సాధారణంగా ఒక పెద్ద ఉద్యమం అలజడి తర్వాత ద్వేషాలు పెరుగుతాయి ఈ ద్వేషం నాకు భారత దేశంలో ఎక్కడా కనిపించలేదు భారత, బ్రిటిషు ప్రజల మధ్య కామన్వెల్తు మైత్రి మాత్రమే మిగిలింది

అహింస ద్వారా ఒక్క రోజులో అద్భుతాలు సాధించగలమని నేను అనటం లేదు వారి మాన సిక వ్యసనాల గాడిలోనుంచి మానవులని తప్పించటం తేలిక కాదు వారిని తమ హేతురహితమయిన భావాలనుంచి విముక్తి చెయ్యటం తేలిక కాదు అణ గారి పోయినవారు స్వేచ్ఛకావాలంటే వారిని అణగ దొక్కినవారు కోపం తెచ్చుకుంటారు అడ్డు పడ్తారు స్వేచ్ఛ కోరేవారు అహింసా మార్గాన్ని అవలంబించినా వారికి కోపంరాక తప్పదు మాంట్ గొమెరీ, ఇతర దక్షిణాది ప్రాంతాలలో మా తెల్ల సోదరులు ఇంకా నీగ్రో నాయకులపట్ల ద్వేషం చూపిస్తున్నారని నాకు తెలుసు, వీరు కరుణ, అహింసా పద్ధతులనే అవలంబించినప్పటికీ కాని, అహింసా మార్గం దానిని అనుసరించేవారి, హృదయాలనీ, మనస్సులనీ అద్భుతంగా మార్చేస్తుంది వారికి ఒక కొత్త రకమయిన ఆత్మ గౌరవం ఏర్పడుతుంది తమకి ఉన్నాయనే తెలియని ధైర్యం, బలం బయటికి వస్తాయి అన్నిటికన్నా ముఖ్యమయినది— ప్రతి పక్షంవారి అంతఃకరణాన్ని కదిల్చివేస్తుంది అహింసా పద్ధతి

ఈ మధ్య నాకు ఇంకొక ఊహ తోచింది అహింసా పద్ధతిని అంతర్జాతీయ సమస్యలకి కూడా వర్తింప చెయ్యవచ్చు దేశాల మధ్య పోరాటాలకి అహింసా పద్ధతి అంత మంచిది కాదని నాకు అను మానంగా ఉన్నా, యుద్ధం అనేది మంచిని ఎప్పుడూ కలిగించ లేకపోయినా కనీసం దుష్ట శక్తులని అరి కట్టే శక్తి మాత్రం దానికి ఉంది యుద్ధం



మహాత్మా గాంధీ అడుగుజాడల్లో



భర్త దుర్మరణం విన్న శ్రీమతి మార్టిన్ లూథర్‌కింగ్ ఇంటికి వెళ్తున్నప్పటి దృశ్యం

ఎంత చెడు అయినప్పటికీ నియంతృత్వానికి లొంగి పోవటం కన్నా అదే మేలయినదే ఏమో కాని, నేటి అమానుష ఆయుధాలు యుద్ధానికి ఉన్న ఈ ఒక్క సద్గుణాన్నికూడా— దుష్టశక్తులని అరికట్టే శక్తి— లేకుండా చేస్తున్నాయి మానవజాతికి జీవించే హక్కు ఉంటే యుద్ధం, నాశనం వీటికి గత్యంతరాలేమిటో చూడాలి వర్తమాన కాలంలో అంతరిక్షనౌకలు, శతఘ్నులు, అహింస— నాశనం వీటి రెండిటితో ఒకదానిని ఎన్నుకునేట్లు చేస్తు న్నాయి

గడిచిన ఈ దశాబ్దం చిత్రమయినది ద్వేషాలూ, అవాంతరాలూ ముంచుకు వచ్చినప్పటికీ ఏదో ఒక మహత్తరమయిన మార్పు వస్తోంది పాత అన్యా యాలు నశించి పోతున్నాయి, కొత్త ధర్మ సిద్ధాం తాల స్థాపన జరుగుతోంది నిజంగా ఇదొక మహా యుగం భవిష్యత్తు గురించిన చింత నాకు లేదు నిష్పటి ఆశావాదం నేడు పనికిరాదు, నిజమే, నేడు మనని భయపెడుతున్న క్లిష్ట సమస్యలు మనని జీవిత మహా సముద్రంలో ముంచెత్తేస్తున్నాయి కాని, ప్రతి క్లిష్ట సమయంలోనూ అప్పటి సమస్య పరిష్కారం ఇమిడి ఉంటుంది మోక్షమో, నాశ నమో తేలిపోతుంది చీకట్లు ముసురుకుంటున్న ఈ కల్లోల ప్రపంచంలో రామరాజ్యం మానవుల హృదయంలో ఏర్పడవచ్చు (గాంధి శాంతి ప్రతి ష్ఠాన్ సమాచార పత్రసేవ)

## కీ॥ శే॥ ఉస్తాద్ బడేగులాం ఆలీఖాన్

'హరిఓమ్' కీర్తనతో ప్రపం చాన్ని సమ్మోహన పరచగల విద్వాం సుడు బడేగులాం ఆలీఖాన్. ఆయన బాణీ, ఆయనపలుకు, ఆరోహణ అవరోహణలలో రాగ ప్రస్తావన తీరు హిందూస్తానీ సంగీతానికే కీర్తి ప్రతిష్ఠలు చేకూర్చాయి. చూడ్డానికి ఎంత గంభీరంగా కని పిస్తాడో సంగీతం వినిపించడం లోకూడా అంత గంభీరాన్ని పంచి యిచ్చే ఉస్తాద్ లేనిలోటు తీరదు.



సేవించుటకు పూర్వము



20 దినముల తరువాత



40 దినముల తరువాత



70 దినముల తరువాత

**జీవన్ టోన్ లాభములు** ఎంత మంచి ఆహారము భుజించినప్పటికిని శరీరములో చర్మముపట్టకపోయినను, పెరుగుదల లేనప్పటికిని, అజీర్ణము, అలసట, ఆకలి లేకుండుట, యౌవనము విడిచి ముసలితనముగా కనబడుట, శరీరము చెడుట, స్పృహ తప్పుట, మొదలగు వానికి "జీవన్ టోనును" సేవించి మంచి ఫలమును పొందవచ్చును 'జీవన్‌టోనును' కొన్ని దినములు సేవించుచున్నయెడల చాల త్వరలో లావును, బరువును, మంచి పుష్టియు దొరకుట నిశ్చయము కొంతమంది చెప్పుచున్నట్లుగా అన్నిరకముల వ్యాధులకు ఇది పనికిరాదు జీవన్‌టోనును సేవించు దినములలో కొంచెము దేహపరిశ్రమ చేయుట అవశ్యము ఆవిధముగా చేయకపోయినయెడల అనవసరముగా లావగును కావలసిన బరువును, లావును దొరికిన వెంటనే సేవించుట ఆపవలెను. లావును, బరువును వున్నవారు దీనిని సేవించకుండుట మంచిది అనేక మందులు ఉపయోగించియు ఫలము పొందలేనివారు ఒకసారి జీవన్‌టోనును ఉపయోగించండి **454 గ్రాముల వెల రూ 10/-**

**పురుషులు మాత్రము సేవించవలసిన మాత్రలు** • దీనిని సేవించిన 10 దినములలో ఫలము లభించును మిక్కిలి శక్తి కలిగినటువంటి మాత్ర 60 వయస్సునకు పైబడి వున్నవారికి ఈ మాత్రల మూలముగా ఫలము దొరుకుచున్నది దాంపత్య జీవితములో ఏమారిపోయినవారు ఈ మాత్రల మూలముగా శక్తియు పొందవచ్చును

**కోర్సు వెల రూ 15/-** ఈ మాత్రయును, జీవన్‌టోనును ఒకసారి సేవించిన మంచి ఫలము యిచ్చును

**"స్కిన్‌లీవ్స్"** "స్కిన్‌లీవ్స్" ఉపయోగించి, మొటిమలు, కోసుకొన్న గాయములు, అమ్మవారు పోసి యేర్పడిన మచ్చలు, తేంబల్, చెమటకాయలు మొదలగువానిని పోగొట్టి అందమైన ముఖమును పొందండి **1 సీసా వెల రూ 12/-**

మా రంగుల చిత్రము : మా అనుభవపూర్వకమైన నిజమైన ఫొటోలను ప్రవేశపెట్టియున్నాము ఇది నిజమైనదని తెలియవలెనన్న మా రంగుల చిత్రమును చూడవలెను ఈచిత్రం ఇండియాలో అన్ని ఆంగ్లలోను వెలుబరచియున్నాము మద్రాసు గ్లోబు, మిడ్‌లాండ్ కోయంబత్తూరు ఇరుదయా, తిరుచ్చి వెల్లింగ్‌టన్ థియేటర్లలో మేము వెలుబరచిన చిత్రములను చూడవలెను. ఆ స్నేహితుని ఫొటోను పైన ప్రచురించియున్నాము. — కొత్త స్టాకిస్టులు —

| | | | | |
|---|---|---|---|---|
| పొదర్తి చంద్రశేఖర రావు, RMP, మెడికల్ & జనరల్ షాప్, మెయిన్ బజారు, గుంటూరు-3 ఏ పి | ప్రభాత్ మెడికల్ స్టోర్సు, పార్కు రోడ్, విజయవాడ-1 ఏ పి | మెసర్ వరలక్ష్మి బుక్ స్టాలు, 136, సెట్టియార్ వీధి, సిలోన్, కొలంబో-11. | టి హాజీ మహమ్మద్ మూసా & సన్స్ మెడికల్ షాప్, 273, ఎస్ ఎస్ సి బి రోడ్, టెలిఫోన్ ఆఫీసు ఎదురుగా, మద్రాసు-1 | పి రవీంద్ర నాథ్, 25/1, మావయా పురం, 2 వ వీధి, రాయపురము, తిరుపూర్-1. |

**జ్యోతి ఆస్పత్రి.**

రిజిష్టర్డ నెం. 218726

పోస్టు బాక్సు నెం 1413




**32, వెంకట నారాయణ రోడ్డు.**

**టి. నగరు, మద్రాసు-17.**

ఫోన్ 440206

అన్ని ప్రసిద్ధమైన మందు అంగళ్లలోనుఅమ్మకమునకు దొరకును.

సీరియల్





సి. ఆనందారామం

### జ రి గి న క థ

రామచంద్రమీద అభిమానం పెంచుకుంటుంది వారిజ. రామచంద్ర కూడా వారిజని ప్రేమిస్తాడు. గతంలో ఆమె ఒక సినిమాతార అని తెలుసుకున్న తర్వాత అతను సుందేహంలో పడతాడు. వారిజ వృత్తిని విరమించుకుని తన కుటుంబానికి సాయ పడుతూవుంటుంది. అయినా ఆమెమీద అందరికీ దురభిమానమే. వారిజ చెల్లెలు లత. రామచంద్రానికి లతతో వివాహం అయిపోతుంది. లతలో వారిజని వూహించుకున్న రామచంద్ర ఆశలు ఫలించవు. వారిజ రామచంద్ర నామస్మరణంతో అదే వూర్లో టీచరుగా ఉద్యోగం సంపాదించుకుంటుంది. రామచంద్ర తన చెల్లెలు లతనే వివాహమాడాడని తెలుసుకున్న వారిజ ఆ వూరు వచ్చినందుకు చింతిస్తుంది.

## 10

రవి వారిజదగ్గర్నుంచి తిన్నగా లత దగ్గిర కెళ్ళాడు.

'లతా! నీకు తెలుసా! వారిజ ఈ ఊళ్ళోనే ఉంటోంది' అన్నాడు—

ఆశ్చర్యమూ సంభ్రమమూ ఒక్కసారిగా క్రమ్ముకున్నాయి లతని—

'నిజంగానా! ఎక్కడుంటోంది? ఎప్పుడొచ్చింది? ఎందుకొచ్చిందీ? ఎన్నాళ్ళుంటుందీ?'

గబగబ అడిగింది—

కుర్చీలో జారగిలబడి కూర్చుని విసుగ్గా ఆవలించాడు రవి—

'ఇక్కడేదో ఉద్యోగం చేస్తోంది—పంతులమ్మగా! ఎన్నాళ్ళుంటుందో?'

'పంతులమ్మగానా? సినిమావదిలేసి... హుఁ! సుఖపడటం చేతగాదు!'

పకపక నవ్వాడు రవి—

'వారిజ నిన్ను గురించి ఇలాగే అంటోంది—నీకు సుఖపడటం చేత కాదుట!'

'నాకు సుఖపడటం చేతకాదంటోందా? ఏవుందిక్కడ సుఖం? గొడ్డుచాకిరీ, గొడ్డు బ్రతుకూ, — సినిమాలా? — షికార్లా — సరదాలా?—'

దీర్ఘంగా నిట్టూర్చి మళ్ళీ అంది—

'అయ్యో! వారిజక్కయ్య ఇక్కడుందని నాకు తెలిస్తే మొన్న బేంక్ ఏజంట్‌గారింట్లో పెళ్ళిపేరంటానికి ఒక పట్టుచీర ఎరువడిగేదాన్ని—నా చీరలన్నీ ఒకసారి కట్టేసుకున్నవే!'

'ఏమో! దానిదగ్గర పట్టుచీరలే ఉన్నాయో, సిల్కుచీరలే ఉన్నాయో నాకు తెలీదు. నేను చూసేనాటికి మాత్రం మిల్లు చీరతో ఉంది—మెడ్రాస్‌లోనూ మామూలు చీరలే కట్టేది—'

'అవన్నీ ఎక్కడో దాచిఉంటుంది—అంత గొప్పతార—మంచి మంచి చీరలు లేకుండా ఎలా ఉంటాయి?'

'ఏమో! చీరల సంగతి నేనడుగలేదు—'

'అసలు సినిమాల్లో ఎందుకు మానేసిందిట?'

'అదీ తెలీదు—అసలు సరిగ్గా మాట్లాడుతుందేవిటి? ఓయబ్బో! ఎంత టెక్కని? అయితే ఒకటి—అడిగినప్పుడల్లా డబ్బిస్తుంది—'

'ఇస్తుందా?' సంభ్రమంగా అడిగింది లత—

'ఆ! కాస్త విసుగ్గా ముఖంపెట్టి చిటచిట లాడుతుంది—కాని, చివరకు ఇస్తుంది—'

'మా ఆయనతో చస్తున్నానన్నయ్యా! ప్రతిదానికీ లెక్కలు చెప్పాలి—'ఇది అవసరం—ఇది అనవసరం—' అంటూ సణుగుళ్ళు— ఇంకమీదట హాయిగా వారిజక్కయ్యను అడుగుతాను—'

'అడుగు— ఇవ్వకేం చేస్తుందీ? తనకేం మొగుడా? పిల్లలా? మనకియ్యకపోతే డబ్బు, ఏం చేసుకుంటుందీ?'

లత ముఖం సంబరంతో వికసించింది—

'నాకు వడ్డించెయ్యి లతా! ఇవాళ రాత్రికే వెళ్ళిపోతాను—' అన్నాడు రవి—

'బావగారు వచ్చేవరకూ ఆగవూ?'

'ఆయన ఏ లైబ్రరీలోనో కూచుని రాత్రి ఏ తొమ్మిదింటికో వస్తారు— నాకు టైం లేదు—'

'పద! నేను కూడా తినేస్తాను—'

రవితోపాటు తనూ భోజనం ముగించి రవిని సాగనంపి పడుకుంది లత—

లైబ్రరీనుండి తొమ్మిదిదాటాక వచ్చాడు

రామచంద్ర—తలుపు తట్టగా తట్టగా ఎప్పటికో తెరిచింది లత—

'నిద్రపోతున్నావా?' ఆప్యాయంగా అడిగాడు రామచంద్ర—

'ఊ!' బద్ధకంగా ఆవులిస్తూ అంది—

'పద! అన్నాలు తిందాం—'

'నేను తినేసాను—'

ఒక్కనిముషం కలుక్కుమన్నా సర్దుకున్నాడు రామచంద్ర—

'పోనీలే! మంచిపని చేసావు—నాకువడ్డించెయ్యి—'

'నేను వడ్డించలేను బాబూ! నాకు నిద్ర కూరుకొస్తోంది — అన్నీ అక్కడున్నాయి—వడ్డించుకోండి—'

వెళ్ళి పక్కమీద వాలిపోయింది లత—

ఒక్కక్షణం ఉసూరు మనిపించినా తనను తనే సముదాయించుకున్నాడు రామచంద్ర—

బట్టలుమార్చుకుని కాళ్ళూచేతులూ కడుక్కుని భోజనానికి కూర్చున్నాడు రామచంద్ర—

అన్నీ కనిపించాయి— కాని పెరుగు కనిపించలేదు — సాంబారుతిని, పెరుగుకోసం అంతటా వెతికాడు—ఎక్కడా లేదు—

'లతా!' మృదువుగా పిలిచాడు—

పలకలేదు—

'లతా!' గట్టిగా పిలిచాడు—

'అబ్బ!' అని విసుక్కుంటూ వచ్చింది లత—

'ఎందుకూ? మీకు వడ్డించాలి కదూ! నేనసలు నిద్రపోకూడదు—మీరు తిరిగితిరిగి ఇంటికి వచ్చేవరకూ పడిగాపులుపడుతూ కూచోవాలి- ఛీ! ఛీ! వెధవ ఆడబతుకు! మొగవాడికి బానిసలాపడి ఉండటంకన్న వేరు మోక్షంలేదు — మేమూ మనుష్యులమేననీ, మాకూ కష్టసుఖాలుంటాయనీ గుర్తింపే లేదు మొగజాతికి—ఇంకా ఎన్నాళ్ళీ బానిసత్వం? ఏనాటికి ఈ మొగవాడి అహంకారం అణుగుతుందో?'

నివ్వెరపోయి చూసాడు రామచంద్ర—మాట్లాడకుండా కంచంలో చెయ్యికడిగేసుకుని లేచిపోయాడు—రుసరుసలాడుతూ తన మంచంమీద పడుకుంది లత.

* * *

ఎలాంటి వాళ్ళకు అలాటి స్నేహితులు దొరుకుతూ ఉంటారు — లతకు తగిన స్నేహితురాలు పొరుగింటి నాగమణి— వచ్చిన ప్రతి సినిమాకూ తను బయలుదేరుతుంది—లతను కూడా బయలుదేరతీస్తుంది—

'భయంకరనారి సినిమా వచ్చిందిట! వెళ్దామా!' అంటూ వచ్చింది నాగమణి లత దగ్గిరకు—

నాగమణికి పెళ్ళికాలేదు—పైగా వాళ్ళు ధనవంతులు — ఇరుగు పొరుగు అందర్లో లతను నాగమణి ఆకర్షించటానికి ఆవిడ ఐశ్వర్యం కూడా ఒక కారణం—నాగమణి మాటలకు ముందు ఉత్సాహం చూపి అంతలో కృంగిపోయింది లత—

'ఎలా వస్తాను? ఆయనగారేమో, తొమ్మిదయితే కాని రారు — అప్పుడింక ఎప్పుడు 'అనుమతి' తీసుకోవాలి? ఎప్పుడెళ్ళాలి? చెప్పకుండా వెళ్తే ఇంకేమన్నా ఉందా? హమ్మవాయనో? చేసే ఉద్యోగం లేకపోయినా అహంకారం జాస్తి—'

'పోనీలే! ఇవాళడుగు — రేపెళ్దాం—నీకోసం నేను రేపటి వరకూ ఆగుతాను—'

ఉదారంగా ప్రకటించింది నాగమణి—స్నేహితురాలి త్యాగానికి ఉబ్బి తబ్బిబ్బయిపోయింది లత—

తను వచ్చేసరికి ఇంకా నిద్రపోకుండా కూర్చున్న లతను చూసి ఆశ్చర్యపోయాడు రామచంద్ర—



# చీకటి కడుపున...

'ఏం లతా! పడుకోలేదూ?' అన్నాడు మృదువుగా—

'ఊహు! ఇంకా అన్నం కూడా తినలేదు—'

ఈసారి పూర్తిగా మతిపోయింది రామచంద్రకి—

'ఇదేవిటి ఇంత ప్రేమా? అకస్మాత్తుగా—'

'అలాగే మాట్లాడతారు—నాకెప్పుడూ ప్రేమే! నిద్రమేల్కోలేను—అంతే!'

మూతి ముడుచుకుంది లత—

తెల్లని బట్టల్లో, 'వెన్నెల్లో' వెన్నెలకన్న మెరిసిపోతోన్న లత ఎంతో ముద్దుగా అనిపించింది రామచంద్రను—ఆవిడ బుంగ మూతిమీద ముద్దుపెట్టుకుని 'క్షమించండి రాణీగారు — మీ ప్రేమనాకు తెలీదూ!' అన్నాడు హాస్యంగా—

'అంటే?' అంది కోపంగా కనుబొమలు ముడిచి లత—

'ఇలాటి సమయాల్లో కోపం తెచ్చుకోకూడదు—'

అంటూ చక్కిలిగిలి పెట్టాడు రామచంద్ర—

అప్రయత్నంగానే కిల కిల నవ్వింది లత—

'పద! వడ్డించు—' అన్నాడు బట్టలు మార్చుకుంటూ—

భర్తకు వడ్డించి తనూ కూర్చుంటూ అడిగింది లత—

'ఇవాళ నాగమణి వచ్చి సినిమా కెళ్దామంది—మిమ్మల్నడిగి రేపు వస్తానన్నాను—'

లత అంత వరకూ మేలుకుని ఉండటానికి కారణం అర్థమయిపోయింది రామచంద్రకు—గాలి తీసిన బెలూన్‌లా అతని ఉత్సాహమంతా అణిగిపోయింది—

'ఏం సినిమా!'

'భయంకర నారి—'

'జానపదం కదూ! ఇందాక పోస్టర్లు చూసాను—ఆ పోజులన్నీ ఎంతో ఛండాలంగా ఉన్నాయి—ఎందుకా సినిమా చూడటం? ఏముంది అందులో?'

'ఏదో ఒకటి—ఈ ఊళ్లో అంతకన్న మంచి కాలక్షేపమే ముందీ?'

'లతా! నేను బీదవాణ్ణి కాకపోయినా, మరీ గొప్పవాణ్ణి కాను — ఈనెలలో నువ్వప్పుడే నాలుగు సినిమాల కెళ్ళావు—ఒకొక్కసారీ అయిదు రూపాయలన్నా ఖర్చు చేసావు—ఎక్కడ తేగలను? నాకేమైనా నెలజీతమా? ఇలా దూబరా చేసుకుంటే ముందు ఎలా గడుస్తుంది? నువ్వు రాకముందు సంవత్సరానికి రెండు వేలైనా బేంక్‌లో వెయ్యగలిగే వాడిని—ఈ సంవత్సరం రెండు వందలైనా మిగులుతుందో? లేదో?'

'అంత కూటికీ గుడ్డకీ కాని ఈ వ్యవసాయం దేనికి? ఈ పొలం అమ్మేసి హాయిగా బస్తీలో ఉద్యోగం చేసుకోకూడదూ!!'

ఎంత అణచుకున్నా ఆపరాని కోపం వచ్చింది రామచంద్రకు—

'నా వ్యవసాయం కూటికీ గుడ్డకీ వస్తుంది—నీ విలాసాలకే రాదు — బస్తీ ఉద్యోగం మొదలుపెడితే కూడూ, గుడ్డా కూడా కరువవుతుంది—'

ముఖం ముటముట లాడించుకుంది లత—

'ఇంతకూ ఏవిటంటారు?'

'ఏమీ అనను — నా దగ్గిర డబ్బు లేదంటున్నాను—'

'ఒక్క సినిమా చూసేందుకు కూడా గతిలేదా?'

'నీ యిష్టం ఎలా అయినా అనుకో! నేను చెప్పవలసింది చెప్పేసాను—'

'ఛీ! ఛీ! వెధవ బ్రతుకు! ఒక్క సుఖం లేదు—'

తింటోన్న కంచంలో చెయ్యి కడుక్కుని లేచిపోయింది—

ఒక్క క్షణం వెళ్తోన్న లతను చూసి బరువుగా నిట్టూర్చి తనే వడ్డించుకుని భోజనం ముగించాడు రామచంద్ర—

మరునాడు పొద్దున్న కాఫీ అందిస్తూ మళ్లీ అడిగింది లత—

'సినిమాకు వెళ్లొద్దూ?'

'నా దగ్గిర డబ్బులు లేవని చెప్పాను—'

'మీరు తలుచుకుంటె ఎలా అయినా ఇవ్వగలరు—'

'కానీ, అలా తలుచుకోవటం నా కిష్టం లేదు—'

వెళ్ళిపోయాడు రామచంద్ర—

ఉడికిపోయింది లత—సినిమాకు వెళ్ళలేకపోయాననే అనే బాధకంటే డబ్బులు

లేవు గనుక రాలేకపోయానని నాగమణికి చెప్పుకోవలసిన బాధ ఎక్కువయిపోయింది లతలో—

చటుక్కున వారిజ గుర్తుకొచ్చింది—వారిజ ఏ స్కూల్లో పని చేస్తోందో రవి చెప్పాడు — ఆదరాబాదరా వంట ముగించి కేరియర్ సర్ది రామచంద్రకు పంపేసి వారిజ దగ్గరకు బయలుదేరింది లత—

చిన్న పిల్లలకు పాఠాలు చెపుతోన్న వారిజ లతను చూసి మొదట ఆశ్చర్య పోయింది—స్టాఫ్ రూంలో కూర్చోపెట్టి 'ఒక్క పావుగంట ఆగు—ఈ క్లాస్ అయి పోగానే నాకు తీరుబడే! మాట్లాడు కుందాం—' అని మళ్లీ క్లాస్‌లోకొచ్చింది—క్లాస్ పూర్తయిపోయాక లత దగ్గిరి కొచ్చి ఆదరంగా చూస్తూ 'ఏం లతా బాగున్నావా?' అంది—

లత నిస్పృహగా నిట్టూర్చి 'ఏం బాగోలే' అంది—

వారిజకు లోలోపల కలుక్కుమంది—అయినా చెల్లెలు రాక రాక తన దగ్గిరకు ఇన్నాళ్లకు వచ్చింది—ఇంకా అడుగు పెట్టి పెట్టకుండానే మందలింపులు ప్రారంభించటం భావ్యం కాదు—అయినా కాస్త మృదువుగానే అంది—

'సంసార మన్నాక కష్టసుఖాలు లక్ష ఉంటాయి—ఎలాగో సర్దుకుపోవాలి కాని, ఇలా కొంపలు పడిపోతే ఎలా?'

'ఏం సర్దుకు పోవటమోలే! రవన్నయ్య చెప్పాడు నువ్విక్కడుంటున్నావని—అప్పట్నుంచి వద్దామనే అనుకుంటున్నాను—పడలేదు—'

'ఫరవాలేదులే! ఆ మాత్రం అభిమానం నా మీదుంటే అంతే చాలు—అయినా నువ్విక్కడికి రావటంకూడా అంత మంచిదికాదు—మీ ఆయనకు తెలిస్తే?..'

'తెలిస్తే?..' ఆశ్చర్యంగా అంది లత—

ఒక్క క్షణం బాధతో వారిజ హృదయం ముడులు తిరిగిపోయింది — ఆణచుకుంటూ అంది —

'మీరంతా ఏం చెప్పారు? నేను చచ్చిపోయానని కదూ, ఇప్పుడు నీకు అక్కగా నాలాటిదొకతి బ్రతికుందని తెలిస్తే కలతలు రావూ?'

ఆశ్చర్యంగా వింది లత —

'అవునేవ్! అందులో ఆయనకి కొత్త గాజాకుగా అలంకరించుకుంటేనే వళ్లు మంట! సినిమా స్టార్‌లంటే మరీ మంట! సినిమా చూస్తానంటేనే 'సిగ్గూ లజ్జ వదిలేసిన ఆ తైతక్కలేం చూస్తావని' విసుక్కుంటారు—ఇంక నువ్వు సినిమా స్టారువని తెలిస్తే ఆ అసహ్యంతో నన్ను వదిలేసినా వదిలేస్తారు—'

లత నోటినుండి వచ్చిన ఒక్కొక్క అక్షరమూ వారిజ హృదయాన్ని ముక్కలు ముక్కలుగా చీల్చింది—అవన్నీ నిజాలే—! కానీ లతకు తను ఎవరితో మాట్లాడుతోందో ఆ ఇంగితం లేదేం?

'ఇంక తరచుగా రానుకాని, ఇవాళ ఒక చిన్న పనిమీద వచ్చాను—'

ఉసూరు మంది వారిజ—ఎండమావులలో నిరాశించినట్లు లత హృదయంలో ప్రేమను ఆశిస్తోందేమిటి తను?

'ఏం పని?'

'నా కొక్క పదిరూపాయలు కావాలి—'

డబ్బు! డబ్బుకోసం వచ్చింది లత—తనను చూడగానే తన వారందరికీ డబ్బు తప్ప మరో విషయం గుర్తురాదు—

గుండెలు పగిలే నిట్టూర్పు నణచుకొంటూ బేగ్‌లోంచి తీసి పదిరూపాయ



రిక్షావాడి—తన దగ్గర ఇంక దమ్మిడీ లేదు—నెలంతా ఎలా గడుపుకోవాలో? కుతూహలం అణచుకోలేక అడిగింది—

'ఏ కెందుకు డబ్బు? ఆయన ఇచ్చారూ?'

'అయ్యో! ఆయనిస్తే ఇంక లేనిదేముంది? రాత్రినుంచీ ప్రాధేయపడుతున్నాను—నాగమణితో కలిసి సినిమాకెళ్తాను డబ్బులియ్యమని. ససేమిరా వీలుకాదన్నారు—పె...ద్ద...ఆయన ఇవ్వకపోతే గతిలేదనుకున్నారు—నువ్వు లేవూ? వస్తానక్కయా!' సంతోషంతో వికసించిన ముఖంతో లత వెళ్ళిపోయింది.

ఒక్క క్షణం దిగ్భ్రాంతి పొంది, అంతలో తేరుకుని లతకు 'ఎందుక'ని అడగకుండా డబ్బిచ్చినందుకు పశ్చాత్తాపపడటం కంటె ఏం చెయ్యలేకపోయింది వారిజ.

*  *  *

లైబ్రరీలో కూర్చుని పుస్తకంముందు పెట్టుకున్నాడన్నమాటే కాని రామచంద్రకు ఒక్క అక్షరం కూడా తలలో కెక్కటం లేదు—లతతో జరిగిన వాగ్వివాదమే అతని మనసును చికాకు పెడుతోంది—

కొంతసేపు లత సినిమాకోసం ఎందుకు మొండిపట్టుదల పట్టాలని చికాకు కలిగింది—తరువాత తననుతనే సమాధానపరచుకున్నాడు—

# చీకటి కడుపున...

అందరి ప్రవృత్తులూ ఒకలా ఉండవు—తనలాంటి ఏ కొంతమందికో సినిమాలంటే అంత మోజు లేకపోవచ్చు—కానీ, నూటికి తొంభై మంది సినిమాలంటే విరగబడేవాళ్ళే. వాళ్ళల్లో లత కూడా ఒకర్తె — పాపం, లత కోరిక తీరిస్తే నష్టమేం?

చదువుతోన్న పుస్తకం మూసేసి లేచాడు రామచంద్ర—

తను సినిమాకి వద్దన్నందుకు లత బాధపడుతోఉంటుంది. పాపం సముదాయించి రేపు తనే తీసికెళ్తానని బుజ్జగించాలి—ఏదోవిధంగా సర్దుకుపోవటానికి ప్రయత్నించాలి కాని, ఇలా కలతలు పెంచుకుంటే సంసారంలో శాంతి ఏనాటికి దొరుకుతుంది? పోనీ లతకు అనుగుణంగానే తను మారటానికి ప్రయత్నిస్తే !—

అతనేవిధంగా బ్రతిమాలి ఆవిడ పట్టుదలను పోగొట్టాలా, ఏ రకమైన అనునయాలు ఆవిడలో ప్రేమను అంకురింపజేయగలవా, అని ఆలోచిస్తూ ఇంటికి జేరుకున్న రామచంద్రను వీధిగడపకు వేసి ఉన్న పెద్ద తాళం కప్ప వెటకారం చేస్తున్నవ్వింది—

విస్తుపోయాడు రామచంద్ర—

ఇంత రాత్రివేళ ఎక్కడి కెళ్ళి ఉంటుంది?

పక్కింటివాళ్ళ అమ్మాయి తాళం చెవి తెచ్చి ఇచ్చి అతని మనసులో ప్రశ్నకు సమాధానం చెప్పింది—

'అత్తయ్యగారు సినిమా కెళ్ళారు—'

కొంచెంసేపు మూఢుడిలా నిలబడి యాంత్రికంగా తలుపులుతీసి బట్టలు మార్చుకుని తలుపు లేసేసి పడుకున్నాడు—వద్దని తను అంత ఖండితంగా చెప్పాక కూడా వెళ్ళింది—ఎంత నిర్లక్ష్యం? ఏం చూసుకుని ఈ అహం? ఎన్నాళ్ళిలా? తన పట్ల ప్రేమా లేదు — గౌరవమూ లేదు—భయమూ లేదు—ఇట్లాంటి భార్యను ఎలా భరించటం? అసలు వెళ్ళటానికి డబ్బు లెక్కడివి? ఎవరినైనా అప్పడిగిందా? భగవాన్! చివరికి ఈ దశకు కూడా దిగిందా?

సినిమానుండి వచ్చి ప్రశాంతంగా ఉన్న భర్తను చూసి 'హమ్మయ్య' అనుకొంది లత—అది అగ్నిపర్వతపు పైపై ప్రశాంతత అని తెలీక—

కృత్రిమపు నవ్వుతో 'అన్నం తినలేదూ?' అంది—

సూటిగా లత ముఖంలోకి చూశాడు రామచంద్ర—

'లేదు—'

'భలేవారే! నాకోసం కాచుక్కూచున్నారా? ఇంత పొద్దుపోయినా నేనే వచ్చిపెట్టాలి కాబోలు!'

'నాకేం పెట్టక్కర్లేదు—నువ్వు తినేసెయ్యి—నా కాకలి లేదు—'

'అదేం? హోటల్లో ఏమైనా తిన్నారా!'

'మరే!' వెటకారంగా అన్నాడు—

'మీకేం సుఖంగా హోటల్లో తింటారు—నాకు ఆకలి మండిపోతోంది—నేను తినివస్తాను—'

లత వంటింట్లోకి వెళ్ళి హాయిగా అన్నం వడ్డించుకుతింటోంటే మనసు భగభగ మండిపోయింది రామచంద్రకు—అన్నం తినేసి వచ్చి తన మంచంమీద పడుకుంది లత—

'లతా!'

ఉద్రేకాన్ని అణచుకోవటానికి శక్తినంతా వినియోగించి ప్రయత్నిస్తూ అన్నాడు

'అబ్బ! ఇప్పుడు నాకు నిద్రొస్తోంది

తెచ్చుకుందురూ !'

విసుగ్గా అంది లతా—

రామచంద్రకు విగ్రహించుకోవటానికి శక్యంకాని కోపమొచ్చింది—

'నాకు నాలుగు మాటలకు సమాధానం చెప్పి పడుక్ ! నిన్ను సినిమాకెవరు వెళ్ళమన్నారు ?'

భర్త కటుస్వరానికి ఒక్క క్షణం గుండె గుభిల్లుమన్నా నిర్లక్ష్యంగానే సమాధానమిచ్చింది—

'ఒకరు వెళ్ళమనే దేవిటి? నాకు చూడాలనిపించింది — నేనే వెళ్ళాను — ఆమాత్రం స్వతంత్రం లేదా? మీ రెక్కడికి వెళ్ళినా నాకు చెప్పేవెళ్తున్నారా? మీకో న్యాయం, నాకో న్యాయమూనా? ఛీ! ఛీ! మొగజాతి !'

నోట మాట రాలేదు రామచంద్రకు కాసేపు—

'ఈ చర్చలన్నీ ఇప్పుడు కాదులే! నీకు డబ్బెక్కడిది?'

'ఎక్కడిదయితేనేం? మిమ్మల్ని అడగ లేదుగా !'

'సమాధానం చెప్పు—' గర్జించాడు రామచంద్ర—

అప్రయత్నంగా వణికిపోయింది లత— కళ్ళల్లోంచి నిప్పులు కురిపిస్తోన్న భర్తను చూచేసరికి నోట మాట రాలేదు—

'అప్పు చేసావా?' పిడికెళ్ళు బిగిస్తూ అడిగాడు—

'లేదు'

'నిజం చెప్పు — లేకపోతే ఎక్కడిది? అప్పే చేసావు—ఛీ! అప్పుల్లో బ్రతికే ఇంత బ్రతుకులకు మోక్షంలేదు—నువ్వింక ఇక్కడుండటానికి వీల్లేదు—మీ ఇంటికివెళ్ళిపో, వెంటనే! కావలిసినన్ని అప్పులు చేసుకో! మా నాన్నగారు ప్లీడర్ గుమాస్తా అయినా ఏనాడూ నయాపైస అప్పు చెయ్యలేదు—నే నింతవరకూ ఎవ్వరిదగ్గిరా అప్పు చెయ్య లేదు—ఈనాటికి మా వంశంలో నువ్వు తయారయ్యావా అప్పులు ప్రారంభించటానికి? వెంటనే వెళ్ళు మీ వాళ్ళ దగ్గిరికి—'

తర్జనితో గుమ్మంవైపు చూపిస్తూ ఉరిమాడు రామచంద్ర—

ఇప్పటికి లతకు నిజంగానే భయం పుట్టి గడగడ వణికింది—ఏడుపు గొంతుకతో అరిచింది:

'కాదు—కాదు—అప్పు చెయ్యలేదు—మీరు డబ్బు లేదన్నారని నేను ఏడుస్తూ కూర్చుంటే నాగమణి వచ్చి 'పోనీలే! మీ ఆయన ఇయ్యకపోతే నేను ఇస్తానులే!' అని తీసికెళ్ళింది—ఇద్దరి టికెట్లూ తనే కొంది— మీ కెందుకూ అంతకోపం? మీరా డబ్బు అప్పు తీర్చక్కర్లేదు—'

నోటికొచ్చిన అబద్ధం ఆడేసింది—

తన వంట్లోంచి జీవశక్తి అంతా ఎవరో ఒక్కసారి లాగేసినట్లు కూలబడిపోయాడు రామచంద్ర—

'చివరకు ముష్టి ఎత్తి సినిమాకు వెళ్తేనే కాని నీకు తృప్తి కలగలేదా?'

అన్నాడు [illegible] —అసహ్యంతో—

'ముష్టి ఎత్తలేదు — స్నేహితురాలుగనుక తీసుకెళ్ళింది — 'అమ్మ పెట్టా పెట్టదు—అడుక్కు తినానియ్యదు' అన్న సామెతగా ఉంది మీ పని—మీరు డబ్బియ్యక పోగా...'

'ఛీ! ఛీ!'

లత మాట్లాడుతోంటే మధ్యలోనే ఛీత్కారంచేసి ఆ చీకట్లో బయటికి వెళ్ళిపోయాడు రామచంద్ర—

ఒక్క క్షణం విసుగ్గా అతడు వెళ్ళిన వైపు చూసి తలుపు లోపల గడియబిగించి పడుకుంది లత—

(ఇంకా వుంది)

---



మల్లన్నమంత్రి రాజ్యంలోని దక్షిణ యాత్ర చేయడానికి ఒకప్పుడు దక్షిణ దేశపు రాజు చాలా ఆయుధాలను తయారు చేయించాడు. మల్లన్న మంత్రి రాజ్యపు సరిహద్దుకు తన రాజ ధానికి మధ్యను ఉండేటట్లుగా ఒక గిడ్డంగిని దక్షిణదేశపు రాజు కట్టించాడు. ఆయుధాలను ఆ గిడ్డంగిలో ఉంచారు. దక్షిణదేశపు రాజు ఆ గిడ్డంగికి స్వయంగా తాళంవేసి ఆ తాళం చెవిని తనవద్దనే ఉంచుకొన్నాడు.

ఆ గిడ్డంగికి బలమైన కావలా యేర్పాటు చేయబడింది. దక్షిణదేశపు సైనికులు గిడ్డంగికి కొంచెందూరంలో గుడారాన్ని వేసికొని కావలా కాస్తుండే వారు. అక్కడకావలా ఉన్న సైనికులకు అధిపతి సత్తెయ్య.

ఈ సంగతి మల్లన్న మంత్రికి తెలిసింది. కొద్ది రోజులలో పొంచియున్న తరువాత మల్లన్నమంత్రి తన సైనికులకు దక్షిణదేశపు సైనికుల వేషాలను వేయించాడు. మల్లన్నమంత్రి యిచ్చిన తాళం చెవి, ఉత్తరం తీసికొని వారు దక్షిణదేశపు ఆయుధాలున్న గిడ్డంగి వద్దకు వెళ్ళారు. తాము తీసికొని వచ్చిన ఉత్తరాన్ని మల్లన్నమంత్రి సైనికులు సత్తెయ్యకు యిచ్చారు.

ఆ ఉత్తరం తీసికొనివచ్చిన సైనికులను ఆయుధాలను తీసికోనివ్వవలసినదిగా దక్షిణదేశపు రాజు ఆజ్ఞ యిచ్చినట్లు ఆ ఉత్తరంలో ఉంది. మల్లన్న మంత్రి సైనికులు తమ వద్దనున్న తాళం చెవిని కూడా సత్తెయ్యకు యిచ్చారు.

ఉత్తరం తీసికొనివచ్చిన సైనికులను సత్తెయ్య యెప్పుడూ చూడక పోవడంవలన అతనికి వారివిూద అనుమానం కలిగింది. అయినా దక్షిణదేశపు రాజువద్ద ఉన్న తాళం చెవి వీరికి యెలాగ వస్తుంది? వీరు తీసకొని వచ్చిన తాళంచెవి సరియైనది అయితే




వీరిని దక్షిణదేశపురాజా పంపించాడని నమ్మవచ్చును. తాళంచెవి సరియైనది కాకపోతే అప్పుడు వీరిని బంధించవచ్చు నని తనలో అనుకొన్నాడు సత్తెయ్య.

మల్లన్నమంత్రి సైనికులు యిచ్చిన తాళం చెవితో గిడ్డంగి తాళం తీయుడానికి సత్తెయ్య ప్రయత్నం చేశాడు. తాళం మామూలుగా విడిపోయింది. తాళం చెవితెచ్చిన వారిని దక్షిణదేశపు రాజే పంపించాడని ఆ సంఘటనతో సత్తెయ్యకు పూర్తిగా నమ్మకం కలిగింది. మల్లన్న మంత్రి సైనికులు అక్కడఉన్న ఆయుధాలను తమ రాజ్యానికి తెచ్చివేశారు.

---




'దక్షిణదేశపురాజు వద్దవున్న తాళం చెవి ఉత్తరం యెలాగ లభించా'యని రాజు మల్లన్నమంత్రిని రహస్యంగా ప్రశ్నించాడు. అందుకు మల్లన్నమంత్రి యీ విధంగా సమాధానం యిచ్చాడు.

'ప్రభూ! తాళాలు తయారుచేసే వీరబ్రహ్మాన్ని ముందుగా అక్కడకు పంపించాను. ఆతడు యేదో ఒక పని విూద అక్కడకువెళ్ళినట్లుగా గిడ్డంగి వద్దకు వెళ్ళి తాళంకప్పను చూశాడు. తరువాత అతడు యింటికివచ్చి సరిగ్గా కదేమాదిరిగా ఉండే మరొక తాళం కప్పను తయారుచేశాడు. మర్నాడు రాత్రి వీరబ్రహ్మం గిడ్డంగివద్దకు రహస్యంగా వెళ్ళాడు దక్షిణదేశపు రాజు వేసిఉంచిన తాళం కప్పలో ద్రావకం పోసి ఆ తాళాన్ని తీసివేశాడు. ఆ తాళం కప్పకు బదులుగా తాను తయారుచేసిన తాళంకప్పను గిడ్డంగికి వేశాడు. తాళం కప్పలు రెండూ ఒకేమాదిరిగాఉండడం వలన దక్షిణదేశపు సైనికులకు తేడా తెలియలేదు.

తానువేసిన తాళంకప్ప తాలూకు చెవిని వీరబ్రహ్మం నాకు యిచ్చాడు. తరువాత దక్షిణదేశపు రాజు పేరుతో నేనే ఉత్తరాన్ని సృష్టించాను. ఆ ఉత్తరాన్ని తాళం చెవిని తీసికొని మనసైనికులు గిడ్డంగివద్దకు వెళ్ళారు. మన సైనికులను చూడగానే సత్తెయ్యకు అనుమానం కలిగింది అయినా తాళం చెవి సరిపోవడం వలన మన సైనికులను నిజంగా దక్షిణదేశపు రాజే పంపించాడని సత్తెయ్య నమ్మాడు. అందు చేతనే మన సైనికులు దక్షిణదేశపు ఆయుధాలను యిక్కడకు తెచ్చివేయగలిగారు.

ఆ సమాధానం విని రాజు మల్లన్న మంత్రి యుక్తిని యెంతగానో మెచ్చుకొన్నాడు. ●




ఈ విశాల ప్రపంచంలో ప్రతి ఘడియ లోనూ ఏదో ఒకమూల ఒక మరపురాని సంఘటన జరుగుతూనే వుంటుంధి. ఈ లోకంలోకి వచ్చిన ప్రతిక్షణం తన ఆ కొద్దిపాటి కాలాన్ని లోకం ఏ విధంగా ఉపయోగించుకుటుందోనని వెయ్యి కళ్లతోచూసి మరికొద్దిసేపు వుండలేక పోయానుగదాన్న అసంతృప్తితో గతించి పోతూనే వుంటుంది. గతించిన ఆ క్షణం మరి జన్మజన్మలకైనా రాదు కాని ఆ క్షణంలో జరిగిన సంఘటన జన్మజన్మల కైనా మరచిపోరానిదవవచ్చు. అటువంటి విలువైన క్షణాలతో పరిగెడుతున్న యీ కాలం ఎంత అమూల్యమైనది!

* * *

'డియర్ ఆర్–

ఆలశ్యం అయినందుకు క్షమించు. ఇవాళ సాయికాలం నువ్వు ఆరుగంటలకి పార్కులో వుండవలసింది. అక్కడ్నుండి రిక్షాలో స్టేషనుకుపోయి రాత్రి మెయిలు పట్టుకుందాం, తప్పకుండా బయల్దేరాలి. తరువాత–ఉహూ అవి నీ చెవిలోనే చెప్పాలి! ఇట్లు, –యస్'

రత్నానికి ఈచీటీ ఆశ్చర్యాన్ని కలిగించ లేదు. ఆలస్యంగా అందిందనే చిరాకుతప్ప. నిజమే, ఇరవైయొకటో తారీఖునాటికి కలకత్తాలో వుండవలసిన దానికి బదులు ఇంకాప్లాన్లు జరుగుతున్నాయంటే ఏమనిషి కైనా కోపం వస్తుందోరాదా? అనుకున్న ప్రోగ్రాంకి పనులు జరక్కపోతే రైలుకింద బుర్రపెట్టేయాలన్నంత కోపం వస్తుంది. అసహ్యంవేసి చచ్చేదాకా ఆ మనుష్యుల మొహం మరి చూడకూడదనే నిర్ణయం దాకా వస్తుంది రత్నానికి తనుకూడా అంత మాట పట్టింపు, నిక్కచ్చిగా మసలు కొనే వ్యక్తి. ఒకమారు ఒక నిర్ణయానికి వచ్చింతరువాత అది జరిగితీరవలసిందే. దానికెన్ని అడ్డంకులు ఆవరోధాలు వచ్చినా సరే.

ఈ పెళ్లికి ఎవరు ఇష్టపడకపోయినా రత్నానికి ఖాతరులేదు. ప్రపంచంతో సంబంధంలేదు మనసుకి నచ్చిన జీవితాన్ని ఎన్నుకోడంలో ఇంకొకరి ప్రమేయం తనకు అవసరంలేదు. జీవించబోయేది తనుగాని తన శరీరంలో ఇంకొక వ్యక్తిగాదు ఆ ఆత్మ విశ్వాసం, కృతనిశ్చయం రత్నంలో పుష్కలంగా వున్నాయి.

ఆవేళ సాయింకాలం ఆరేళ్లు గడిచాక వచ్చినట్టయింది రత్నానికి. సీటుగా ముస్తాబై పార్కులో అడుగుపెట్టగానే మర్రిచెట్లనీడలో సూర్యారావు రిక్షాతో సహా కన్పించాడు. గుప్‌చిప్‌గా ఇద్దరూ కలిసి స్టేషనుచేరుకొని హౌరాకి టిక్కెట్లు తీసి మెయిలెక్కారు. కంపార్టుమెంటులో దూరి తలుపులు వేసేదాకా రత్నానికి మన సులో మనసులేదు. అసలీ ఆకతాయి

## 21వ తారీఖు

సూర్యం వెల్ల ప్రయాణం జరుగుతుందన్న నమ్మకమే పోయింది ఇంతదాకా.

రత్నానికి అది మెయిల్లా అనిపించ లేదు. జలతార్లు కట్టిన పెళ్ళిపల్లకిలా వుంది తను ప్రేమించిన వ్యక్తిని పొంద బోతున్న విషయం జ్ఞప్తికి వచ్చేసరికి ఏదో చెప్పలేని అనుభూతి నరనరాల్లో కట్టలు తెంచుకొని ప్రవహిస్తోంది. అక్కడే తన కోసమే చల్లని చంద్రుడు ఉదయించి నట్టయింది ఈ అందమైన ప్రపంచ మంతా ఆ పండువెన్నెల్లో వెండి తీవలు ఊలలూగుతున్నట్లనిపిస్తోంది. తనువంతా మల్లెపువ్వుల వర్షంలో మునిగి సన్నజాజుల సెలయేర్లో తేలియాడి నట్లయింది ఆపళాన్న సూర్యాన్ని గట్టిగా ముద్దు పెట్టుకోవాలనిపించింది రత్నానికి. సూర్యం మీదున్న కొండంత కోపం అనురాగమై గోదావరిలా ప్రవహించింది.

'ఓహ్! యూఆర్‌టూ స్వీట్‌సూర్యం!' అని సూర్యం చెయ్యి గట్టిగా నొక్కడం తప్ప అందరిమధ్యా రత్నం మరేం చెయ్య డానికి అవకాశమెక్కడుంది

'ష్! నువ్వేం మాట్లాడకు హౌరా వెళ్ళేదాకా. నీవాటం చూస్తూంటే మనం యిక్కడే పట్టుబడి పోయేలాగుంది' అని సూర్యం చిన్న చిరునవ్వు చిలిపిగా నవ్వాడు.

కంపార్టుమెంటులో అంతా వింతజంతు వుల్లా వీళ్ళని చూస్తున్నారేగాని 'కూర్చోండర్రా' అని ఒక్కరి జిహ్వ వెంటా పెగలడంలేదు. దర్జాగా వాళ్ళ ఇళ్ళలో పీటల్లా తయారుచేసి తెచ్చు కున్నట్లు కూర్చున్నారు, బ్రాట్స్ సూర్యం సీటుకోసం గాలిస్తున్నాడు సీటు కనిపించలేదుగాని ఒకమూల ఓ అందమైన అప్సరస కూర్చోడం కనిపించింది తన అందాన్ని ఈకొత్త శాస్త్రీలు గుర్తించారా లేదన్నట్లు చక్కని గుండ్రని కళ్ళు మరింత పెద్దవిగా చేసుకొని చూస్తోంది. 'ఓల్డ్ రికార్డ్ బ్రోకెన్' సూర్యారావు గుర్తు పట్టేశాడు. సీటుమాట మరిచి పోయాడు 'ఇంత అందాన్ని భగవంతుడు ఈ వొక్కస్త్రీలోనే ఎందుకు పోశాడు?' మొదలైన శృంగార వాక్యాలు అలంకారాలు మనసులో ఒకటితరువాత ఒకటి గబగబ వరిస్తించుకున్నాడు.

'ఎక్కడైనా కూర్చోడానికి సీటు చూద్దూ, సూర్యం!' రత్నం ప్రశ్న సూర్యాన్ని మళ్ళీ సీటు వెతకడానికి లాక్కొచ్చింది.

'ఎక్కడైనా యేమిటి, కూర్చుంటే ఆ అందాలభరిణె పక్కనే కూర్చోవాలి' అనుకున్నాడు సూర్యం. వాస్తవానికి ఆ అమ్మాయిపక్కనే కొంచెం సీటుంది. బహుశా సభ్యతకోసమో లేక దగ్గరగా కూర్చోడానికి అనుమానాలువచ్చో ఆ ఖాళీ స్థలం వదిలేసినట్టున్నారు తత్తిమ్మా సీట్లలోనివాళ్లు. ఇటువంటి ప్రత్యేకసౌకర్యాలు నావంటి జగన్మోహిలకే దక్కుతాయి సుమా అన్నట్టు మరింత ధీమాగా దర్జాగా కూర్చుంది ఆ సీతాకోక చిలుక. నిజమే. ఒప్పుకోవలసిందే. నేటి జనబాహుళ్యం ఈబాహ్య సౌందర్యాలమీద చూపిస్తున్న మోజు చూస్తూంటే ఈ సినిమా తారలు ఆఖరికి మన రాజకీయ నాయకుల్ని త్రోసిరాజని వీళ్ళే అధికారం హస్తగతం చేసుకుంటారేమో అనిపిస్తోంది.

సూర్యం ఆకాస్త జాగాలో కూర్చుందామని ఉవ్విళ్లూరుతున్నా రత్నం ఏమైనా అనుకోవచ్చని, పైగా 'సీటుచూద్దూ' అని అభ్యర్థన చెయ్యడంవల్లా 'నువ్వెళ్ళి అక్కడకూర్చో' అన్నాడు గత్యంతరంలేక. రత్నం మారు మాట్లాడకుండా ఆ అమ్మాయివైపు నడుస్తూండడం చూసి ఆమె మరికొంచెం జాగాచేసి ఇచ్చింది. సూర్యం ఒకమారు ఆఇద్దర్నీ చూశాడు. బుజాలకి బుజాలు రాసుకుంటున్నాయి. 'ఇన్.. వ్యాటేమిన్' అని గిలగిల కొట్టు కున్నాడు. ఆగస్టు పదిహేను ఆదివారం నాడు పడితే ఆఫీసుక్లార్కు ఎలా ఫీలవుతాడో అంత బాధపడ్డాడు సూర్యం.

ఏ వుద్దేశాలతో తనపై ప్వారీచేసినా మెయిలు అందర్నీ వాగ్దానంచేసిన గమ్య స్థానానికి చేరుస్తూ తన కర్తవ్యంలోని నిజాయితీని అతివేగంగా నిరూపిస్తోంది. ఆపరుగులో సోమరితనంలేదు, కుంటితనం లేదు. కళ్ళకు కట్టినట్టు కనిపిస్తున్న ఆ కార్యదీక్ష, నిజాయితీ బ్రతుకుబాటలో పట్టాలనుతప్పి నడపకండని బోధిస్తోంది.

సూర్యారావు తప్పుచేస్తున్నాడేమోనని భయపడుతున్నాడు అసలు ఆభయంలోనే ఎప్పుడో జరగవలసిన ఈకార్యాన్ని ఇన్నాళ్ళా

జాగుచేసుకుంటూ వచ్చాడు. ఇరవయ్యొకటో తారీఖునాటికి హౌరాలో వుండవలసిన తను యింకా నూరుమైళ్ల దూరంలోనే వున్నాడు. బిద్ధకాన్ని భయాన్ని రెండు కళ్లలో నింపుకున్న సూర్యానికి ఆఖరి సమయం వచ్చేదాకా ఉడుకుపుట్టలేదు

'నువ్వు కొంచెంసేపు కూర్చుంటావా' అన్న రత్నం ప్రశ్నతో ఈలోకంలోపడ్డాడు సూర్యం.

'ఫరవాలేదు కూర్చో' అన్నాడు. ఇప్పుడు తనకి సావకాసంగా కూర్చోడానికిగాని అందాన్ని పరికించడానికిగాని బుర్రపని చెయ్యడంలేదు. మనిషిలో భీతాహం కాబూలీ అప్పులా పాకుతోంది. గుండెలో దడ పెళ్లికాని అమ్మాయివయసులా ఎక్కువైపోతుంది. బహుశా ఈపాటికి అంతా తనకోసం గాలిస్తూంటారు. రత్నంవాళ్ల తల్లిదండ్రులుకూడా గోలెత్తిపోస్తూంటారు వీళ్లిద్దరూకలిసే యీపని చేసుంటారని తప్పకుండా అనుమానపడ్తారు అనుమానం పత్తేమిటి? ఒకింటివారిని యింకొకింటివారు ఆడిపోసుకుంటూ క్రోకంపో పట్టుకునేవుంటారు. రత్నానికన్నా ఏమంత పెద్దకాకపోయినా అందరూ సూర్యాన్నే దుయ్యబడ్తారు—తనవాళ్లు, పైవాళ్లు కూడా. ఒకరు చితగ్గొడితే యింకొకరు చెమడాలు వొలుస్తారు. 'వేరకపోయి ఈవూబిలో దిగానురా భగవంతుడా' అని అక్కడే జారబడ్డాడు సూర్యం.

రత్నానికి ఈభయాలేవిలేవు. ప్రేమించిన వ్యక్తిని పెళ్లిచేసుకోవాలి. మనసుల్ని చంపుకుని మట్టిబొమ్మలుగా మసలకూడదు. ఒకవ్యక్తి స్వాతంత్ర్యాన్ని మరొక వ్యక్తి శాసనం చేయడానికి అర్హతలేదు. ఈ తర్కాలే రత్నానికి ధైర్యసాహసాలు ప్రసాదించేయి—ఇకపోతే పెళ్లితరువాత ఏం జరుగుతుందీ అనికదా—కాళ్లూ చేతులు సుభంగావుండి చేతిలో పట్టా వుంటూండగా ఉద్యోగందొరక్కపోతుందా? పట్టెడు మెతుకులు దొరక్కపోతాయా? ఫరవాలేదు. రోజులు బాగానే గడుస్తాయి.

ఇలా రాత్రంతా ఒకరు పొంగిపోతూ ఇంకొకరు కృంగిపోతూ ప్రయాణంచేసి తెల్లవారేసరికి హవురా స్టేషనులో కాలు పెట్టారు. జన కోలాహలంతో ఆ బ్రహ్మాండమైన స్టేషను ఇక్కడే 'ఎక్స్పో' ఎగ్జిబిషను జరుగుతోందన్నట్టు కనుల పండుగావుంది అందమైనవాళ్లు, ఐశ్వర్యవంతులు విచిత్రమైన దుస్తుల్లో, వస్తువులతో 'ఎవరన్నారీ దేశం బీద' దన్నట్టు ఛాలెంజి చేస్తూ ఠీవిగా నడుచుకుపోతున్నారు. సూర్యం బితుకు బితుకుగా అందరి కళ్లల్లోకి చూస్తున్నాడు, తన వెవరైనా పసిగడ్తారేమోనని. అబ్బే, ఒక్క పిట్టైనా వీళ్లని కన్నెత్తి చూడ్డం లేదు. ఆఖరికి గేటుదగ్గర టి. సి. కూడా బుర్ర వంచుకునే టిక్కట్లు తీసుకొని గెంటేశాడు. స్టేషనుదాటి బయటపడ్డ తరువాత టాక్సీవాళ్లు వీళ్లిద్దర్నీ చుట్టుముట్టేసి రమ్మని ఆహ్వానిస్తున్నారు, కాదు ఈడ్చుకుపోతున్నారు నెల్లూరు రిక్షావాళ్లలా, సోంపేట జట్కావాళ్లలా. ఇద్దరూ తేరుకొని 'అఖ్ఖర్లేదు మొర్రో' అని చేతులెత్తి దండాలు పెడ్తేనేగాని వీళ్లకి టాక్సీ అవసరంలేదని వాళ్లకి తెలిసినట్టులేదు

రోడ్డుమీద కాలు పెట్టగానే ప్రపంచ ప్రఖ్యాతి చెందిన 'హౌరా బ్రిడ్జి' కలకత్తా వైభవం వాతోనే మొదలెడ్తుంది సుమా అన్నట్టు గర్వంగా ఆకాశంలోకి దూసుకుపోతోంది. నదిమీద ఏ ఆధారంలేకుండా ఆ అద్భుత వంతెనని నిర్మించిన మేధా ప్రజ్ఞకు జోహారు లర్పించాల్సిందే! 'పెళ్లి మాటకేంగాని గొప్ప వింతల్ని చూస్తున్నాను సుమా' అని విస్తుపోతున్నాడు సూర్యం.

'అబ్బ. ఏమిటా చీమనడక వేగిరం నడు' అన్న రత్నం హుషారుతో గబగబ నడక సాగించాడు సూర్యం. బ్రిడ్జిమీద చీమలపోగులాగ జారిపోతున్న ఆ జనప్రవాహంలో మనవాళ్లిద్దరూ కలసిపోయారు.

'ఎడ్రస్సు మరచిపోలేదుగద, సూర్యం'

'తీసుకువచ్చాను' పరధ్యాన్నంగా అన్నాడు సూర్యం, గోడమీద పెయింటవుతున్న సినిమా పోస్టర్ని చూస్తూ.

'అదుగో నువ్విలా అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తే పన్లు జరగవు'

'పద'

'పోనీ టాక్సీలో పోదామా'

'వద్దు డబ్బులు దండుగ' అన్నాడు సూర్యం, ఇప్పుడు చూస్తామా మరొక మారు చూస్తామా అన్న దుగ్ధకొద్దీ తెగ నడిచేస్తూ.

'రత్నం! ఆ బట్టల షాపులో బొమ్మల్ని చూశావా'

'నీ కీ మేనియా పోయిందిగాదు అవి ఉత్తి మట్టిబొమ్మలు'

'నీ బుర్రెక్కడ పనిచేస్తేగా. ఎంత వేగిరం హనీమూన్లని హానిని జర్రుదామా అని చూస్తున్నావు ఆ బొమ్మల పక్కని కొమ్మలు గురించి నేనన్నది'

'వాళ్ల మాటకేమిటిగాని ఆ బొమ్మలకి చుట్టిన చీరలు బాగున్నాయి'

'ప్చ్! నీ కెప్పుడూ పువ్వులూ చీరలు దృష్టి. కొందువుగాన్లే నీ ఇష్టమొచ్చినన్ని చీరలు, జాకెట్లు, బ్రాసరీలు ఇంకొక్క రోజాగు'



## 21వ తారీఖు

'నీ వేళాకోళానికేంగాని సర్యా నా బట్టలు బాగున్నాయో లేవో చెప్పు లేకపోతే కొత్తవి కొనుక్కుంటాను'

'అవసరంలేదు క్లాసుగా వున్నాయి బట్టలు, బట్టల్లోనున్న మనిషి బ్యూటీ ఒకదానికొకటి పోటీ పడుతున్నాయి'

'నీ కవిత్వం మండిపోను'

'అరెరె! అలా కోప్పడితే ఎలా? ఇప్పట్నించి నువ్వు ప్రతీ వాక్యంలోను, వస్తువులోను, రాయిలోను, రప్పలోను అందాన్ని చూడాలి ఆనందంతో పర[illegible] చాలి ఉద్వేగంతో ఊగిపోవాలి. అంతే గాని–'

'నీ మొహం'

'అలాగా?' సరేలే, దానికేంగాని నా [illegible] లిప్పుడు లేకపోతే నీ వెన[illegible] కనిపిస్తాను'

[illegible] లేదు లెద్దూ'

'[illegible]మ్యొమ్యో! అలా అనకు, 'స్మార్ట్ [illegible] మనిషి జీవితంలో మొదటి పేజీ!' [illegible] ఆ పక్కనున్న సెలూన్లోకి [illegible] దారి తీసాడు సూర్యం.

'రత్నం' నువ్విక్కడ కూర్చోవాలంటే కూర్చో, విల్చోవాల్నుంటే విల్చో, ఒక్క అయిదు నిమిషాల్లో అయిపోతుంది 'విను [illegible] విరా, ప్లీజ్!' గడ్డం గీయించు[illegible] మొదలెట్టాడు సూర్యం.

[illegible]నికి ఎంత తొందరగా వుందో [illegible] అంత ఆలస్యం చేస్తున్నాడు [illegible] ఇప్పుడు [illegible] చవట [illegible] రత్నాన్ని [illegible] వెయిట్ చెయ్యడం తప్పలేదు.

'సూర్యం! రిజిస్టర్ మ్యారేజి సత్యంగా జరుగుతుందంటావా?'

బ్రిటానియా క్యాలండర్లోని తడిసిన పడతియొక్క అంగసౌష్టవాన్ని చూస్తున్న సూర్యానికిదేం వినిపించలేదు. రత్నానికి వళ్ళు మండింది

'సూర్యం! మనం దేనికోసం వచ్చాం? నీకీ పెళ్ళంటే యిష్టంలేదా? అయితే ఎందుకిన్ని ప్లాన్లువేసి నన్ను తీసికొచ్చి నట్టు?' పరిసరాలు మరచి ప్రశ్నించిన, లేదు గర్జించిన రత్నానికి–

'చంపేశావ్! ఇంతదాకావచ్చి ఇదేమిటిలా అడుగుతున్నావ్?' అన్నాడు సూర్యం తేరుకొని

'మరి నీ ముభావం చూస్తుంటే'

'బాగుంది. అటువంటి అనుమానాలేం పెట్టుకోకు. అన్నిటికీ తెగించి ఇంతదాకా నిన్ను తీసుకొచ్చింది నీతో ముభావంగా వుండటానికా?' ఈమారు సీరియస్‌గానే అన్నాడు లేకపోతే రత్నానికి మరీ కోపం వచ్చేసి పెళ్ళి టేగిపోయేదాకా వస్తుంది. ఆ తత్వం సూర్యానికి బాగా తెలుసు. కోపంగా వున్నప్పుడు తను రెండింతలు కోపం ప్రదర్శిస్తేనే బ్రతికిపోతాడు. లేకపోతే జరగవలసిన రసాభాసంతా జరుగుతుంది

ఇద్దరూ సెలూన్లోంచి బయటపడ్డారు ఎడమొహం పెడమొహాలతో. కుక్కతోక పట్టుకుని గోదావరీదినట్టుంది రత్నానికి.

'ఇరవయ్యొకటో తారీఖు రాత్రికి వుండవలసిన మనం–' రత్నానికి డేటు తప్పినందుకు పట్టలేనంత దుఃఖంగావుంది

'అబ్బబ్బ! నామాట విను రత్నం. ఆ తారీఖు దాటి యింకా పన్నెండుగంటలేనా కాలేదు మనమేమంత లేటుకాలేదు. అయినా ప్రేమించుకున్నవాళ్ళకి దేముళ్ళే అడ్డురాలేనిది డేట్లు అడ్డొస్తాయా? నువ్వింకా అశోక్‌కుమార్ కామినీ కౌశల్ యుగంలోనే వున్నావు, యంగ్‌బ్లడ్ అంతా రాజేష్‌ఖన్నా రాజశ్రీ యుగం దాటేస్తుంటేను' అని తన ఆధునికత్వాన్ని బయటపెట్టి ఓదారుస్తున్నాడు.

రత్నానికీమాటలేం వినిపించడంలేదు. మాట్లాడకపోతే మానీ, బతికేం అన్నట్టు. సూర్యం దారిలో కన్పించినవాటినన్నీ పరీక్షిస్తూ, రిమార్కులు పాసుచేసుకుంటూ నడుస్తున్నాడు హఠాత్తుగా ఆమూలనున్న 'స్నాక్స్‌కార్నర్' మండుతూన్న సూర్యం జఠరాగ్నికి ఆజ్యం పోసినట్లయింది.

'రత్నం' మెల్లిగా, మెత్తగా పిలిచాడు సూర్యం.

జవాబులేదు మళ్ళీ అందుకున్నాడు.

'అక్కడెంత ఆలస్యం అవుతుందో ఏమిటో మనం కొంచెం కడుపులో ఏమైనా వేసుకోకపోతే' అప్పుడే మాటలు వస్తున్న మూడేళ్ళ పిల్లాళ్ళా గొణిగాడు.

'ఊం. అదికూడా కానీ' రత్నానికి అసహ్యం పుట్టింది.

ఆంధ్రాకి మూడు స్టీలుప్లాంట్లు శాంక్షయినంత మహదానందాన్ని పొందాడు సూర్యం

ఇద్దరూ కలసి ఒకమూలున్న స్పెషల్ క్యాబిన్లో దూరారు అక్కడంతా లేడీ సర్వర్సే 'చచ్చాంరా, భగవంతుడా' అని రత్నం అనుకుంటే 'హమ్మయ్య ఏం రిలీఫు' అనుకున్నాడు సూర్యం రెండు అయిటములు తిన్న తరువాత 'ఇంకేమిటి?' అని వయ్యారాలు వొలకబోస్తూ ఒక 'బంగ్లాబ్యూటీ' టేబిలుకి ఆనుకొని అడుగుతోంది సూర్యం ఎగాదిగా పరీక్షించి ఇంకో అయిటముని ఆర్డరిద్దామనుకునే లోపల 'మరేం అక్కర్లేదు టీ' అని రత్నం ముగించేయవలసొచ్చింది లేకుంటే ఆ నంగనాచుల్ని చూసుకుంటూ మరో గంట వేస్టుచేస్తాడు.

హోటల్లోంచి బయటపడ్డారు సూర్యా



తోవ పక్కనున్న కొట్లో సిగరెట్టు కొని ముట్టించాడు. ఇక మరి నడకసాగిస్తే లాభంలేదని రత్నం ఒక టాక్సీని పిలిచి మాట్లాడి ఇద్దరూ కలసి తిన్నగా గమ్య స్థానానికి బయల్దేరారు.

టాక్సీ అతివేగంగా సాగిపోయి 'ట్రాఫిక్ లైట్'దగ్గర అటకాయించిపోయింది. రత్నం గుండె ఆగిపోయింది. మనసు పరిపరివిధాల పోయింది. సూర్యంమాత్రం దర్జాగా పొగ వదుల్తూ "999 మిషన్ హాంగ్‌కాంగ్' పోస్టర్ని చూస్తున్నాడు. 'మార్నింగ్ షో'లు వుంటాయిగదా వెళ్తే బాగుండును అనుకున్నాడు. కాని రత్నం 'షూ' జ్ఞాపకం వచ్చి ఊరుకున్నాడు. టాక్సీ మళ్ళీ పరుగు అందుకుంది.

సూర్యం చెప్పిన అడ్రెస్సు ప్రకారం డ్రైవరు 'ఏమర్సాట స్ట్రీట్'కి టాక్సీని మళ్ళించాడు. చేరవలసిన గమ్యస్థానం దగ్గర పడుతోంది. ఎక్కడో మైకులో 'ఛోటీసీ ములాకత్ ప్యార్‌హోగయా' విని పిస్తోంది. కారు 'రాజాలేను' చేరుకుంది. పాట మరీ స్పష్టంగా వినిపిస్తోంది. వీధి ముందర చిన్న పిల్లలు ఇసుకతో కట్టుకున్న పిచ్చికగూళ్ళతో ఆడుకుంటున్నారు. వీధి కొనన శోభాయమానంగా అలంకరించిన పెద్ద పెళ్ళిపందిరి కనిపిస్తోంది. బాజాలు, బజంత్రీలు, కార్లుఅంతా గొప్ప హడావిడిగా వుంది.

కారును ఆపి ఆ పెళ్ళవుతున్న యింటి నంబరు చూసి రమ్మని డ్రైవర్ని పంపించారు మనవాళ్ళిద్దరూ. నంబరు చూసి వచ్చాడు డ్రైవరు అదే నంబరు. రత్నం, సూర్యం ఇద్దరూ మొహాలు చూసుకున్నారు. ఏం అర్థం కావటంలేదు అనుమానం కొట్టవచ్చినట్టు వస్తోంది. ఆ పందిర్నుండి వస్తున్న ఒక పన్నెండేళ్ళ అబ్బాయిని పిలిచి ఎవరిపెళ్ళి జరుగుతోందని ప్రశ్నించారు.

'లెక్చరరుగారమ్మాయి పద్మావతి పెళ్ళవుతోంది' చెప్పాడు.

రత్నం టాక్సీలో కుప్పలా కూలిపోయాడు. టాక్సీని తిప్పమన్నాడు సూర్యం. రోడ్డుమీద పిల్లలు కట్టుకున్న పిచ్చికగూళ్ళని తొక్కుకుంటూ దూసుకుపోయింది టాక్సీ.

కొత్త నెత్తురు తన చరిత్రలో మరొక పుటను రాసుకుంది. ●

# గంగానది ఎండిపోతోందా?

**వ్యాసం, ఫోటోలు : సుశ్రీ**

[ఈ వ్యాసం రచయిత ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా విలేఖరి కొంతకాలం కిందట హిమాలయ ప్రాంతాలని పర్యటించారు ఫోటోలు తీశారు వ్యాసాలు రాశారు. వాటిలో కొన్నిటిని పాఠకులకి అందచేస్తున్నాము ]

భారతదేశ చరిత్రకే చిహ్నమయిన గంగానది ఎండిపోతున్నదా!

మరొక 1000 సంవత్సరాలలో కేవలం ఇసుకతిప్పలే మిగులుతాయా !

భాగీరథి ప్రవాహం సంగీతం శాశ్వతంగా మోగదా !

సాధువులు, ఋషులు గంగానదీ శబ్దాలలో దివ్యమయిన శృతులు వినిపిస్తాయంటారు ఈ శృతులనిముంచే భయంకర శబ్దాలు మనదేశం ఎల్లలవద్ద ఉండే మహా పర్వతాలలో మోగుతున్నాయా?

ప్రకృతి గాంభీర్యానికే ముప్పవాటిల్లే ప్రమాదం ఇలా ఉండగా ఆదిశంకరాచార్యులు స్థాపించిన బదరీనాథ్ పీఠం మాటేమిటి? ఆదిశంకరుల ఆజ్ఞ ప్రకారం బదరీనాథ్ పూజారి ఎప్పుడూ అక్కడికి 1500 మయిళ్ల దూరంలో ఉన్న కేరళ రాష్ట్రానికి చెందిన నంబూద్రి బ్రాహ్మణుడే అయిఉండాలి కొందరు స్థానిక వర్గాలవారు తమ పోరాటాలలో మునిగిపోయి ఈ ఆజ్ఞనే ధిక్కరించే సూచనలు కనిపిస్తున్నాయి నేడు

జోషిమఠ్‌లో ఉన్న నరసింహస్వామి విగ్రహం మణికట్టు అతిసన్నటిది ఇది విరిగితే బదరీనాథ్ నాశనమయిపోయి, ఈ దేవభూమికి అధ్వర్యం వహిస్తున్న నారాయణుడే భవిష్య బదరికి తరలివెళ్లిపోతాడని ఒక సాంప్రదాయం ఉంది ఇది నిజమవుతుందా !

హిమాలయాల మంచులలో అవధూతలాగా, దిగంబరులుగా నివసిస్తున్న సాధువులు చదువు ప్రదేశాల సామాన్య మానవులకన్నా వేరు కాదా?

* * *

పోయిన సంవత్సరం నేను కొన్ని నెలలో బదరీనాథ్, గంగోత్రి గోముఖ, చమోలి, ఉత్తర కాశీ ప్రాంతాలలో పర్యటించాను. అప్పుడు నన్ని ప్రశ్నలే వేధించాయి నా భయాలు నిజం కావని నా ఆశ కాని, ప్రకృతి ఉద్దేశం వేరు, అనిపిస్తుంది

గంగానది జన్మస్థానం గంగోత్రి హిమరాశి, ఈ హిమరాశి కొంతకాలంగా వెనుకకి జరుగుతూఉంది గంగా ప్రవాహం వెలువడే గోముఖధార కూడా గత ముప్ఫయి సంవత్సరాలలో ఒకటిన్నరమయిళ్ళ వెనుకకి జరిగిందిట — పన్నెండు సంవత్సరాలలోనే రెండు ఫర్లాంగులు కదిలిందిట

ఒకనాడు, గంగానది నేటి గంగోత్రి గ్రామంవద్ద ఉద్భవించాలని భగీరథుడు తపస్సు చేశాడు నేడు గంగోత్రి భాగీరథి ఉద్భవించేచోటికి పన్నెండున్నర మయిళ్ల దూరంలో ఉంది

కొన్నివేల సంవత్సరాలక్రితం గంగోత్రి హిమరాశి 35 మయిళ్ల పొడుగు ఉండేదిట ప్రస్తుతం దాని పొడవు 18 కి తగ్గిపోయింది

కొందరు శాస్త్రజ్ఞులు ఒకప్పుడు గంగోత్రి హిమరాశి గంగోత్రిగ్రామానికి తొమ్మిదిమయిళ్ళ దక్షిణందాకా వచ్చేదని అంటారు — అంటే భగీరథుడి కాలం ముందు

తలుచుకుంటేనే భయంవేస్తుంది! కాని వెయ్యేళ్ల తర్వాత గంగానది ఉద్భవించే హిమరాశి ఎండిపోవచ్చు ఇంకా త్వరలోనే ఎండిపోవచ్చు కూడా

సామాను మోసే కూలీలు గోముఖం ఒకప్పుడు ఉండే ప్రదేశాలని చూపిస్తారు ఆరి వది, పదిహేను సంవత్సరాలక్రితం హిమమయమయి ఉండేవి నేడు శుష్క ప్రదేశాలయిపోయాయి

గంగోత్రి పక్కనే నివసించే సాధువులు క్రమంగా హిమరాశితోబాటు తామూ తమ నివాసస్థానాలని మార్చుకుంటూ వస్తున్నామని చెప్తారు

గంగామతల్లి అపయానం చూసి దుఃఖించటంకన్నా వీరందరూ ఏమి చెయ్యగలరు?

ఇది ప్రపంచమంతటా జరిగేదే, హిమరాశులు అక్కడక్కడా — విస్తరిస్తూ



గంగానది జన్మస్థానం గంగోత్రి హిమరాశి



వారదకుంటలోనుంచి పవిత్రజలం తీసుకుని వస్తున్న ఒక యాత్రికుడు. ఆదిశంకరులు ఇక్కడి నుంచే నారాయణ విగ్రహాన్ని తీసుకువచ్చినట్లు చెప్తారు.

చ్చాయి. మనకిమాత్రం వచ్చిన అవాంతరం కాదని నచ్చచెప్పారు నిపుణులు కొందరు. ఉదాహరణకి పిండారి హిమరాశి బాగా వెనక్కి తగ్గిపోయింది.

గంగోత్రివద్ద గంగానది చిన్న వాగు లాగ కనిపిస్తుంది. అక్కడి పెద్ద మంచు గడ్డ కనిపించదు సరికదా హిమరాశి అవ గమనం తర్వాత మిగలవలసిన రాళ్లకుప్పలు కూడా మాయమయ్యాయి. (ఈ రాళ్ల కుప్పలని ఇంగ్లీషులో 'మొరెయిన్' అంటారు. మొరెయిన్ ఇప్పుడు నదీ మూలానికి అయిదుమయిళ్లదూరంలో కని పిస్తుంది.)

బదరీనాథ్‌లో ఒకటే ఒక వీధి ఉంది. దీని వెంబడే నడిచి వెడుతున్న నాకు రావల్ (ఆలయం ప్రధాన పూజారి)కీ, ఆలయం కమిటీవారికీ మధ్య నడుస్తున్న యుద్ధం గురించి తలుచుకొనగానే విచారం వేసింది. సుమారు ముప్పయి ఏళ్లకింద ఉత్తర ప్రదేశం ప్రభుత్వం నాయకుడు పండిత గోవింద వల్లభపంత్‌గారు కొందరి ఫిర్యాదులపయి రావల్ నిరంకుశ పరిపాలనని అరికట్టటానికి ఈ కమిటీని నిర్మించారు.

ఈ కమిటీ వారు నేడు ఆదిశంకరులు స్థాపించిన సాంప్రదాయాన్నిమార్చి బదరీనాథ్‌లో నంబూద్రి కులానికి చెందని వారిని కూడా ప్రధానార్చకులుగా వెయ్యటానికి చూస్తున్నారని వదంతి.

ఆదిశంకరాచార్యుడు గొప్ప తత్త్వవేత్త మాత్రమేకాదు; గొప్ప జాతీయనాయకుడు కూడా. కేవలం చిన్న తగాదాలకోసం ఆయన నెలకొల్పిన వరవడిలో మార్పు తీసుకు రావటం ఎంతమాత్రం సబబుగా ఉంటుంది?

నాది రాజకీయవిలేఖరివృత్తి. ఎప్పుడూ మనుష్యులని కలిసి గొడవలనిగురించి అడగటం నా నిత్యజీవితంలోని ముఖ్యాంశాలలో ఒకటి; కాని, సెలవులకి ఒకసారి ఈ హిమాలయ ప్రాంతానికి ఎందుకు వెళ్ల రాదనిపించి ఇటువచ్చాను. నేను కన్నవీ, విన్నవీ ఈ రెండూ ఆందోళన కలిగించే విషయాలు.

ఇక దేవస్థానంవారు యాత్రికులకి కల్పించే సదుపాయాలు ఎలా ఉన్నాయి? వాటిని చూసి నేను హడలిపోయాను.

బదరీనాథ్‌కి ఏటా లక్షమంది పయిగా, దేశంలో అన్నిచోట్లనుంచి, యాత్రికులు వస్తారు. వీరి సంగతిని అధికారులు ఏ మాత్రం పట్టించుకునేట్లు కనిపించరు.

అంతేకాక, ఈ ప్రాంతంలో మనోహర మయిన ప్రాంతాలని విలాసయాత్ర కేంద్రాలుగా మార్చటానికి ప్రయత్నించినట్లు కనిపించదు.

* * *

22 సెప్టెంబర్ '67 ఉదయం ఋషికేశంలో జోషిమఠ్‌కి వెళ్లే బస్సుకోసం కాచుకొని ఉన్నాను. అప్పటికి 20 నిముషాల ఆలస్యం. నేను కొద్దిగా చిరాకు పడటం మొదలుపెట్టాను. ఇంతలో ఒక దృఢకాయుడయిన యువకుడువచ్చి డ్రయివరు సీటులో కూర్చున్నాడు. మనిషిచూస్తే దిట్టంగా ఉన్నాడు. పెద్ద విగ్రహం. ఇంజన్ స్టార్టు చేసేందుకు స్విచ్ కి తిప్పేముందు రెండుచేతులూ కలిపి దేవుళ్లందరికీ మొక్కాడు. వారిలో బదరీనాథ్ కేదారనాథ్‌లదే అగ్రస్థానం! తర్వాత రెండు చెవులూ చేతులతో పట్టుకుని భక్తి పూర్వకంగా వినమ్రశిరస్కుడయ్యాడు...



గోముఖంలో తన స్నానం అయినతర్వాత తన దండానికి స్నానం చేయిస్తున్న ఒక యువసాధువు. ఈ నీరు చాలా చల్లగా ఉంటుంది

## గంగానది...

'ప్రయాణికులందరూ 'జయ్ బదరీ విశాల్!' అని ఏకకంఠంగా నినాదం చేశారు. కొందరు ఓంకారశబ్దం చేశారు. ఇంతలో బస్సు కదిలింది...

ఋషీకేశంనుంచి కేదారనాథ్ దాకా అందరూ 'యాత్రికు'లే ఉత్తి 'ప్రయాణికు'లంటూ జనం వుప్పుకోరు!

అందరూ దేవుడికి జేజేలు పలుకుతూ ఉంటే నా మానసిక పరిస్థితి ఎలాఉంది? వారి భక్తిని పంచుకుంటున్నానా? ప్రయాణం-యాత్ర-క్షేమంగా ముగియాలని ప్రార్థించానా? నా ఆలోచనలు నాకే అంతు పట్టలేదు.

చిన్నప్పుడు మా నాన్నగారు నా చేత సహస్రనామాలు చదివించేవారు. విశ్వవిద్యాలయం రోజుల్లో మూఢనమ్మకాలని వదులుకుని మార్క్సిజమ్ వంటి 'వాస్తవిక' సిద్ధాంతాలమీద నమ్మకం అలవరుచుకున్నాను. ఇప్పుడిదంతా అల్లకల్లోలం అయిపోయింది...

నేను ఈ విశాల యాత్రకి పూనుకున్న కారణం ఏమిటి? ... అందులో ... కూడా ఒకటి. కాని నిజానికి నా అంతరాంతరాలలో ఇంకా ... ఒకటి ఉంటుంది. ... చరిత్రకీ ... పెట్టుకున్న ... ఎక్కువ బహుమోలని పెట్టుకుంచి వాటితో కలిసి పోవాలనే ఆకాంక్ష దీనికి కారణం. ఇది ... దేశం. పవిత్ర నదుల ... దేశం. పాండవులు నడిచిన గడ్డ. ... చార్యులు తిరిగిన భూమి...

మన రక్షణ మంత్రి శ్రీ చవాన్ అప్పుడప్పుడు అంటూ ఉంటారు, 'కొండంత మనుష్యులు మనకి కావాలి' అని. (ఇది జాన్ ఫాస్టర్ కార్యాలయంద్వారంమీద చెక్కిన వాక్యం) హిమాలయాల ఉన్నత శిఖరాలని చూస్తూ ఉంటే నా భావనాశక్తి అయినా అంత వయిక ... అని పించేది నాకు! ●

## వారఫలం

**10-5-1968 శుక్రవారం మొదలు 16-5-1968 గురువారం వరకు**

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో శ్రమ కలిగినా, దానికి తగిన ఫలితం లభిస్తుంది ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**వృషభం.** మీకు యిష్టంలేకపోయినా, యితరుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. వారం ఆఖరులో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు.— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సాటివారితో మాటపట్టింపులు తగవు

**మిథునం:** వృత్తిరీత్యా చేసే ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం అధికం కాగలదు.

స్త్రీలకు.— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. నూతన విషయాలు తెల్సుకొంటారు.

**కర్కాటకం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— సంతానానికి విద్యా సంతోషాలు లభిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. మీకు ముమ్మందు ఉపయోగించగల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి నూతన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో వి ప్రయత్నాలు ఫలిస్తాయి. కొన్ని వ్యవహారాల్లో మీరు మొగమాటాలకు లొంగిపోయే ప్రమాదం ఉంది

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:** వృత్తిలో ప్రయోజనంలేని శ్రమకు గురి కాగలరు. ఉద్యోగంలో మీ కృషిని అధికారులు గుర్తించ గలరు. ప్రయాణాల్లో ప్రయాస అధికంగా ఉంటుంది రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు.— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**వృశ్చికం** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి సాటివారితో వాదప్రతివాదాలు తగవు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి

**ధనుస్సు:** ఇదివరకు ఆగిపోయిన వ్యవహారాలను యిప్పుడు లాభదాయకంగా పూర్తి చేయగలరు. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం మధ్యలో చికాకులకు గురికాగలరు. మీ తాలూకు వస్తువులుపోయే ప్రమాదం ఉంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి అధిక వ్యయం జరుగుతుంది.

**మకరం:** వ్యాపారం భారీ యెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది ఉద్యోగంలో మీ కృషిని అధికారులు గుర్తించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది.

స్త్రీలకు — ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**కుంభం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు

స్త్రీలకు.— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి విలాస వస్తువులు కొంటారు.

**మీనం.** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉండడు నూతన విషయాలను తెల్సుకొంటారు

—మహేష్ ●




# మంత్రాల మహత్తు

బుడుసు వెంకటరమణయ్య

'మంత్రాలకు చింతకాయలు రాలు తాయా?' అని అంటారు, ఆక్షేపణగా. సరిఅయిన పద్ధతిలో పునశ్చరణ చేసి, జపిస్తే మంత్రాలు పనిచెయ్యనూ వచ్చు; చింతకాయలు రాలనూ వచ్చు.

వేదాల్లో మంత్రాలు, బ్రాహ్మణాలు అనే రెండు విభాగాలున్నవి. వీటిలో మంత్రాలు ప్రధానమైనవి. నియమిత సమయాల్లో, నియమితములైన పద్ధతులలో ఆయా దేవతలకు సంబంధించిన మంత్రాలను గురుముఖతః ఉపదేశం పొందడం, వేదాలను అధ్యయనం చెయ్యడం అవసరం. శతాబ్దాలేకాదు—సహస్రాబ్దాల నుంచీ యీ సంప్రదాయం అనుస్యూతంగా వస్తూ ఉన్నది. ఈ నియమాల ననుసరించి వేదాధ్యయనం చేసేవారు ఆయా దేవతలను సులభంగా స్వాధీనం చేసుకునేవారు; కావలసినప్పుడు వానలు కురిపించేవారు. వారు ఉండే ప్రాంతాలలో పాడిపంటలకు లోపం ఉండేదికాదు. ఆ నియమాలను పాటిస్తూ వుండబట్టే వేదాధ్యయనానికి వారికి చాలా ఎక్కువ కాలం పట్టేది

విధి, నియమాలను లెక్కించకుండా అధ్యయనం చేసేవాళ్ళూ వున్నారు. వాళ్ల సంఖ్యే అధికం కూడాను. కాలం వ్యర్థం కాకూడదనే భావంతో రాత్రింబగళ్ళు శ్రమించి తక్కువ కాలంలోనే అధ్యయనం పూర్తి చెయ్యడము, క్రమంలోనే కాకుండా జటలోనూ, ఘనంలోనూ కూడా కృతార్థులయి మహా విద్వాంసులుగా పేరు పొందడము ఉన్నది.

అయితే, ఈ రెండింట్లో ఏది సరియైన పద్ధతి అనేదే ప్రశ్న.

దక్షిణ దేశంలో పేరుపడిన వేదపండితుడు ఒకపెద్ద ఘనాపాఠి ఉండేవాడు వేదపండితులకు లక్ష్మీ కటాక్షం సుతరామూ తక్కువ కావడం వల్ల ఆయన దేశసంచారం చేసి, పలుచోట్ల తన పాండిత్య ప్రకర్షను ప్రదర్శించి బహుమతులూ, వార్షికాలూ సంపాదిస్తూ సంసారం నడపడం ఆయనకు పరిపాటి.

ఒకప్పుడాయన సంచారం చేస్తూ, ఒక గ్రామం చేరుకున్నాడు. అప్పటికి బాగా పొద్దెక్కింది ఆ గ్రామంలో వున్న ఒక వేదపండితుడు ఈయన రాక విని ఆతిథ్యానికి తన యింటికి పిలిచాడు. ఘనపాఠిని ఇంటి అరుగుపైని కూర్చోపెట్టి తన పనిమీద ఎక్కడికో వెళ్ళాడు.

ఆ అరుగు చివర ఒక అబ్బాయి కూర్చుని వేదం వల్లె వేసుకుంటున్నాడు. అతడు ఆ పండితుని కొడుకు. ఘనాపాఠి కుతూహలంతో ఆ బాలుణ్ణి ప్రశ్నించి, కొన్నేళ్ల కిందట ప్రారంభించిన పరాయితం యింకా పూర్తికానందుకు అసంతృప్తిని వెల్లడించాడు.

కొంచెం సేపటికి యజమాని యింటికి వచ్చాడు అతని వెనకాలే ఆ బాలుడు లోపలికి వెళ్ళిపోయాడు. అతిథి అయిన పండితుడు తన చదువు విషయమైన అసంతృప్తిని వెల్లడించినట్లు తండ్రికి తెలిపాడు.

మరొక అరగంటకాలం గడిచింది.

'అబ్బాయీ! బాబుగార్ని స్నానం చెయ్య వచ్చునని చెప్పు' అని తండ్రి ఆదేశించగా, ఆ పిల్లవాడు పరదేశి పండితునికి ఆ సంగతి తెల్పి, పెరట్లో ఉన్న నూతికి దారి చూపించాడు

ఘనపాఠి అక్కడికి వెళ్లి చూడగా, చేద, తాడు, చెంబు ఏమీలేవు. ఎలా స్నానం చెయ్యాలో తెలియక ఆయన దిక్కులు చూడసాగాడు.

వెనక యింట్లోంచి యిది గమనిస్తున్న తండ్రి కొడుకుని పిలిచి 'అబ్బాయీ! బాబుగారికి స్నానం చేయించు' అని చెప్పగా, ఆ అబ్బాయి వచ్చి నూతి దగ్గర నిలిచి, చేతులు జోడించి, వరుణ దేవతా మంత్రాలను సుస్వరంగా ఉచ్చరించాడు.

నూతిలోంచి నీటిధార ఎత్తుగా బయటికి వచ్చి ఆవేదపండును స్నానం చేయించింది.

గొప్ప వేదవేత్త అయిన ఆ ఘనపాఠి నిర్ఘాంతపోయాడు!

రెండు పద్ధతుల్లో ఏదిమేలైనదనే ప్రశ్నకు పయి సంఘటనే సరియైన సమాధానం కాలేదూ? ●



ఒకవారం విపరీతం

# మనిషిగా జన్మించిన తోడేలు రాము

తోడేలు గుణాలు కల రాము అనే కుర్రాడు 14 సంవత్సరాలుగా లక్నో ఆసుపత్రిలో (1954 వ సంవత్సరం) చికిత్స పొందుతూ ఏప్రిల్ 20వ తేదీన చనిపోయాడట. 14 సంవత్సరాల క్రితం లక్నో ఛార్‌బాగ్ రైల్వే స్టేషన్‌లో ఒకరైలు బోగీలో దొరికాడట. జంతువు వలె పచ్చి మాంసం తినడం, నెత్తురు తాగడం జంతువులను చీల్చుకుని జుర్రడం యీ రాము చేస్తుండడం చూశారట. శ్వాసకి సంబంధించిన లోపం వల్ల ఆసుపత్రిలో వుంచినా, చివరికి చనిపోయాడట ఇతను. ఒక మానవునికి యీ గుణాలు బుద్ధులూ ఎలా వచ్చాయి అనే విషయ పరిశోధనలో 'రాము' శరీరం వుపయోగిస్తుందని విజ్ఞుల అభిప్రాయం.




## వదినగారి హత్య

తన అన్నగారి భార్యను, కొడుకును చిన్న తంబి అనే అతను గొడ్డలితో నరికిపారేశాడట. కొన్ని రోజుల క్రితం వదినగారి చేయి పుచ్చుకున్నాడట యితను (!) ఆమె దీనిని పంచాయతీకి పెట్టేసరికి అతనికి కోపం వచ్చి అన్నగారింట్లో లేని సమయంలో వెళ్ళి, గొడ్డలితో వదినెగారిని నరికి, పక్కనే వున్న 3 ఏళ్ళ కుర్రాడిని కూడా నరికి పారేశాడటతను. ఓమూర్ తాలూకా న్యాటపాళయంలో జరిగిందిది.

## సకుటుంబ మరణం

కుటుంబంలో ఏర్పడిన గొడవలను భరించలేక ఒకతను తన భార్యకు, యిద్దరు పిల్లలకు (18 నెలలు, 4 నెలలు) విషం కలిపిన పాలు యిచ్చి, అవి త్రాగి వారు చనిపోవడం చూసి, తనూ త్రాగి చనిపోయాడట. కన్నవర్‌పాళాయంలో యిది 21వ జరిగింది. ఇంతకీ ఇంత చేసిన ఆ గొడవ లేమిటో తెల్లేదు.

## బ్యాంకు దోపిడీ

ఏప్రియల్ 20వ తేదీన బుయినీస్ ఎయిరిస్ స్టేట్‌బ్యాంకులో 65.6 పిసాస్ (2 మిలియనులు— అనగా 20 లక్షలు) దొంగతనం జరిగిందట. ముఖాలకు ముసుగులు వేసుకున్న నలుగురు యీ బ్యాంకులో జొరబడి పిస్టల్స్ చూపించి, తమ పని నెరవేర్చుకు పోయారట.




## జైల్లో వాచస్పతి

హైదరాబాదులో 8 ఏళ్ళుగా జైల్లో వున్న ఒకవ్యక్తి యీసారి 'వాచస్పతి' అనే పరీక్షకు వెడుతున్నాడట. ఈ పరీక్ష యమ్మేకి సమానమయిందనీ, అతను జైలు శిక్ష అనంతరం ప్రొఫెసరుగా వుద్యోగం సంపాదించవచ్చునీ జైలు అధికారులు అన్నారు. గూండాల గుంపులో యితను పట్టుబడినపుడు పెద్దగా చదువు వచ్చినవాడు కాదనీ, 'విద్యాసక్తి' చూసి, జైలు అధికారులు అతనికి అవకాశం యిచ్చారని అన్నారు.

## మహీధరోక్తులు

మహీధర నళినీమోహనరావు

మేష్టారూ!
కొంచెం ఇది చదివి
చెప్తారూ! ఎంత కష్టం సార్
డిగ్రీ తెచ్చుకోవడానికి...!



గార్దభంబు మంచి గంధంబు
మోయుచో
బరువుతప్ప గంధ మెరుగగలదె?
అర్థమెరుగకున్న వ్యర్థ
మధ్యయనమ్ము
హృదయవర్తి యిా మహీధరోక్తి.

# కష్టేలు తెచ్చిన చావు

మానికొండ (కంకిపాడు—గుడివాడ)లో వంట చెరుకు (కట్టెపుల్లలు) దొంగతనం చేస్తుండగా ఇందుపల్లి విల్సన్ అనే అతన్ని పట్టుకుని ఆగ్రహావేశాలతో చెత్త కింద తన్ని, మునసబు గారింటికి లాక్కెళ్ళారట. మునసబుగార తన్ని పోలీస్‌స్టేషన్‌కు పంపితే అతనక్కడే చనిపోయాడట. ఏప్రియల్ 16న జరిగిందిది.

* * *

అన్నయ్య తనను తిరుపతి తీసుకువెళ్ళలేదని ఆశాభంగం చెంది, "తిరుపతి వెళ్ళని యీ వెధవ జీవితం ఎందుకు?" అని చీదరించుకుని, 33 ఏళ్ళ రాజమ్మాళ్ అనే ఆమె కడలూరులో విషం త్రాగి, చనిపోయిందట 22వ తేదీన జరిగినదిది

# పోరాటంలో పసిపిల్ల

ధర్మపురి తాలూకాలో ఒక వూళ్ళో అన్నదమ్ముల తగాదా మధ్యలో 2 నెలల పసికందు నలిగి చని పోయిందట. తన భర్త, భర్త తమ్ముడు కొట్టు కుంటూ వుంటే, ఆ ప్రాంతంలో వున్న తన 2 నెలల పసిబిడ్డను పిరంగి అనే ఆమె ఎత్తుకుని, బయటకు తెచ్చేసరికి తన భర్త తమ్ముడు, తమ్ముడు భార్య, మరికొందరు ఆమె మీదపడి ఆమెను దారుణంగా తన్నారట దాంతో ఆమె చేతిలో వున్న పసికందు 'రక్తపు ముద్దయి, చనిపోయిందట. ఏమిటీ క్రూరం! (19న జరిగిన దారుణం)

# అకాల మృత్యువు

ఆరణి తాలూకా వెళ్ళిరి గ్రామానికి చెందిన కాశియమ్మ అనే 17 ఏళ్ళ వివాహిత బట్టలు




పుతుక్కుంటూ, ఆ పూవులో బావిలో (22న) పడి పోయిందట. అకాల మృత్యు వనేది వుంటుందని అది నిజమని నమ్మితీరాల్సిందే గదా!

# చర్చిల్ కుమార్తె అరెస్టు

వెడతాగి, లండన్ రోడ్డు మీద ఒళ్ళు తెలీని స్థితిలో నడిచిపోతున్నందుకు విన్‌స్టన్ చర్చిల్ కూతురు సారాచర్చిల్‌ను లండన్ పోలీసుశాఖ, అరెస్టు చేసిందట—ఎంత వారికైనా!!

# నగ్ననృత్యం

విల్లుపురంలో ఆంజనేయ వెయ్యిదీపాల (నోము) పండుగ సందర్భంలో భరతనాట్యం పేరిట ముగ్గురు స్త్రీలు—ఇరవైయ్యేళ్ళు కూడా నిండనివారు—తమ శరీరం వొంపులను, సొంపులను అతినీచంగా ప్రదర్శించారన్న కారణాన్న నాట్యం మధ్యలోనే వారిని పోలీసు అరెస్టు చేసింది—18న జరిగింది భాగవతానదారం!!

# అవయవాల మార్పిడి

గుండెమార్పిడియేగాక, మెదడు మార్పిడిని చేయగలమని ప్రఖ్యాత డాక్టర్ బెర్నార్డ్ హోప్ బర్గ్‌లో చెపుతూ, "మెదడే కాదు శరీరంలో వున్న ఏ భాగాన్నయినా తీసి మరొకని అదే అవయవాన్ని తీసి అతకవచ్చని చెపుతూ— అనేకుల అవయవాలతో జీవిస్తున్న ఒక జీవుణ్ణి చేయవచ్చున్నారట."

# పిడుగుపాటు

వేలూరులో పిడుగుపడి 15 ఏళ్ళ కోదండపాణి అనే అతను, 17 ఏళ్ళ రవి అనే అతను మాడి, మసి అయిపోయారట పెరువళయం అనే వూళ్ళో 35 ఏళ్ళ కన్నమ్మాళ్ కూడా పిడుగుపాటుకే చని పోయిందట మద్రాసు ప్రాంతంలో కురిసిన వానల ఫలితం కాబోలు యిది

# అంతమైన ఓరిమి

పెరిగిన కుటుంబంతోపాటు పెరగని రాబడికి నిస్పృహ, నిరాశ చెంది కష్టాలను భరించే వోపికలేక 37 ఏళ్ళ పూంగాళన్ అనేవ్యక్తి వురి పోసుకుని చని పోయాడట ఇది 22నే జరిగింది.

# పట్టపగలు దారుణం

అలప్పాకం అనే గ్రామంలో నడిబజారులో 21న తేదీన పట్టపగలు రాజమాణిక్యం అనే అతనిని పరశురామన్ అనే అతను పొడిచి చంపేశాడట.

—ఫాలాక్షుడు

డాక్టర్ [illegible]

# అర్థంకాని శిశువ్యాధులు



## 2.

సిస్టిక్ ఫయిబ్రోసిస్ (Cystic -fibrosis) అంటే ఏమిటి?

ఎందరికో ఈ ప్రశ్నకి సమాధానం తెలియదు.

ఇది—ఈ జబ్బు—చిన్న పిల్లలకి పుట్టుకతోనే రావచ్చు. వచ్చినా జబ్బు ఉన్నట్లు తెలియకపోవచ్చు. చివరికి మలవిసర్జనద్వారా తెలుస్తుంది. బిడ్డ ఎంతతిన్నా వళ్ళు చెయ్యదు, ఆకలి ఉంటుంది కాని తిన్నది అరగదు.

ఊపిరితిత్తులు చెడిపోవచ్చు. వ్యాధి గుణాలు ఈ విధంగానే తెలుస్తాయి. ముక్కు, గొంతుక, ఊపిరితిత్తుల కఫజలాలతోఇబ్బంది పడవచ్చు. అప్పుడే సిస్టిక్ ఫయిబ్రోసిస్ ఉందా అని పరీక్షించాలి.

ఒకతల్లి తన బిడ్డ చర్మం ఉప్పగా ఉందని ముద్దుపెట్టుకున్నప్పుడు తెలుసుకుంది. ఇదీ ఒక వ్యాధిలక్షణమే.

డాక్టరు సలహా వెంటనే పొందాలి. సిస్టిక్ ఫయిబ్రోసిస్ చెడ్డజబ్బు.

హెచ్. ఎల్. హెర్షెన్‌సోన్
(కాపీ రయిటు)



# సీరియల్ హృదయం చిగిర్చింది

కె. రామలక్ష్మి

**జరిగిన కథ**

రమ బావగారు ఆమెని కాలేజీ లేడీస్ హాస్టలులో చేర్చి వెళ్లిపోతాడు. వార్డెను సరళని పిలిచి రమని పరిచయం చేస్తుంది. సరళ చలాకీపిల్ల. రమతో బాగా స్నేహం ఏర్పరచుకుంటుంది. కొత్తగా వచ్చిన లెక్చరరు రామారావు రమపై మోజు చూపిస్తూ వుంటాడు. రమా, సరళా ఇద్దరూ ఆ విషయాన్ని గ్రహిస్తారు. రమతో రామారావును కలిపి కాలేజీ పిల్లలు అల్లరి చేయడం మొదలెడతారు. రామారావు సరళని రమ దగ్గరికి రాయబారం పంపుతాడు. తల్లికి సుస్తీ చేసిందని విన్న రమ చూసిరావడానికి వెళ్తుంది. బావతో రామారావు సంగతి చెప్పి అతన్ని ఒప్పిస్తుంది. తనకు భర్త పోయిన విషయాన్ని ఒక పాప వున్న విషయాన్ని సరళకి రాస్తుంది.

## 5

[illegible] తలకి చేయి ఆన్చుకుని కుర్చీలో కూర్చుని ఉన్న మేష్టారిని చూసి గుర్తు పట్టలేక పోయింది.

'మేష్టారూ, ఏమిటిలా ఉన్నారు?' ఆతృతంగా అడిగింది

'సరళా ఈరోజు సాయంత్రం రమా వాళ్ల ఊరు వెడదాం వస్తావా?' అడిగాడు రామారావు

'మీ రేమిటిలా అయిపోయారు?' అంది.

మాసిన గెడ్డం లోతుకుపోయిన కళ్లు రామారావు పది లంఖణాలు చేసిన మనిషిలా ఉన్నాడు.

'ఇంక బాగానే ఉంటాను సరళా, వస్తావా?' ప్రాధేయపడుతూ అడిగాడు రామారావు.

'రేపు నాకు ప్రాక్టికల్ ఉంది మేష్టారూ అది అయిపోగానే వెడదాం' అంది సరళ

'సరే మరిచిపోవుకదూ, రేపు సాయంత్రం బస్సుకి సిద్ధంగా ఉండు' అంటూ సమాధానంకోసం ఎదురు చూడకుండా వెళ్లిపోయాడు రామారావు.

మరునాటి సాయంత్రం బస్సులో సరళ కూడా బయలుదేరింది. బస్సు ఊరు చేరేసరికి మునిమాపువేళ అయింది. మసక చీకటిలో అన్ని వస్తువులూ దుమ్ము మేఘంలోంచి చూస్తున్నట్టున్నాయి

రమావాళ్ల ఇల్లు చేరేసరికి అతనికంట పడ్డ దృశ్యం రామారావుని కదల్చివేసింది. మోకాళ్లమీద తల ఆన్చుకుని అరుగుమీద కూర్చుని ఉంది రమ. చుట్టూ అలముకొంటూన్న చీకటులు. ఆ కూర్చోడమే రమ మానసికస్థితిని చెప్పక చెప్తూంది. అలాగే తన చేతుల్లోకి తీసుకుని ఓదార్చాలనిపించింది రామారావుకి.

'రమా' అంటూ ఆప్యాయంగా పిలిచాడు

'మేష్టారూ' అంటూ ఉన్నదున్నట్టు లేచి నిలబడింది రమ

ఆ క్షణంలో వారిద్దరి మధ్య అడ్డు తెరలు తొలగిపోయాయి. ఇద్దరి హృదయాలూ తేలిక అయాయి.

'రమా' అంటూ ఆమె చేతులు రెండూ తన చేతులలోకి తీసుకున్నాడు రామారావు

అప్పుడే తొలి నక్షత్రం ఆకాశంలో వెల్గింది.

గాలికి మేఘాలు కదిలిపోయి సూర్యుడు బయటపడ్డట్టయింది రమకి. మనసువిప్పి కొన్నిసంగతులు చెప్పాలన్నా చెప్పడం కష్టం. అందులోనూ చేజేతులా విచ్చుతూన్న పువ్వుని తుంపేసినట్టు అవుతుందేమో అన్నభయం చెప్పాలన్న ఆత్రాన్నికూడా వెనక్కినెట్టడంతో యా దాగని సత్యం ఎన్నాళ్లు దాచగలను? అన్న బెంగ మనస్సుని పీడించడంతో రోజుకి రోజు కృంగిపోసాగింది రమ. అలాంటివి అన్ని విషయాలూ తెలుసుకుని తనలో తాను తర్కించుకుని ఓ నిర్ణయం చేసుకుని రామారావు తనకోసం వచ్చేసరికి ఉత్సాహంతో ఉక్కిరి బిక్కిరయింది రమ.

'మేష్టారూ నన్ను క్షమించండి' అంది.

ఆయన చేతులలో ఉన్న తన చేతులని విడిపించుకోకుండానే

'నన్ను నువ్వే క్షమించాలి రమా, నేనే తొందరపాటు మనిషిని. నేను ఆలోచించను. ఎదుటివారికి ఆలోచించుకునే వ్యవధి నీయను. అవునా?' అన్నాడు రామారావు

'లేదు మేష్టారూ, మీరేం తప్పుచేశారని క్షమించాలి? నేనే మూర్ఖురాలిని' అంది రమ

ఇద్దరినీ అరుగుమీదవదిలి సరళ లోపలికి వెళ్లిపోయింది

'రమా నువ్వులేకుంటే బ్రతకలేనని తెలుసుకునే ఈ నిర్ణయానికి రాగలిగాను' రమ చెదిరిన ముంగురులు సవరిస్తూ అన్నాడు రామారావు

ఏడ్చి ఏడ్చి ఉబ్బిన రమ కళ్లు అప్పుడే ఉదయించిన నక్షత్రాల్లాగా మెరుస్తున్నాయి. ఒకపక్క నుండి ఆనందంతో దుఃఖం పెల్లుబికి వస్తుంది. చేతుల్లో ముఖం కప్పుకుంది

అలాగే ఆమెని పొదవిపట్టుకున్నాడు రామారావు. ఓదార్పుగా ఏమైనా అనాలనుకున్నాడు. 'ఇప్పుడెందుకీ దుఃఖం?' అందామనుకున్నాడు. ఏమీ అనలేకపోయాడు. హృదయభారం తగ్గేలా ఏడుస్తూన్న రమని పొదవి గుండెలకి దగ్గిరగా పెట్టుకున్నాడు రామారావు.

అతని మనసు విశ్రాంతిగా ఉంది.

అతని హృదయం ఉత్సాహంతో నిండి ఉంది

జేబులోంచి జేబురుమాలు తీసి రమకి లందించాడు

రమ కళ్లు తుడుచుకుని తనకేసే కన్నార్పకచూస్తున్న మేష్టారికేసి చూసింది.

'ఒకళ్ల ఉద్దేశాలు ఒకళ్లకి తెలిసినప్పుడు హాయిగా తేలికగా ఉండక ఎందుకు ఏడ్చావు రమ' వంచిఉన్న రమ తలని గెడ్డంకింద వేలుపెట్టి పైకి ఎత్తుతూ అడిగాడు రామారావు

'నాకు మనస్సు తేలికగా ఉంది మేష్టారూ, మీరూ సరళా రావడం చూసి నా కళ్లని నేను నమ్మలేకపోయాను. నా సంగతి తెలుసుకుని యిక నా ముఖం చూడరేమో అనుకున్నాను మేష్టారూ,' లంది అమాయికంగా

'నే నంతటి పిరికివాణ్నే అయివుందును

రమా, కాని నా కోరిక బలం నా పిరికి తనాన్ని గెల్చింది. రెండురోజులు మతి పోయి తిరిగాను నిన్ను చూడకుండా నేను ఉండలేను రమా, నువ్వు లేని జీవితం నాకు బాగుండదనిపించింది సరళ నడిగి అందుకే వచ్చాను నన్ను కాదని తోసేయకు రమా,' ప్రేమ ఉట్టిపడుతున్న మేష్టారి కంఠస్వరం రమ శరీరంపై పులకలు రేపింది. ఎండవేళ నీళ్లలో మెరిసే చేప పిల్లలాగా రమ కళ్ళు మెరిశాయి అలా చూస్తూ ఊరుకుంది.

'చెప్ప రమా, కాదనవు కదూ, త్వరగా నా జీవితం పంచుకుంటూ నా హృదయంలో అధిష్టించినట్లె నా యింట కూడా ఉంటావు కదూ?' ఆవేశంగా రమని దగ్గిరకి లాక్కోబోయాడు రామారావు.

రమ వారించింది

'రండి లోపలికి వెడదాం' అంటూ కళ్ళు వత్తుకుంటూ లోపలికి దారి తీసింది పరిచయాలు అయాయి సరళ తన సహజ సౌశీల్యంతోనూ, కలుపుగోరు తనంతోనూ జానకితో బాతాకానీకి దిగింది

'నాకు చాలా సంతోషంగా ఉంది సుందరంగారూ, నాకూ దగ్గిర ఆత్మీయులెవరూ లేరు దరిదాపు జ్ఞానం వచ్చిన దగ్గిరనుంచీ వంటరిగా బ్రతికినవాణ్ణి' అన్నాడు రామారావు, సుందరం పక్కగా కూర్చుంటూ.

'మాదీ చాలా చిన్న కుటుంబం మేష్టారూ అందుకే మీ మధ్య ఆత్మీయత విడని బంధంగా పెనవేసుకుపోయి ఎవరు బాధపడ్డా అందరూ బాధపడతాం ఇప్పుడు నా మనస్సు కుదుటపడింది' అన్నాడు సుందరం.

రామారావుతో పునర్వివాహానికి రమ తల్లి కూడా ఏమంత అడ్డు చెప్పలేదు ఎదిగీఎదగని వయస్సులో పెళ్లిచేసి, దాని కర్మ ఇలా కాలితే చూస్తూ జీవితాంతం బాధపడేకంటె ఇది-కొత్త పద్ధతి అయినా మంచిదే అనుకున్నా రావిడ తను కన్ను మూస్తే వంటరిగా పిల్లని పెట్టుకుని ఏం పాట్లు పడుతుందోనన్న బెంగ తొలగడాని కిదొక దారిగా భావించిందా తల్లి హృదయం.

రమ హృదయం మటుకు కుదాటు పడింది.

ఊపిరందనంత వేగంగా పరుగెడుతున్న వ్యక్తికి హఠాత్తుగా ఆగి, విశ్రాంతి చిక్కినట్టనిపించింది.

దేనికో తపనపడిపోయే హృదయలతకి ఆలంబన చిక్కినట్లనిపించింది

భవిష్యత్తంతా కారు చీకటని భయపడి వర్తమానంలో బెంగపడిపోయే చెడ్డరోజులు గడిచిపోయాయి అనిపించింది.

తనకి జ్ఞాపకం ఉన్నంతలో ఆరోజు రాత్రి నిద్రపోయినంత హాయిగా ఎప్పుడూ పోలేదు.

ఆరోజురాత్రి నిద్రపోయేసరికి చాలా పొద్దుపోయింది

'చాలా సింపుల్‌గా రిజిస్ట్రారు ముందు వివాహంచేసుకుంటాం సుందరంగారూ, మీరూ అమ్మగారూ నా తరఫున ప్రిన్సిపాలుగారూ సంతకాలు పెడితే సరిపోతుంది. తరవాత రమ ఇంటినుండే వెళ్లి చదువుకుంటుంది' అన్నాడు రామారావు

'అదే మంచిపద్ధతి కానివ్వండి' అన్నాడు సుందరం.

మరునాటి ఉదయం అందరిదగ్గిరా సెలవు తీసుకుని వెళ్లాడు రామారావు సరళ కూడా వెళ్ళిపోయింది. రమ సెలవులకి ఆగివెళ్లాలని నిశ్చయించుకుంది

పాపకి బాగా స్వస్థత చిక్కింది ఇప్పుడు పాపని చూస్తే బెంగగాలేదు రమకి ఎంతో



ఉత్సాహంగా ఉంటూంది. 'నాది అంటూ కొత్త జీవితం ఏర్పడబోతూంది' అని తలచుకున్నప్పుడల్లా ధైర్యంగా ఉంటూంది.

పదిరోజులు సెలవలు. పుస్తకాల ధ్యాసే లేకుండా పాపతో గడిపింది రమ. రేపు కాలేజీలు తెరుస్తారనగా హాస్టలుకి ప్రయాణం కట్టింది. తల్లిలో వచ్చినమార్పు క్రమంగా గ్రహించింది రమ. తల్లిపట్ల సానుభూతితో అభిమానంతో ఆమెహృదయం నిండిపోయింది.

పాపకి కొత్త కొత్తరకాల గౌనులు కుట్టింది సెలవుల్లో. వాటితో దాన్ని చూస్తుంటే ఎంతో ఆనందంగా ఉంది.

'నిన్నింత హాయిగా ఎప్పుడూ చూడలేదు రమా' అంది కాఫీగ్లాసు అందిస్తూ జానకి.

అందుకున్న కాఫీగ్లాసు పక్కన పెట్టి జానకిని అమాంతం కౌగలించుకుంది రమ.

'నాకూ నిజంగా అలాగే ఉంది జానకీ. ఇన్నాళ్ళూ జీవితంలో అర్థంలేదనిపించేది. ఇప్పుడెంతో నిండుగా ఉందనిపిస్తుంది. పరీక్షపాసయి ఉద్యోగం చేసిచేసి వగ్గునై రాలిపోవాలేమో అన్న పిరికితనం పోయింది జానకీ. నాజీవితం మళ్లీ నవ్వింది' అంటూ మురిసింది రమ.

'రమా, మీ రిద్దరూ త్వరగా పెళ్లి చేసుకోండి. హాయిగా విడికాపురం పెట్టుకుని సంసారం సాగించండి అదే నా కోరిక. ఒక నిర్ణయం అంటూ చేసుకున్నాక అనవసరంగా ఆలస్యం చేయడం దేనికి?' అంది జానకి.

'లేదు జానకి, ఆలస్యం జరగదు. మేష్టారు ఆగరు. నన్ను గురించీ తన గురించీ ఆయనే ఆలోచిస్తారు. నాకేం బెంగలేదు జానకీ,'

'మంచిపనులన్నీ అనుకున్నంత త్వరగానూ ముగించాలి రమా, కాలం మనపక్క ఉన్నప్పుడు శుభకార్యాలను ఆలస్యం చెయ్యకూడదు. నీ పెళ్లికి నేనూ వస్తాను. ఏం పెట్టుతావో చూస్తాను' అంది వేళాకోళంగా.

'నువ్వూ సుందరం బావా లేకుండానా జానకీ,' అంది రమ.

'ఏదో చెప్పబోయి ఆగిపోయావేం' అడిగింది జానకి.

రమ.

'కాయి, ఏదోచెప్పాలని ఆలోచించావు. నే చెప్తేగాని వెళ్లను' అంటూ అక్కడే ఉన్న పెట్టెమీద కూలబడింది జానకి.

ఓ బొమ్మని కాలట్టుకు ఈడ్చుకుంటూ పాప వచ్చింది వారిమధ్యకి. అప్రయత్నంగానే ఇద్దరూ పాప వాక్కేసి చూశారు. ఒకరి నొకరు చూసుకున్నారు.

'నేనేం తప్పుపని చేయడం లేదుకదూ జానకీ?' భయం భయంగా అడిగింది రమ.

'నిన్నంత ప్రేమించిన వ్యక్తి నీ పాపను ఎలా వేరుగా చూస్తాడు రమా, నీపిచ్చిగాని?' ధైర్యంగా అంది జానకి. దీర్ఘంగా నిట్టూర్చింది రమ.

కావలసిన ఊరగాయలూ అవి సర్దుకుని బస్సుకి బయలుదేరింది రమ. తల్లితో ఏమీ ఎక్కువ మాట్లాడకపోయినా తనతో పూర్తిగా ఏకీభవిస్తుందని గ్రహించిన రమకి ఎంతో ధైర్యంగా ఉంది.

'జానకి చెప్పినట్టు త్వరలోనే డేట్ నిర్ణయించుకోండి రమా,' అన్నాడు సుందరం, రమ పక్క ఖాళీగా ఉన్న సీటులో కూర్చుంటూ.

'అలాగే బావా,...' అంది రమ.

బస్సు కదిలే సమయానికి సుందరం దిగిపోయాడు.

బస్సులో తన సీటులో ఒదిగికూర్చుంది రమ.

ఊహలు రెక్కలు కట్టుకుని స్వేచ్ఛగా విహారం సాగించాయి.

భవిష్యత్తుని గురించిన కలలతో కల్పనలతో కాలగమనాన్ని కూడా గమనించకుండా బస్సులో తన సీటులో ఒదిగి కూర్చుంది రమ.

బస్సు దిగేసమయం వచ్చేసరికి ఆశ్చర్యపడి దిగింది.

రిక్షా కట్టుకుని తిన్నగా హాస్టలుకి వెళ్లిపోయింది. రాత్రంతా సరళతో ఉత్సాహంగా కబుర్లు చెప్పింది.

'తెల్లారితే కాలేజీ పడుకో' అని లైటు ఆర్పింది సరళ.

అప్పటిదాకా మాట్లాడింది రమ.

* * *

కాలేజి యథాతథంగా సాగిపోతూంది. వ్యక్తులలోని ఉత్సాహ నిరుత్సాహాలు ఎంత

తొడుక్కున్నా వాటి పనిలో ప్రతిబింబించక తప్పదు. ఇప్పుడు రామారావు క్లాసులు అమితోత్సాహంగా ఉంటున్నాయి. ఛలోక్తులతో, పిట్టకథలతో నవ్విస్తూ అతను పాఠం చెప్తుంటే విద్యార్థులాయనలో ఓ కొత్తదనాన్ని కనిపెట్టకపోలేదు. ఆ నోటా ఆనోటా వారూ మేష్టారి పెళ్లి సంగతి విన్నారు. అందుకే అంతగా అల్లరి కూడా చెయ్యడంలేదు మేష్టారినీ, రమనీ చూసినప్పుడు ముసిముసినవ్వులు నవ్వుకుంటూ వెళ్లిపోతున్నారు

ఈ సంగతి విన్న హాస్టలు వార్డెను కూడా చాలా సంతోషించింది పెద్దావిడ సంఘసంస్కరణాభిలాష కలావిడ అవిడకిది చాలానచ్చింది సాయంత్రం పూట రామారావు వచ్చినా రమని ఆతనితో ఓగంట అటూ ఇటూ తిరిగి రావడానికి పర్మిషన్ యిస్తూంది

కాలం సంతోషంగా గడుస్తున్నప్పుడు త్వరత్వరగా జరిగిపోతుంది. మనుష్యులు మానసికవ్యథలతో, బాధలతో మగ్గుతున్నప్పుడు తమాషా చూస్తూ నెమ్మదిగా సాగుతుంది కబోలు

ఒకరోజు సాయంత్రం రమని బయటికి తీసుకువెడదామని రామారావు వచ్చాడు ఇద్దరూ ఎంతోదూరం నడవకుండా బీచి ఒడ్డున తడి ఇసుకలో కాళ్లుపెట్టుకు కూర్చున్నారు విరిగిన కెరటాలు పరచిన నురుగ అందంగా లేసులల్లుతూ హరించిపోతుంది. చూస్తూన్న కొద్దీ కొత్త కొత్త రకాలుగా విరుస్తూంది వాటికేసే చూస్తూ కూర్చున్న రమని చూసి నవ్వుకున్నాడు రామారావు.

'ఏమిటి అంత తీక్షణంగా చూస్తున్నావు?'

రమచేయి తన చేతిలోకి తీసుకుంటూ ఆప్యాయంగా అడిగాడు

'ఆ కెరటాలు చూడండి మేష్టారూ ఎన్నిరకాలుగా విస్తరించి పరచుకుంటున్నాయో' అంది రమ

'రమా ప్రకృతిలో ఇంతటి సౌందర్యాన్ని గుర్తించకల్గుతున్నావు హృదయం నిండా ఆదరణ నింపుకొన్నావు నా ప్రేమని ఎందుకు గుర్తించలేకపోయావు?'

వేళాకోళంగా అడిగాడు రామారావు.

రమ అతని ముఖంలోకి చూసి కళ్లు దించుకుంది.

ఆ కళ్ల అంచుల ముత్యాలలాగా పేరుకున్నాయి కన్నీరు.

'రమా, ఉట్టినే హాస్యంచేస్తే అలా అయిపోతావేం? ఇంకెప్పుడూ అనను లే' నొచ్చుకున్నాడు రామారావు.

'మనం ఈటర్మ్ అవగానే పెళ్లిచేసుకుందాం. హాయిగా నాదగ్గిరే ఉండిపోదువుగాని ' ఉత్సాహంగా అన్నాడు

'నేనూ అదే అనుకుంటున్నాను అప్పుడిక చదువుకోమని నన్ను బలవంతం చేయనని మాటివ్వండి మేష్టారూ' అమాయకంగా చేయి జాపింది రమ. ఆ చేతిని ఆప్యాయంగా పట్టుకుని మొనతేలిన ఆవేళ్లనీ అర్ధచంద్రుడిలాగా ఉన్న తెల్లటి నవ్వని గోళ్లనీచూస్తూ ఊరుకున్నాడు రామారావు.

'రమా నన్ను పెళ్లిచేసుకునే ముందు నన్నుగురించి తెలుసుకోవాలనిలేదా?' కుతూహలంగా అడిగాడు.

'మీరు తెలిశారుకదా మేష్టారూ, ఇంకా ఏం తెలుసుకోవాలి?' నెమ్మదిగా అడిగింది

'నా వంశంలో పిచ్చివాళ్లుండచ్చు, హంతకు లుండొచ్చు ఏమో ఏ భయంకర సంఘటన ఉంటాయో, తెలుసుకోవాలని లేదా?' నవ్వుతూ అడిగాడు

'అయితే చెప్పవలసిందే, సరళ కూడా ఉంటే బాగుండేది' అంది రమ

'నా జీవిత రహస్యాలతో సంబంధం నీ కొక్కర్తెకే హక్కు భుక్తం రమా, నీకే చెప్తాను' రమ చేయి తన చేతితో నిమురుతూ, ఆనలో తమాషాగా అన్నాడు రామారావు.

'నే చిన్నప్పటినుంచీ తల్లిచాటున పెరిగినవాణ్ని. అమ్మే చదివించిపెంచింది అంతే కాదు చుట్టుపక్కల ఏ మొగదిక్కూ లేక పోయినా ధైర్యంగా నిలబడి నన్ను పెద్దవాణ్ని చేసింది చదువు సంధ్యలు చెప్పించి నేను ఉద్యోగంలో జేరడానికి కొంచెంముందే కనుమూసింది ' నిట్టూర్చాడు రామారావు.

'అయితే మీరు ఊరుకి వెళ్లారన్నా రొకసారి అప్ప డెక్కడికి వెళ్లారు?' కుతూహలంగా అడిగింది రమ.

'అమ్మ దొంగా, నా రాకపోకలు అంత జాగ్రత్తగా గమనించేదానివా' తన చేతిలోని రమ చేయి గట్టిగా నొక్కాడు రామారావు

'లేదు మేష్టారూ, ఓసారి నాలుగు రోజులు వరసగా మీరు రాకపోతేనూ...' నసిగింది రమ.

'నాకు ఊళ్లో కొంచెం భూమి పుట్రా ఉంది డబ్బు కావలసినప్పుడు వెళ్లి తెచ్చుకుంటూ ఉంటాను అలాగే అప్పుడు వెళ్లాను నాకీ ఉద్యోగం ఒక్కటే బ్రతుకుతెరువు కాదు రమా, కూచుని జాగ్రత్తగా తినడానికి సరిపోయే సంపద ఉంది' చీకటి పడేముందు సముద్రం చాలా అందంగా ఉంటుంది ఆందోళనగా ఉంటుంది దేనికోసమో తహతహ లాడుతున్నట్లు కెరటాలు వేగం వేగంగా వచ్చి పడుతున్నాయి అనిపిస్తుంది రామారావు



## హృదయం చిగిర్చింది

మాటలు వింటూ సముద్రంకేసే చూస్తూ కూర్చుంది రమ ఆమె చేయిమటుకు రామారావు వదలలేదు ఆ చేతికే చెప్తున్నట్టు, సన్నని వేళ్లని గోళ్లనీ నిమురుతూ చెప్తున్నాడు రామారావు.

'పోనీ మనం పెళ్లి చేసుకుని హాయిగా పోయి పల్లెలో ఉండిపోదామా రమా?' ఉన్నట్టుండి అడిగాడు ఓ క్షణం ఆలోచనలో పడింది రమ.

'అయినా ఈ ఆధునిక జీవితవేగానికి అలవాటు పడిపోయిన మనం పల్లెలో హాయిగా ఉండలేమేమో కదూ?' అతనే మళ్లీ అడిగాడు.

'కొంతకాలం చూసి తరవాత కదా విశ్రాంతిగా ఉండాలి?' అంది రమ

'నిజమేలే సంఘంనుంచి దూరంగాపోయి ఉండడం కష్టం. నే యిప్పుడుంటున్న యిల్లు మనకి దివ్యంగా సరిపోతుంది రమా, వచ్చిచూస్తావా?' ఏమంటుందో వినాలని ఆమె కళ్లలోకిచూస్తూ అడిగాడు రామారావు ఏకాంతంగా ఓక్షణం తనకి సన్నిహితంగా రమ ఉండే అవకాశంకోసం ఎదురుచూస్తున్న అతని హృదయం ఆమె సమాధానంకోసం ఎదురుచూసింది.

'చెప్పరమా,' ఆప్యాయంగా అడిగాడు

'ఎవరైనాచూస్తే అపార్థాలు తీస్తారు మేస్టారూ, నేను మీ భార్యగానే మీ ఇంట్లోకి వస్తాను నన్ను మన్నించండి' చాలా నెమ్మదిగా అంది రమ

'దీనిలో మన్నించడానికేం ఉంది? పోనీ ఈ శనాదివారాలలో కొంచెం బజారువని చూసుకుందామా?' అడిగాడు

'అలాగే..' అంది రమ. 'బాగా చీకటి పడింది లేద్దామా?' అడిగింది

రామారావు లేచినిలబడి రమకి చెయ్యి అందించాడు కొంచెం బిడియపడుతూనే చాచిన అతనిచేతిని అందుకుని నిలబడింది రమ

బీచిలో ఎంత జనం ఉన్నా ఏకాంతం లభిస్తుంది. సముద్రపుహోరులో మనం మాట్లాడుకునే అన్నిమాటలూ ఒకరి చెవిలో ఒకరు చెప్పుకున్నట్టు ఉంటాయి. బీచిలో చీకటికూడా తమాషాగానే ప్రకాశిస్తుంది. నెమ్మదిగా నాలుగుమూలలా చీకటి అంటుకున్నట్టు - కాకుండా ఒక్కసారి వచ్చి వాలినట్టు ఉంటుంది ఓక్షణం ఉన్న వెల్గు మరుక్షణంలో మాయమైపోతుంది అంతే. నక్షత్రాలు మిలమిలమెరుస్తూ కనబడతాయి మెర్క్యురీ దీపాలూ, వాటిచుట్టూ పురుగులూ ప్రస్ఫుటంగా కళ్లపడతాయి. బీచిగాలి కనివచ్చిన జనసందోహం యిళ్లదారి పడతారు ప్రేమికులూ, ప్రియులూ, ఆ చీకటి వెలుగులలో ఇంకోక్షణం కాలక్షేపం చేయాలి అని తపన పడతారు

టర్మ్ మధ్యలో నాలుగురోజులు సెలవు వచ్చింది ఆ సెలవుల్లో వచ్చింది రమ పెళ్లిరోజు. సుందరం బావా, జానక్కీ, రమ తల్లీ వచ్చారు. అంతా రామారావు ఇంట్లోనే దిగారు. రమ మటుకు హాస్టలులోనే ఉంది. రామారావు భార్యగానే అతని ఇంట్లో అడుగుపెట్టాలని— రమ కోరిక.

రామారావు ఇద్దరుముగ్గురు స్నేహితులని పిలిచాడు ప్రిన్సిపాలుగారిని పిలిచాడు రమ వార్డెనుగారిని పిలిచింది సరళతో కూడా రిజిస్ట్రారు వస్తాడన్న టైముకి కొంచెం ముందే రామారావు ఇంట్లో అడుగుపెట్టింది ఆక్షణంలో రమ శుద్ధం పిరికిదైంది ఏమో, జీవితం ఇకమీదట ఎలా సాగుతుందో అనిపించిందామెకి

అంతా హాలులో కూర్చున్నారు పాప అమ్మమ్మ ఒళ్లో కూర్చుని తనలోతను మాట్లాడుకుంటూ వేళ్లు లెక్క పెట్టుకుంటూ ఆడుకుంటూంది

రిజిస్ట్రారుగారు వచ్చారు వారితో పాటే గుమాస్తాకూడా వచ్చాడు గుమస్తాకి అది పెళ్లిఅయినా దస్తావేజా రాయించినట్టే. 'ఇక్కడిలా రాయండి' 'ఇక్కడ ఇలా రాయండి', 'ఇక్కడ, ఇక్కడా సంతకం పెట్టండి' అంటూ అక్షరజ్ఞానంలేని వాడిమీద అజమాయిషీ చేసినట్టు రామారావు చేత ఏవో ఫారాలు పూర్తిచేయించాడు

'నేనిమెని నా భార్యగా స్వీకరిస్తాను' అని మూడుసార్లు రామారావుచేతా, 'నేనియనని భర్తగా స్వీకరిస్తాను' అని రమచేతా అనిపించి కాగితంమీద సంతకం పెట్టించాడు రిజిస్ట్రారు. తరువాత పాట్లు సంతకాలు చేశారు రామారావు

తరవున ప్రిన్సిపాలుగారూ మరిద్దరూ పెట్టారు రమ తరఫున సుందరం బావా, వార్డెన్నూ, తల్లీ పెట్టారు దానితో పెళ్లి తతంగం ముగిసింది ఇంటికివచ్చిన అతిథు లకి కాఫీ ఫలహారాలు అందించి అతిథి సత్కారం చేశాడు రామారావు కబుర్ల మధ్య నవ్వులమధ్య అంతా వెళ్లిపోయారు.

ఓవారం రోజులపాటు సెలవుపెట్టి ఇంట్లోనే కాలక్షేపం చేశారు ఇద్దరూ సుందరం పాపనీ, అమ్మనీ, జానకినీ తీసుకుని వెళ్లిపోయాడు రామారావు రెండురోజులు ఉండమనీ కోరలేదు !

బంగారు రెక్కలు పరచుకుని కాలపక్షి పరుగులు తీసింది

గొంగళిపురుగు గూడు విచ్చుకుని సీతా కోక చిలుకలాగా పైకివచ్చినట్లు రమ కొత్త మనిషిగా తయారైంది.

వారం, అందులోనూ అంత మధురాతి మధురమైన కాలం ఎంత త్వరగావేనా గడిచిపోతుంది

రామారావు తిరిగి కాలేజీకి వెళ్ళడం ప్రారంభించాడు

రమ మటుకు చదువుకి స్వస్తి చెప్పే సింది

'నాకు కాలేజీకి వెళ్లాలని లేదు. నన్ను బలవంతంపెట్టద్దు' అని రామారావుకి మెత్తగా చెప్పింది.

'చదివేది పూర్తిచేసేస్తే బాగుంటుం దనేగాని వేరు ఉద్దేశ్యంతో కాదు రమా' అంటూ చెప్పి చూశాడు రామారావు. కాని లాభం లేకపోయింది.

'నాకు ఇల్లు సద్దుతూ, 'అన్నీ అమర్చుతూ ఉంటే కాలం గడిచి పోతుంది. నా పనికి అసలు ఇరవై నాలుగ్గంటలే సరిపోవు ఇక చదువు కూడా ఎక్కడ ఇరికించను ?' అని వేళాకోళంగా సాధించింది రమ.

* * *

రమలో వచ్చిన మార్పు అందరినీ కంతృప్తిపరచింది విచ్చిన పూవులాగా కల సల్లాడుతూ తయారైంది రమ మనిషికి తృప్తినిచ్చే అందం, హుందాతనం వేరేమీ ఇవ్వలేవు కాబోలు మనస్సులో శాంతి ఏర్పడితే అది జీవితంలో పైకే కన్పి స్తుంది

రామారావు కాలేజీనుంచి వచ్చేదాకా ఆ పుస్తకం యీ పుస్తకం చూస్తుంది. రాగానే ఇద్దరూ భోజనాలు ముగిస్తారు తిరిగి రామారావు కాలేజీకి వెళ్లిపోగానే చదవడమో, ఏదో కుట్టడమో చేస్తూ కాలక్షేపంచేస్తుంది రమ

అటువంటి తీరిక సమయాలలోనే రమ ఆలోచనలు పాపమీదికి మళ్ళుతాయి. ఎన్నోసార్లు అనుకుంది రామారావుతో చెప్పి పాపని ఇక్కడికే తెచ్చేసుకోవాలని కాని ఎలా చెప్పాలో తెలియక సతమతమవుతూ కాలం వెళ్లబుచ్చుతూంది.

ఇల్లంతా శోభాయమానంగా అలంక రించింది రమ.

గుమ్మాలకి కిటికీలకి చక్కని తెరలు వేసింది గోడలకి అక్కడా అక్కడా అంద మైన బొమ్మలు అమర్చింది వంటయిల్లు తనకి కావలసిన పద్ధతిలో అమర్చుకుంది. సులభంగా త్వరగా వంటచేయడానికి అను వుగా అన్నీ సర్దింది.

కూనిరాగాలు తీస్తూ సాయంత్రం పూట వంటచేసే రమను చూడడానికని రామారావు షికార్లు మానేశాడు ఏదో పుస్తకమో పేపరో చేతిలో పెట్టుకుని హాలులో కూర్చుంటాడు క్షణానికోసారి 'రమా మాట' అంటూ కేకేస్తూ ఉంటాడు 'సరిగా పోపు మాడిపోయే అదను చూసి పిలుస్తారే !' అని నవ్వుతూ వచ్చి నిలబడే రమని చూస్తే అతని గుండెలు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవు తాయి. బహుశా అది చూడ్డంకోసమే కాబోలు అన్నిసార్లు పిలుస్తూ ఉంటాడు !

'మీకు పనిలేదు. నన్ను చేయనీరు' అంటూ ఓ చేతిలో గరిటతో వచ్చి నిల బడిన రమని చూస్తూ.

'ఈసారి విశేషం ఉండే పిలిచామోయ్' అన్నాడు రామారావు

'అయితే ఉండండి స్టౌమీద నీళ్ళుపడేసి వస్తాను' అంటూ లోపలికి పరుగెత్తింది రమ.

అందంగా కదలిన ఆ విగ్రహాన్ని చూస్తూ తనూ లేచి వంటింట్లోకి దారి తీశాడు రామారావు

కెటిల్ స్టౌమీద పడేసి వెనుదిరిగిన రమ తిన్నగా రామారావు చేతుల్లో ఇమిడి పోయింది.

'నేనే వస్తున్నానుగా,' అంటూ తల వంచింది.

'రమా...' అంటూ చిరుచెమటలతో తడిసిన రమ ముంగురులు పైకి తోశాడు రామారావు అతని కంఠస్వరం ఆవేశంతో బొంగురు పోయింది. వేడిగా ఉన్న పెదవు లని రమ చెంపకి తాకించాడు.

రమ అతని కౌగిలిలోనే కదిలింది.

(ఇంకావుంది)






'నీకేంకావాలో అర్థంచేసుకోడం ఆ బ్రహ్మతరంకూడా కాదని తెలిసీ అడుగుతున్నాను—ఈ ఆడవాళ్ల కేంకావాలి? తృప్తిగా హాయిగా వీళ్ళుండాలంటే మేమేం చెయ్యాలి?' మహాప్రభో! అని అనలేదు కాని, దరిదాపు అంత దారుణంగానూ నిలవేశాడీ మధ్య ఓ స్నేహితుడు. 'నువ్వు ఇక యీ జన్మకి అర్థంకావులే' అని భర్తలు అడపాతడపా అనడం పరిపాటేగాని, కాని ఈ స్నేహితులంవారు—ఏం కావాలీమెకని ఆలోచించి, అన్నీ సమకూర్చ చూసి, విఫలీకృతుడై వాపోతున్న పెద్దమనిషి? అయ్యో పాపం అనక తప్పనికేసు!

నా భార్య అందంగా ఉంటుంది; పదేళ్లయి పెళ్లయినా, ముగ్గురు పిల్లలుపుట్టినా నా కళ్లకి అందంగానే ఉంటుంది (ఎంతమంది భర్తలుంటారిలా అనేవాళ్ళు?) ఎంతో కష్టపడి పనిచేసుకుంటుంది ఇల్లూ పిల్లలూ కూడా శుభ్రంగా ఉంటారు అప్పుడప్పుడు సినిమాలకీ షికార్లకీ తీసుకు వెడుతూనే ఉంటాను (థ్యాంక్యూ!) అయితే నేంగాక—ఎప్పుడూ బాధపడుతూ ఉంటుంది జీవితంలో ఏదో లోటైపోయినట్టు...... తనూ యింట్లో సామాను ఒకటై అయినట్టు—'ఏంచేస్తేనేంగాక, ఎవరుచూస్తారు? నేనూ ఉన్నాను ఆ కుర్చీ ఉంది. అంటె నాకేంచేయాలో తోచదు. ఎంతో బాధగా ఉంటుంది. ఏం చెయ్యగలము? ఏంచేసే పరిస్థితికిది అతీతం కదా? ఎందు కిలా ఉంటుందావిడ!' అంటూ వాపోయే మగవాళ్లే చాలా అరుదు. అసలలాఉన్నా పట్టించుకోకుండా పోయే మగవాళ్లని ఎలాగా ఏం చెయ్యలేం! మరిలా గుర్తించే వారినీ ఎందుకు హింసపెడతారీ ఆడవాళ్లు అన్నదే సమస్య.

అది ఆడవాళ్ల తత్వం అనుకోవాలి. ప్రపంచంలో ఎక్కడా ఏ ఆడదీ ఉండదు—ఎప్పుడేనా యిలా బీదార్పులు అరవనిది!... నెలలో ప్రత్యేకించి కొన్ని సమయాలలోనో లేకుంటె ఆ రోజే బజాజులు దులిపి కొత్త కర్టెనులు వేలాడవేసినప్పుడు ఎవరూ గుర్తించకపోతేనూ — యిలాంటి జీవంలేని పెదార్థన్నన్న భావం ఆడవాళ్లకి కలుగుతూ ఉంటుంది!




మగవాళ్లకి చుట్టూ ప్రపంచం ఉంటుంది. వాళ్ల వృత్తిలో ఘనత, వారి స్నేహితుల మధ్య హోదా, వారు సాధించిన ఘన విజయాలు—వారి జీవిత దృక్పథానికి వెన్నెముకగా నిలబడతాయి. కాని ఆడవారికలా కాదు. తాము ప్రేమించిన వారిమీదే సర్వం ఆధారపడిఉంటుంది. తను చేసినపని తను సాధించిన పొదుపు, తను కొన్నచీర, తన పిల్లల ముద్దు ముచ్చట్లు, తన తెలివితేటల ఫలితాలూ—అన్నీ వృథా అనుకుంటుంది—ఆయినవారు గుర్తించి మెచ్చకపోతే — ఈ దృక్పథభేదంవల్లనే — ఆడవాళ్లు అప్పుడప్పు డీలా డీలా పడిపోయి—మెప్పుకోసం, మేర్పాసికోసం అలమటించిపోతారు. అలా అని పైకి చెప్పలేక—తమని తాము సాధించుకుంటారు, కించపరుచుకుంటారు—'ఆ నేనూ ఉన్నాను—ఆ మాసిన బట్టల మూటా ఉంది' అని నిట్టూరుస్తారు! ఈ ఆడవారితత్వం సూక్ష్మంలో పురుషులు ముఖ్యంగా—అయ్యోపాపం అని బాధపడే పై స్నేహితునిలాంటి పురుషులు గుర్తించ కల్గితే — తనభార్యకి నమ్మకం కల్గించేలాంటి అనునయ వాక్యాల అవసరం ఏమిటో గ్రహించ కల్గుతారు. 'నువ్వు లేకుంటే ఎలాగ?' అనండి — కొండంత శక్తి వస్తుంది ఇల్లాలికి. ఇంట్లో యిల్లాలి ఉనికికి విలువ కట్టడం కష్టం. అది అందరికీ తెలుసు. కాని పైకి అంటే ఏదో అందలం ఎక్కించినంత ఆనందపడే అల్పసంతోషి ఆడది. అడిగి మెప్పు తెప్పించుకోవలసిన గతిలో గృహిణిఉంటె — ఆ మెప్పుకూడా ఓ రకం సాధింపే అవుతుంది. అందుకే అడపాతడపా భర్త ఇచ్చే ప్రోత్సాహం, అనునయ వాక్యాల హామీలు రక్షరేకుల్లాగా పనిచేసి భార్యని కూనిరాగాలు తీస్తూ పనిపాటులు సాగించే మూడ్‌లో ఉంచుతాయి. అంతేకాని 'నీకేంకావాలి? అందంగానే ఉన్నావంటున్నానుగా' అని కసురుకుంటె ప్రయోజనం ఏమిటి? ●




సాయంత్రం ఆరుగంటలప్పుడు గుంటూరులో రైలు దిగాడు సీతాపతి. తన పాతికేళ్ల జీవితంలో—అంతకుముందు ఒక్కసారి చూచిన ఆ ఊళ్లో—కొత్తదనం ఫీలవుతూ స్టేషన్ బయటకు నడిచాడు.

పరిసరాలు — పేవుమెంట్లు, రోడ్లు, యిళ్లు—సర్వం—తనలో ఆవరించిన కొత్తదనంలా — రైలు పొగతో వెలువడిన బొగ్గు రేణువులతో కప్పబడి వికృతంగా వున్నయి.

అడుగులు ముందుకు వేశాడు—తనకు తెలియని రాజశేఖరంగారి చిరునామా కళ్ల ముందు కదలగా!

దగ్గరా?—దూరమా?

ఏమో?...ఎవర్నయినా అడగాలి!

ఊహూఁ...అయినా—దగ్గరయినా తను నడుస్తాడా?—నడవగూడదు!

హుందాగా వుండాలి!

అయితే గియితే— తమ వారికి కాబోయే అల్లుడు!

—పెదాలమీద నవ్వు సిగ్గుపడుతున్నట్లు తొంగి చూచింది.

ఆగి ఠీవిగా పక్కకు చూస్తూ, 'ఏయ్ రిక్షా!' అని పిలిచాడు. 'బ్రాడీపేట... నాలుగోలైను...చివరకు...' ఏమనుకున్నాడో ఏమో—రిక్షావాడి సమాధానం గూడా వినకుండనే ఎక్కికూర్చోబోయాడు.

బుజంమీద చేయిపడింది.

ఆశ్చర్యపోతూ వెనక్కు తిరిగాడు.

తెలిసిన మొఖంలాంటి మొఖం!

కాస్త కళ్లు చికిలించి చూచాడు—విచిత్రంగా మొఖం పెట్టాడు.

'గుర్తు పట్టలేదా సీతాపతీ!' అతడు నవ్వాడు—అతడి గొగ్గిపన్ను అతడిని గుర్తు చేసింది.

సీతాపతి హుషారుగా నవ్వాడు.

'చలపతి! నువ్వా!' అన్నాడు. 'ఈ ఊళ్లో వుంటున్నారా మీరు?'

'అవును!' ఏడెనిమిది సంవత్సరాలనాటి స్నేహం కళ్లముందు కదలగా అన్నాడు.

ఆ కొత్తవూళ్లో ఏదో తేలిక దనం ఫీలవ్వసాగాడు—చలపతిని చూడగానే!

'ఇదేనా రావటం? ... ఏమిటి పని?' ఆసక్తితో ప్రశ్నించాడు.

'ప్చ్!...ఏదో చిన్నపని!' మనిషిని సిగ్గు ఆవరించింది,జస్ట్...ఇంటర్‌వ్యూ! 'నువురు

విగరవేసి బిగ్గరగా నవ్వాడు.

చలపతి అర్థం చేసుకోని, ఫక్కున నవ్వి సీతాపతి బుజాన్నితట్టాడు 'అచ్ఛా!'

సీతాపతిని ఇంకా సిగ్గు వీడ లేదు.

రిక్షావాడు, 'ఎక్కండి బాబూ!' అంటు న్నాడు.

చలపతి అతడి మాట వింటూనే, 'అయితే నీవు ఇప్పుడు వాళ్లింటికే వెళు తున్నావా?' అడిగాడు.

'అవును !'

'వాళ్లు నీకు తెలుసా?'

'లేదు పరిచయం చేసుకోవాలి !'

'అయితే ఒక పనిచేయి . మా యింటికి వెళ్దాం పద...రేపుదయం అక్కడికి వెళ్ల వచ్చు !'

అది బాగానే వుంటుందని—'సరే ! పద .. రిక్షాలో వెళ్దామా ?' అన్నాడు.

'ఎందుకూ—నడిచివెళ్దాం.. దగ్గరే !'

చిన్ననాటి మిత్రులిద్దరూ నడక సాగించారు.

'ఒక్కడివే వచ్చావేం . అమ్మా నాన్నను తీసుకురాకపోయివావా ?'

'వాళ్లు వచ్చి చూసివెళ్లే .. హైద్రా బాదుకు నాకు ఉత్తరం వ్రాశారు !' నవ్వాడు సీతాపతి సిగ్గుతో.

కుడిచేతి వైపుకు తిరిగి—మురుకాల్వ పక్కగా వున్న నన్నటి సిమెంటుదారి మీదుగా, అడుక్కునే వాళ్లమీదగా అడు గులు వేసుకుంటూ ఓవర్ బ్రిడ్జి మెట్లెక్కారు ఇద్దరూ.

బ్రిడ్జి ఎక్కాంతరువాత—సీతాపతి వలు వైపులా దృష్టి సారించి, 'గుంటూరు చాలా మారిపోయింది !' అన్నాడు.

చలపతి నవ్వాడు.

చలపతి అలా నవ్వుతుంటే — సీతాపతి కళ్లముందు—చలపతి చెల్లెలు—అలాగే నవ్వే శారద—నిలబడింది.

శారద !

ఇప్పుడెలావున్నదో?

వివాహమయిందా?

ఏమో?

మనిషిలో ఆ కుటుంబంమీద— సీతాపతి మీద—తన చిన్ననాటి మిత్రురాలు శారద ద్వారా—ఉత్సుకత పెరిగింది !

శారద !...శారద !...

# మనసు

తనతో ఎల్లప్పుడూ తిరిగిన శారద ..

—మనిషి విలాసంగా నవ్వుకున్నాడు

'శారదకు వివాహమయిందా? శారద ఎక్కడ వున్నది?' — అడగబోయాడు గాని సిగ్గు ఆవరించింది.

'అయితే సీతాపతీ! నీవు ఇప్పుడేం చేస్తు న్నావ్ ?'

'బి యి. అయింది. హైద్రాబాద్‌లో ఓ ప్రైవేట్ ఫరంలో పని చేస్తున్నాను !' చిన్నగా నవ్వాడు

'నేను లా పూర్తిచేశాను .. ప్రస్తుతం జూనియర్‌గా వున్నాను !' చలపతీ నవ్వాడు

ఇద్దరూ బ్రిడ్జి దిగారు.

'కాఫీ త్రాగి వెళ్దామా ?

'నీ యిష్టం !'

ఇద్దరూ హోటల్‌నుండి బయటకువచ్చి తిరిగి నడక సాగించారు.

తిరిగి సీతాపతి మనస్సును— చిన్నప్పటి అందమైన శారద మొఖం—ఆవరించింది. మనిషిని గిలిగింతలు పెట్టింది !

ఇప్పుడెలా వుంటుంది ?

—మొట్టమొదటిసారిగా గడపలో కాలు పెడుతుండగా కనబడింది చలపతి తండ్రి గారు రెండు చేతులూ జోడించి, 'నమ స్కారమండీ !' అన్నాడు సీతాపతి.

ఆయన తొందరగా గుర్తు పట్టలేక పోయారు. జ్ఞాపకాలు తడుముకో సాగారు.

'నేను రామనాథంగా రబ్బాయిని.. సీతా పతినండీ !'

'ఓహోహో...నువ్వటోయ్...!'

*   *   *

కాళ్లు కడుక్కోవటానికి నీళ్లిస్తూ




శారదాంబగారు అడిగింది. 'అమ్మా, నాన్న, తమ్ముడూ, చెల్లెలూ బాగు న్నారా ?' అని.

శారద వచ్చి కాళ్లకు నీళ్లిస్తుందేమో నని ఆశపడ్డ సీతాపతి మొఖాన్ని కాస్తంత నిరాశ ఆవరించింది. కప్పిపుచ్చుకుంటూ, 'ఆఁ ..ఆఁ...' అన్నాడు.

చలపతి తువ్వాల అందించాడు తుడుచు కుంటూ కుర్చీలో కూర్చున్నాడు సీతాపతి.

ఇప్పుడు శారద కాఫీ తెస్తుందేమోననే ఆశమనస్సుకు ఊరట కలిగించింది.

కాని కాఫీ గూడా శారదాంబగారే స్వయాన తెచ్చియిచ్చింది.

కాఫీ త్రాగుతుంటే అనిపించింది—ఒక వేళ శారదకు వివాహమయి అత్తవారింటికి వెళ్లిందేమోనని !

ఏమో?—

కాని — ఇంతలోనే ఆ ఆలోచనలను వమ్ము చేస్తూ ఓ ఆకారం — ఊహల్లో మెదలు తున్న శారదలాంటి ఆకారం — ఆ పక్క గదిలో లీలగా మెదిలినట్లనిపించింది. ఓ పట్టుపావడ చివరి జరీ అంచు ఓ క్షణం అతడి కళ్లముందు తళుక్కున మెరిసి మాయమయింది !

అవును!

—శారద సిగ్గుతో తన ముందుకు రాలేకపోతుంది—అనుకున్నాడు !

ఆ ఆలోచనే అతడి మనస్సుకు తృప్తి నిచ్చింది.

చిన్నగా పెదాలమీద చిరునవ్వు మెరి సింది.

తరువాత ఓ అరగంటకు— 'అలా తిరి గొస్తాం'—అంటూ యిద్దరూ బయట పడ్డారు.

చలపతి ఎంత కలుపుగోలుతనంగా మాట్లాడుతున్నా—'శారద విషయం' అను కునే టప్పటికల్లా—మనస్సును తెలియని 'కొత్తదనం—భయం' ఆవరిస్తున్నయి !

—తనని ఏమైనా అపార్థం చేసు కుంటాడేమోననే భావన అతడి వరనరాన్ని ఆవరించింది.

చిన్నప్పటి సంగతి వేరు—

ఎంతో చనువుగా వుండేవాళ్లు ఊహ తెలిసీతెలియని చిన్న పిల్లలు గాబట్టి— కాని, ఈనాడు యుక్త వయస్సులో—

సీలో

అయినా.. ఊహూఁ... వివాహం అయి వుండకపోవచ్చు...

నిజంగా వివాహం అంటూ జరిగి వుండకపోతే—శారదను తప్ప మరెవర్నీ తను వివాహం చేసుకోడు!

ఇన్నాళ్ళా ఎలా మార్చిపోయి వుండగలిగాడు అంటే—అది వేరే విషయం!

ఒకవేళ వివాహమే అయివుంటే—

అదో వికారపుభావన — అతడు ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

అలాగే జరిగివుంటే — నిజంగా తనను మించిన దురదృష్టవంతుడు వుండడు!

—అలాంటి ఆలోచనలతో అతడు పతమతమయ్యాడేగాని, తన మనస్సులోని అనుమానాన్ని చలపతిద్వారా తీర్చుకోలేకపోయాడు!

మొట్టమొదటిసారిగా — తనలో ఏదో బలహీనత ఉన్నదన్నట్లుగా—ఆరోజే తెలుసుకోగలిగాడు!

ఆ రాత్రి భోజనాలయినతరువాత ఆరుబయట వెన్నెల్లో వేసివున్న పక్కలమీదకు జేరుకొన్నారిద్దరూ.

దూరంగా శారదాంబగారు తలుపు ప్రక్కగా కూర్చున్నారు.

చలపతి తండ్రి భోజనంచేసి బయటకు వెళ్ళాడు — ఎవరింటికో!

# మనస్సు

చిట్టచివరకు ఎలాగయితేనేం మనస్సును కూడదీసుకొని మనస్సులోని అసలు విషయం బయటపెట్టాడు.

—అందునా, ఒకటి రెండుసార్లు, వాళ్ళు భోజనం చేస్తున్న సమయంలో — ఏదో నీడ — శారదదే అనిపించేలా అటూ యిటు కదిలింది!

అయినా, అంతా లోపల వుండగా—ఇంత శుభ్రంగా ఆరుబయట పక్కలు ఎవరు వేయగలుగుతారు? — అందమైన శారదకు మించి!

అనవసరంగా ఒక్కసారి పెద్దగా నవ్వి, 'అయితే చలపతీ! మీ చెల్లెలు ఎక్కడా కనబడటంలేదు—పెళ్లిచేసి అత్తవారింటికి గాని పంపేశావేవిటి?' అన్నాడు — అలా జరగకుండా వుండివుండాలని వేయిదేవుళ్ళకు మనస్సులోనే మొక్కుకుంటూ!

ఆలా అన్నతరువాత ఒక్కసారిగా నెత్తిన మోస్తున్న బరువు నైతొలగిపోయినట్లనిపించింది. శరీరమంతా తేలికయి హాయిగా ఉన్నట్లనిపించింది. మనిషి గాలిలో తేలిపోతూ ఏదో ఆహ్లాదాన్ని పొందసాగాడు— ఎంతో హాయిగా వుందనిపించింది—ఒక్క క్షణం!

ఆత్రంగా తలెత్తి చలపతి మొఖంలోకి చూశాడు — మరుక్షణంలోనే!

పక్కకు తిప్పుకొనివున్న అతడి మొఖం మీద క్రీనీడ పడుతుంది.

'చాలా చిలిపిగా వుండేది చిన్నప్పుడు— ఇంకా ఇప్పుడూ గోల చేస్తూనేవున్నదా?' మరోసారి తెచ్చిపెట్టుకున్న నవ్వుతో పరిపరాలు వింపాడు.

పక్కన తలుపు కొద్దిగా కదిలిన చప్పుడయింది.

చలపతి పెదాలు కదిలి ఏదో మాటలు వెలువడేలోగానే, 'నేనూ చూచి చాలా రోజులయింది...' అన్నాడు. కళ్లను తను తెచ్చుకున్న ధైర్యానికి కాంతితో నింపుకుంటూ.

'అవును...' చలపతి గొంతు పెగల్చుకొని అన్నాడు. 'అలా అనుకోకుండా అయిపోయింది...టైంగూడా లేదు.. మీ కందరికీ తెలియబరుద్దామనుకున్నాంగాని లాభం లేకపోయింది...ఆ అబ్బాయి ఎక్కడికో ఏదో ట్రైనింగ్‌కు వెళ్ళాలని త్వరపడటంతో..'

సీతాపతికి భూమి జరిగిపోతున్నట్లనిపించింది.

బిక్కమొఖం వేసుకొని ఏదో తప్పు చేసినవాడిలా స్నేహితుడి మొఖంలోకి చూస్తూ వుండిపోయాడు.

'వివాహమయిందా?' ఆత్రంగా అడిగాడు.

'అయింది!' ఒక్కక్షణ మాగాడు. 'అయింది సీతాపతి!.. మేమంతా కలసి దాని మెడకు ఓ ఉరిత్రాడు బిగించాం... దాని విముక్తి లేదు!' చలపతి తల వాలికిపోయింది.

'ఏమైంది?' ముందుకు వంగాడు. త్వరత్వరగా 'ఏమైంది చలపతీ!' అన్నాడు.

'...ట్రైనింగ్‌కంటూ వెళ్లిన అతడు తిరిగి రానేలేదు. ఏదో ప్రమాదంలో...' అతడి కళ్ళు తడిసి మరింత బరువెక్కాయి.

సీతాపతి విచలితుడయ్యాడు.

మనిషిని నీరసం ఆవరించింది. నోరు ఎండిపోగా మాట వెలువడలేదు. బిగుసుకుపోయి గిల గిలలాడసాగాడు.

అతడు సర్వం మరిచిపోయాడు.

అతడికి తరువాత — ఆ మగతలో— ఎప్పుడు నిద్రపట్టిందో గూడా తెలియదు!

అందంగా గీసుకుంటున్న చిత్రాన్ని



విశరో పూళ్ళు మక్కలుచేసి గురితెం మీద వెదజల్లారు !

* * *

తూర్పు తెలతెలవారుతుండగా సీతాపతికి మెళుకువ వచ్చింది.

తలెత్తి పక్కకుచూస్తే చలపతిపక్క ఖాళీగా కనబడింది.

లేచి లోపలికి వడిచాడు సీతాపతి.

గడప దాటుతుండగా కాళ్ళు పాటంతటనే ఆగిపోయినయ్.

లోపలనుండి శారదాంబగారి కంఠం వినబడుతుంది. 'అదిగాదురా చలపతి!...సీతాపతిని అడగరాదూ!...అతడికీ చిన్నప్పటి బట్టీ శారదంటే యిష్టమే...చాలా చనువుగానూ, ఆత్మీయంగానూ వుండేవారు. .ఏంబోయింది...సీతాపతికి విజంచెప్పి .. అయినా ఆ పెళ్ళిలో ఏం చూసిందో ఆ మొగుణ్ణి...పెళ్ళితంతు ఒక్కటేగదా జరిగింది...సీతాపతీ అభ్యంతరం చెప్పకపోవచ్చు.. అతడిగుణం మనకూ తెలుసుగదా!...కదిలించి చూడు!...దాని అదృష్టం బాగుంటే అతడు అంగీకరించవచ్చు!'

చలపతి ఏదో గొణుగుతున్నట్లుగా వసుగుతున్నాడు.

సీతాపతి ఉలిక్కిపడ్డాడు.

శారదకు తిరిగి వివాహం చేయాలను కుంటున్నారా?—అందునా తనకిచ్చి!

ఉలిక్కిపడ్డాడు సీతాపతి.

అదెలా సంభవం?—ఆచార వ్యవహారాలకు పుట్టినిల్లయిన తన కుటుంబంలోనికా ఆ విధవపిల్లను పంపుదామనుకుంటున్నది?—తనవాళ్ళ సంగతి తెలియకనే ఆలా అనుకుంటున్నదా శారదాంబగారు?

ఇబ్బందిగా అటూ యిటూ కదిలాడు సీతాపతి.

తన తల్లిదండ్రులకు ఈ విషయం తెలిస్తే?—

ఏవో ..

ఉహూ...

తనకుమటుకూ—

మనిషి తడబడ్డాడు.

ఒకసారి వివాహమయి భర్తృవిహీన అయిన ఆ అమ్మాయిని తనుమాత్రం ఎలా వివాహం చేసుకోగలడు?

—చూస్తూ చూస్తూ విధవను!

(లోకం దృష్టిలో—తను ఎంత హీన

# మనసు

దృష్టితో చూడబడతాడు?

లేదు ..

తల అడ్డంగా ఊగింది.

వాళ్లకా అవకాశమే యివ్వగూడదు!

'కొన్ని గంటల క్రితంవరకు నీ వర నరాన్ని శారదను వివాహం చేసుకోవలనే కోరికే ఆవరించి వున్నదే సీతాపతీ!'—మనస్సు వెక్కిరించినట్లనిపించింది

అదివేరు—శారదకే గనుక వివాహం కాకుండా వున్నట్లయితే, ఎన్ని అడ్డంకులున్నా ఎదుర్కొని, ఆమెనే భార్యగా పొంది వుండేవాడు—

కాని—

ఈ క్షణంలో ఆ పరిస్థితులు వేరు—

తను వాటికి తల ఒగ్గలేడు.

తిరిగి చలపతి గొంతు వినబడింది.

'నాకయితే మనస్సంగీకరించటంలేదు గాని—నీ మనస్సు నొప్పించటం ఇష్టంలేక ఈ ప్రయత్నం చేస్తానమ్మా!. .ఇందులో మనం కొన్ని ఆలోచించాల్సిన విషయాలున్నాయి .. శారదకు, సీతాపతికి ఒకళ్లంటే ఒకళ్లకు అభిమానం జాస్తి అన్నావ్ .కాని ఆ సత్యాన్ని నీవు చాలా ఆలస్యంగా గ్రహించావ్! అదే నీవు ముందుగా తెలుసుకొని వున్నట్లయితే అసలు శారద జీవితమే ఇలా వుండేదిగాదేమో ఇక, అంతేగాదు . ఈ విషయాన్ని మనం చాలా తేలిగ్గా తీసుకోవాలి .అతను కాదన్నా బాధపడకూడదు . ఎందుకంటే తొంభైతొమ్మిదిపాళ్లు అతను కాదనటానికే ఆస్కారమున్నది!...'

శారదాంబగారి గొంతు విసుగ్గా వినబడింది: 'ముందు నీకిష్టంలేదని చెప్పరాదూ. లేకపోతే ఈ అనవసరపు వాదనంతా దేనికి?—అసలు నేనే అడుగుతానుండు ఆ బంగారపు మొఖం చూసి కాదనేటందుకు అతడికి నోరెలా వస్తుందో చూస్తాను—ఆమాత్రం నోరు తెరిచి అడిగే చనువు అతడిదగ్గర నాకున్నది!'

చలపతి విసురుగా బయటకు వస్తున్న చప్పుడయింది

సీతాపతి భయం భయంగా పక్కగదిలోకి తప్పుకున్నాడు.

ఆలోచనాతరంగాలలో కొట్టుకుపోతూ బిత్తర చూపులతో తలపైకెత్తాడు.

అక్కడో సాలెపురుగు అందంగా గూడు కడుతుంది—వలపన్నుతుంది!

ఆ దృశ్యానికి అతడిమొఖం మరింత కలవరపాటుతో నల్లబడిపోయింది!

తనచుట్టూ తనకు తెలియని విష వలయం అల్లుకుపోతున్నట్లనిపించింది—తను దాంట్లో చిక్కుకుపోయి, దారీ తెన్నూ తెలియక గిలగిల లాడిపోవల్సి వస్తుందా?

ఏమో?

శరీరాన్ని తత్తరపాటు ఆవరించగా చమటలు కక్కసాగాడు.

కుర్చీకి అతుక్కుపోయాడు.

ఆ క్షణంలో ఆ గృహం ఏదో భయంకర ప్రదేశమనిపించగా, దానిలోని వ్యక్తులంతా రాక్షసుల్లా కనిపించసాగారు.

ఆ ప్రదేశానికి, ఆ వ్యక్తులకి దూరంగా—వీలయినంత దూరంగా క్షణాలలో పారిపోవాలని ఆత్రుతపడసాగాడు సీతాపతి!

చలపతి ఆ గదిలో కాలుపెట్టాడు—సీతాపతి గొంతు నొక్కబోతున్నట్లుగా!

ఇప్పుడే అడిగేస్తాడా ?

—తనేం చెప్పాలి? తనెలా చెప్పాలి ?

అతి నిర్మొహమాటంగా 'లేదూ' అని చెప్పగలడా ?

ఉహూఁ. అంత నిక్కచ్చిగా ఎలా!

కాదంటే — కాస్తో కూస్తో అంగీకారం చూపించి — మిగతాది పెద్దవాళ్ల మీదకు నెట్టివేస్తే—?

ఇప్పుడతను వచ్చిన పని నెరవేర్చుకోవటమూ కష్టమే !

ఇటు శారద మీద అర్ధాంగీకారం చూపినా—అటు వెళ్లి ఆ పిల్లను చూడటమూ బాగుండదు!

ఏం చేయాలి ?

ఎటూ తెలియని అయోమయంలో పడిపోతున్నాడు సీతాపతి !

కళ్లముందు అందంగా (భయంగా) అల్లుకుపోతున్న సాలెగూడు గిర్రున తిరుగుతుంది

'లే సీతాపతి!...పెందరాళే వాళ్లింటికి వెళ్దాం!' అన్నాడు చలపతి నవ్వి.

అతడి మాటలకు సీతాపతి కొంత తేలికపడ్డాడు—ఒక్క క్షణం !

కాని—ఒకవేళ దారిలో ఆ విషయం అడుగుతాడేమోననే భయం మరల పట్టు

కున్నది !

తరువాత అరగంటకు ఇద్దరూ రోడ్డు మీదకొచ్చారు.

'ఇంకా నీవు చిన్నప్పటిలాగవే వున్నావా సీతాపతీ!' అన్నాడు చలపతి రోడ్డుమీదకు వచ్చి రిక్షా ఎక్కిన తరువాత కళ్ళు చికిలించి చూస్తూ.

'అంటే ఎలా ?' తెచ్చిపెట్టుకున్న భయం నడుమ నవ్వాడు.

చలపతన్నా, చలపతి మాటలన్నా భయంగా వున్నయి—తన చుట్టూ అతడు పాలెగూడు అల్లేస్తున్నాడు !

'అదే—నీ భావాలు, ఉద్దేశ్యాలు రివల్యూషనరీగా వున్నయ్యా ?'

చలపతి ఉద్దేశ్యమేమిటో సీతాపతికి అవగాహన అయినట్లనిపించగా మరోసారి భుజాలు తడుముకున్నాడు.

—ఒకప్పుడు అల్లరి చిల్లరగా తిరిగి పెద్దల నిబంధనలమీద, వాళ్ల ఆచార వ్యవహారాల మీద ధ్వజమెత్తిన మాట నిజమే !

కాని—ఈనాడు...

అందునా ఈ క్షణంలో—

సీతాపతి పేలవంగా నవ్వాడు. 'లేదు... లేదు .అవన్నీ పాత రోజులు !' తప్పుకున్నట్లుగా నసిగాడు.

సీతాపతి ఒ నిశ్చయానికొచ్చాడు. 'ఆ పిల్లను చూచిన తరువాత (తన తల్లి దండ్రులు చూచి బాగానే వుంటుందని వ్రాశారు గనుక—తనకు అనుమానం లేదు ఆమె అందం మీద!) చలపతికి మరేఅవకాశం ఇవ్వకుండా—ఆ పిల్ల నచ్చిందని, వివాహం చేసుకోబోతున్నానని చెప్పివేయాలి !'

అలా గనుక తన నిశ్చయాన్ని వెలిబుచ్చినట్లయితే—ఇక వాళ్లకు శారదను గురించి తనను అడిగే ఆస్కారమేలేదు !

మనిషిలో తిరిగి బలం పుంజుకుంది.

అతడు రామనాథంగారబ్బాయి — 'సీతాపతి' అని తెలియగానే వాళ్ళు పరమానంద భరితులయ్యారు.

వాళ్ళిద్దరిని ఎంతగానో మర్యాద చేశారు. మన్నన చేశారు. వాళ్ళ హడావుడి వడి ఇతరులను హడావుడి పెట్టారు

సీతాపతికి వాళ్ల తొక్కిసలాట చూస్తే గర్వమేసింది. ఏదో అందల మెక్కినట్లుగా ఫీలయ్యాడు.

సర్వం మరచి — అప్పటివరకూ పడ్డ వేదననూ, బాధనూ మరచి—ఆ పిల్లను ఏదేకంగా చూచాడు.

బాగానే వున్నదనిపించింది !

అలాగే ఆ అమ్మాయిని—సిగ్గుతో ఎరుపెక్కి బరువుతో వంగిపోతున్న ఆ అమ్మాయి అందమైన తలకట్టుని చూస్తుంటే — కళ్లముందు శారద నిలచింది !

ఏదో తెలియని రూపం — మొఖాన కుంకుమ లేకుండా — బోసిపోతూ కళ్ల ముందు మెదిలింది !

కలవరపడ్డాడు.

—ఆ కలవరపాటునుండి తేరుకోకుండానే, ఆ గృహంనుండి బయటపడ్డ కొద్ది నిముషాలలోనే వడివడిగా, మాటలు తడబడుతూ, 'నాకు ఆ అమ్మాయి నచ్చింది చలపతీ! అన్నాడు. 'ఇక ఈ మ్యాచ్ సెటిల్ అయినట్లే !' అతడు అడక్కముందే ముందుగా అనుకున్నట్లుగా అనేసి పెద్దగా నవ్వాడు

అలా అన్నతరువాత అతడిని ఎంతగానో శాంతి ఆవరించింది. పడ్డ వేదనంతా మర్చిపోయాడు. ఆవరించిన భయమంతా మటుమాయమయింది—తృప్తిగానూ, ధైర్యంగానూ శ్వాస పీల్చుకున్నాడు !

ఇంటికి వెళ్ళేటప్పటికి సరిగ్గా ఒంటిగంటయింది.

భోజనాలయినయి.

అసలు భోజనాల సమయంలో శారదాంబగారే ఆ విషయం ఎత్తారు — తిరిగి సీతాపతిని ఆలోచనావలయాలనడుమ చిక్కుముడివేసి.

'ఏమయ్యాః సీతాపతి ! పిల్ల ఎట్లా వున్నది?' ఆమె నవ్వుతూ అడిగింది. ఆ నవ్వు వెనుక ఆమె కంఠంలో విషాదమున్నట్లనిపించింది సీతాపతికి !

ఆమె ప్రశ్నకు కొద్దిగా సిగ్గుపడ్డా తలెత్తకుండానే, 'బాగానేవున్నది !' అన్నాడు అతడూ నవ్వి.

'శారదకంటే గూడానా?'

చటుక్కున తలెత్తాడు సీతాపతి.

ఆమె ఎటో చూస్తోంది.

చలపతి ఇబ్బందిగా, వినుగ్గా అటూయిటూ కదిలాడు.

సీతాపతి గుండె దడదడ లాడింది

భయంభయంగా తల వంచుకున్నాడు.

'ఏమయ్యా! మాట్లాడవేం!' గంభీరపు రెట్టింపు.

ఏలా సమాధానం చెప్పాలో అర్థం కాలేదు సీతాపతికి.

తికమక పడ్డాడు.

నోట్లో పెట్టుకున్న ముద్ద పొరబోయింది

గడగ్గడా ఓ గ్లాసెడు మంచినీళ్ళు తాగాడు.

ఇంకా తన సమాధానానికి ఆత్రంగా చూస్తున్న ఆమె మొఖాన్ని ఓ క్షణం పరిశీలనగా చూచి, నత్తినత్తిగా 'నేను శారదను ఈ మధ్య చూడలేదు !' అన్నాడు.

పక్కకు తిప్పుకున్న ఆమె మొఖంనుండి



# మనస్సు

దీర్ఘనిశ్వాసం వెలువడింది.

తరువాత ఆమె మళ్లీ మాట్లాడలేదు.

అతడు ముళ్లమీద కూర్చొని భోజనం చేసినట్లుగా చేశాడు.

చేయి కడుక్కొని తన గదిలోకి వెళ్లబోతూ, 'ఇంకో గంటలో బెజవాడకు ట్రెయిన్ వుంది—వెళతానండి. అక్కడో మిత్రుణ్ని కలవాలి ... మళ్లీ రాత్రికే హైద్రాబాదుకు వెళ్లాలి!' అన్నాడు శారదాంబగారి వంక చూస్తూ. దొంగతనం చేసిన వ్యక్తి గోడ ఎప్పుడు దూకి బయటపడదామా అన్నంత ఆత్రంగా వున్నది అతడి ప్రవృత్తి!

'వారు ఇప్పుడే వస్తానన్నారు ... నీతో ఏదో మాట్లాడాలట!' అని 'వెళుదువుగాని లేవోయ్! రాక రాక వచ్చావ్ ఏమిటీ తొందర!' నవ్వింది ఆమె.

ఆమె నవ్వుకు అతడు కలవరపడ్డాడు.

ఏం సమాధానం చెప్పాలో తోచలేదు.

'కాదు ... నేను వెళ్లిపోవాలి!' అని మొండిగా ఎలా చెప్పగలడు—ఏం మర్యాద అది!

తన బలహీనతది!

ఆయన ఏం మాట్లాడతాడు తనకు తెలుసు — శారదను వివాహం చేసుకోమంటాడు!

అంతేగాకుండా — జాలి గుండెగల తన ముందు—కన్నీళ్లు పెట్టుకోవచ్చు చేతులు పట్టుకు బతిమలాడవచ్చు — కాదంటే కాళ్లు పట్టుకుంటే మాత్రం ఎవరు ఆపగలరు?

కాని—వాళ్లు ఆలోచించరు — తనని, తల్లిని, తండ్రిని, వంశాన్ని, లోకాన్ని — గురించి!

కాసేపు విసుగు. కాసేపు కోపం, కాసేపు భయం— మనిషి నలిగిపోతున్నాడు!

మొఖమంతా నల్లబడిపోయింది.

చెమటలు కక్కుతున్నాడు.

బాధగా, భయంగా తలెత్తితే పైగా, నూలగా పాతెగాడు...

కనురెప్పలు బరువుగా వాలిపోసాగినయి...

గదిబయట అడుగుల సవ్వడి.

చలపతి తండ్రా?

అటు యిటూ కదిలి బిగుసుకు కూర్చున్నాడు.

చెప్పేయాలి—'మీ అమ్మాయిని చేసుకోను!'—అని!

పిడాలు బిగించాడు.

అడుగులు మరింత దగ్గిరయినయి.

చిన్న దగ్గు!

గుండె దడదడ లాడుతుండగా, భయం భయంగా కనురెప్పలెత్తి తలుపు వంక చూచాడు.

శారద!

అతడి కళ్లు వాలిపోలేదు తెరచుకున్న నోరు మూతపడలేదు. అతడి చూపు మరలలేదు!

జరీ అంచు ఎర్రని పట్టుపావడామీద గులాబీరంగువల్లె — ఎర్రని శారదను — వత్తయిన కురులతో అందంగా మెరిసిపోతున్న ఆమెను — దేవతలా మారుస్తున్నయి!

ఆమె విద్యుల్లతలా మెరిసిపోతుంది!

అతడి చూపుకు తత్తర పడుతున్నట్లుగా, 'నేను శారదను!' అన్నది చిన్నగా నవ్వి.

అతడికి నోటివెంట మాట పెగల్లేదు —కళ్లు రెపరెప లాడించాడు.

'నే నో విషయం చెబుదామని వచ్చాను!'

'చెప్పు!' అన్నాడు—ఎలాగో పెగల్చుకొని —తడారిపోయిన గొంతుకతో!

'మా వాళ్లు ముఖ్యంగా మా అమ్మ—ఏవేవో ఆలోచిస్తోంది — ఎన్నో పన్నాగాలు పన్నుతుంది—ఆమెది చెడు ఉద్దేశ్యం కాకపోవచ్చు! ఆమెకు నా సుఖమే ముఖ్యమవ్వచ్చు...కాని, నాకూ మనస్సు వున్నది. నాకూ హృదయమున్నది నాకూ నాకు తగ్గ ఆలోచనలు వున్నయి. నాకూ జీవితంమీద, నా ఆశయాలమీద ఓ నమ్మకమున్నది, కోరిక వున్నది.. నేను పెద్దవాళ్ల కోరికలకు, వాళ్ల ఆటలకు బలి కాదలుచుకోలేదు — నా మనస్సుకు ఏది తృప్తి కలిగిస్తుందో, ఏది మంచిదనిపిస్తుందో అదే చేయగల ధైర్యం శక్తి—దురదృష్టవంతురాలినయిన — నాకు వున్నయి. గుండె ధైర్యమున్నది నాకు. పిరికిదాన్ని గాదు నేను—అందుకే అందరి దృష్టిలో నేను 'మొండిదాన్ని'! 'ఆమె చిన్నగా నవ్వింది




సీతాపతికి ఆమె మాటల ధోరణి అర్థం గాకపోగా—తనను ఎత్తిపొడుస్తున్న ధ్వని వినిపించి కుంచించుకు పోసాగాడు

'అందుకే— మీ దృష్టిలో తేలికయినా సరే— మీ ముందు నిలబడి నా మనస్సులోని మాటను చెప్పటానికి వచ్చాను—మా వాళ్ల ఉద్దేశ్యం నేను మిమ్మల్ని తిరిగి వివాహం చేసుకోవాలని!—మీరు నన్నూ నా పరిస్థితులనూ చూచి జాలితోగాని, నా అందాన్ని చూచిగాని అంగీకరించవచ్చు— కాని, నాకు తిరిగి వివాహం చేసుకోవాలనే కోరిక లేదు —నేను వివాహం చేసుకోను — చెడ్డకో, మంచికో ఒకసారి జరిగిపోయింది ఒకరితో నా జీవితం ముడిపడిపోయింది. నా అదృష్టాన్ని దేవుడు చిన్నచూపు చూశాడు — కాని మరొకరు జాలితో మరోసారి నన్ను చిన్న చూపు చూడటం నేను సహించలేను. నేను భరించలేను—వివాహం చేసుకొని క్షణ క్షణం రగిలే గుండెల్ని అదిమిపట్టుకొని బ్రతకలేను నేను— క్షమించాలి! — నా మీద మీ కేమైనా ఆశల గూడు కట్టుకుంటుంటే అదిలోనే తుడిచివేసుకోండి— తరువాత బాధపడవద్దు మీరు—నన్నుబాధ పెట్టవద్దు—వస్తాను!'

గిరుక్కున—సీతాపతి కళ్లు చెదిరేలా—వెనుదిరిగింది.

రెండడుగులు వేసి ఆగి, 'ఈ మనుష్యుల కోరికల నెదిరించి ఎంతో ఉన్నతంగా జీవితం గడపాలనుకుంటున్నాను — శలవ్!' ఆమె చటుక్కున మాయమయింది.

అతడలాగే కుర్చీకంటుకుపోయి కూర్చున్నాడు—ఆ మాయమయిన విద్యుల్లత వంక జాలిగా, దీనంగా, పవిత్రంగా చూస్తూ ●

పి. జె. ఆర్, పిఠాపురం

**మీ జీవితంలో మరువలేని రోజేది?**

ఇంకా అంతసుదీర్ఘం అనిపించలేదీ బ్రతుకు అంచేత మరపురాని రోజులకోసం లెక్కవేయడం ప్రారంభించలేదు సోదరా!

బి. ఎమ్. పి, విడవనకల్లు

**ప్రేమకు మోహం దగ్గిరా? త్యాగం దగ్గిరా?**

ఏం? ప్రేమదగ్గిర కాకూడదా? మోహమో త్యాగమో ఉంటేగాని ప్రేమ అనిపించుకోదా?

ఎ. ఏ. ఆర్, వైజాగ్

**మీరిచ్చే సమాధానాలు చూస్తుంటే మీకు డిగ్రీ ఉన్నదనిపిస్తుంది...**

ఎప్పుడో పుచ్చుకున్నట్టే నాకూ జ్ఞాపకం వస్తూంది బ్రదర్.

సి. కె. ఎమ్, కూచిపూడి

**మొన్న మీ సమాధానం బాగుండలేదు తల్లిని ప్రేమించరా? సోదరిని ప్రేమించ రా? ఆ 'అవుట్ లుక్'తో తీసుకోవలసింది.**

ఆ కుర్రనాగమ్మ 'అవుట్‌లుక్' అదికాదే మరి!!

జి. కె. డి, మహాదేవపట్నం

**కథ రాయాలంటే తెల్లకాగితాలు పనికి వస్తాయా? లేక ప్రత్యేకించి ఏమైనా కాగితము లుండనా అక్కయ్యా?**

అది దేవ రహస్యం చెల్లెలా?! చెప్పేస్తే ఎలాగ?

ఎస్. వి. ఆర్, పిఠాపురం

**నేడు విరివిగా సాగుతున్న కుటుంబ నియంత్రణ పథకాలపై మీ అభిప్రాయం?**

పథకాల కేం కొదువ కనబడ్డంలేదు గాని ఫలితాలే అంతంత మాత్రంగా ఉంటున్నాయని.

యస్. బి. యమ్, అనంతపురం

**అక్కయ్య స్త్రీకి ముఖ్యమైనవి ఏవి?**

స్త్రీత్వం చెల్లెలా.

పి. ఎస్, బరంపురం

**స్త్రీ పురుషులలో ఎవరు కఠినాత్ములో పక్షపాతం లేకుండా చెప్తారా?**

స్త్రీలే ఒకసారి కాఠిన్యం అవలంబించాలేగాని ఇక ఆ బ్రహ్మ దిగివచ్చినా వారిని కరిగించలేడు!

ఎమ్. ఆర్, కాకినాడ

**మనస్సుకి కళ్లెం వేయడం ఎలాగ?**

ముందరే గుర్రం ఎక్కి కూచోకపోడమే.

కె. ఎస్. ఇచ్ఛాపురం

**బూమరాంగులాగా మనవేపే తిరుగపడవచ్చు అన్నారు, బూమరాంగు అంటే ఏమిటి?**

అదొక ఆయుధం లాంటిది. వంపు తిరిగి ఒకటిన్నర రెండడుగులు ఉంటుంది అది నిలబడి విసిరిన చోటికి తిరిగి వస్తుంది. ఆస్ట్రేలియను జాతులు విరివిగా ఉపయోగించేవారట.




ఎల్. వి. ఎల్, కొత్తవలస

**మా అమ్మ చూడడానికి చాలా అమాయికురాలిగా కన్పిస్తుంది కాని ఆమె నాన్న గారిని సాధించేవిధం చూస్తే మీరే ఆశ్చర్య పడతారు. ఇలాంటివారిని మార్చడం సాధ్యమా?**

మొగుడితలమీద మిరియాలు నూరే యీరకం స్త్రీలని మార్చటం ఎవరికీ సాధ్యం కాని పని

బి. వి. ఏ, వైమానికదళం. హల్వారా (పంజాబు)

**నే నొక అమ్మాయిని ప్రేమించాను కులం తక్కువ అని నా తల్లితండ్రులు పెళ్లికి ఒప్పుకోడంలేదు. ఏం చెయ్యమంటారు?**

ప్రేమకి కులమతాలు లేవు సంపాదనాపరుడైన యువకుడు స్వతంత్రించి తనకి మనసిచ్చిన మగువని వివాహం చేసుకోడంలో వెనకతీయవలసిన పనిలేదు

ఎస్. ఎస్. కె, బొబ్బిలి

**అక్కయ్య పంచభూతాలంటారే భూతం అంటే ఏమిటి?**

భూతం అన్నదానికి 'ఎలిమెంట్' అని చెప్పుకోవచ్చు ఇది స్వతస్సిద్ధ పదార్థం అంటారు

సి. ఎస్. ఆర్, పేలేరు

**స్త్రీలు అబలలా? సబలలా?**

అవసరం అయితే సబలలు కాని చోట్ల అందంగా అబలలే సోదరా

జె యం. డబిల్యు, కొత్తగూడెం

**ఆమె నన్ను నేను ఆమెను ప్రేమించుకున్నాం. కాని మా ఇద్దరికీ తొలినుండీ మాటలు లేవు. ఒకరిని చూస్తే ఒకరికి భయం. ఏం చేయాలి?**

ఏముందీ, మూగవాని ముందు ముక్కుగోక్కొ భయం—భయపడుతూ కాలం గడపండి. ప్స్!

టి. ఆర్, విజయనగరం

**ఆడది ఏ పనిచేసినా, ఏమి మాట్లాడినా అసూయలాగ కనబడుతుంది. మగవారికి అసూయద్వేషాలు లేవా?**

ఆడదాని మాటలో చేతలో కనబడే అసూయా ద్వేషాలు మగవాని చూపుల్లోనే గ్రహించవచ్చు.

వి. ఎల్ ఎస్. ఆర్, బరంపురం

**ఒక తప్పుపనిచేసి అది తలచుకొని బాధ పడేవారిని ఏమనాలి?**

మళ్లీ అదే తప్పు చేయకుండా ఉండాలే కాని బాధపడి ప్రయోజనం ఏమిటి అని అడగాలి

ఎస్. ఎమ్, హైదరాబాదు

**పిల్లలతో సినిమాకు వెడితే తల్లి తండ్రులు కొంత అసౌకర్యం ఫీలవుతున్నారు ఎలాగ?**

పిల్లలని చూసుకుందుకు ఇంట్లో ఏర్పాటు చేసుకుని వెడితే సరి 'బేబీ సిట్టింగు' లాంటివి మన యువతీయువకులు కూడా అలవాటు చేసుకోవాలి.

కె. జి. ఆర్, హైదరాబాదు

**మీ పత్రికలో సన్యాసత్వానికి సంబంధించిన ప్రశ్నలు ప్రచురిస్తున్నారుఎందుకు?**

అలాగా? అయినా భక్తిముక్తిలకి సంసారం బొమ్మ అయితే సన్యాసం బొరుసు అంచేత ఫరవా లేదనుకుంటాను

డి. ఎ. ఆర్, బండాముండా (బీహార్)

**అక్కయ్య, కార్టూను చిత్రాలు చూసి మన మంత్రులకు తెలివితేటలు ఎందుకు రాకూడదు?**

మంత్రాలకు చింతకాయలు రాలడం ఎప్పుడేనా చూశావా తమ్ముడూ?

ఎల్. వి. ఆర్, పిఠాపురం

**మేం అంతా కలిసే ఉంటాము. కాని ఏవో చిన్న చిన్న తేడాలు తప్పడం లేదు ఆత్మీయుల మధ్య కూడా ఇలా ఎందుకు జరుగుతుంది?**

తల్లీ బిడ్డా ఒకటే అయినా నోరూ కడుపూ వేరు కదూ?

ఎ. డి, కాకినాడ

**ఈ కష్టాలు గడిచేదెప్పుడు? జీవితంలో సుఖపడే దెప్పుడు అనిపిస్తూ ఉంటుంది.**

కష్టాలు గడిచాక సుఖిద్దామనుకోవడం అలలు తగ్గాక సముద్రంలో స్నానం చేద్దామనుకోడం లాంటిదే కష్టాల్లోనే సుఖాన్ని చవిచూస్తూ జీవితం కొంచెమైనా ఆనందదాయకం చేసుకోవాలి ●

# క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు

అనువాదం: తిరుమలరామచంద్ర




రాజకుమారి వాసవదత్తకు మారు వేషంతో వున్న వసంతకుడు ఇలా కథలు చెబుతూ, సంతోషపెడుతున్నాడు. ఉదయనుడు ఆమెకు సంగీత కళను శ్రద్ధగా నేర్పుతున్నాడు రాజకుమారికి ఉదయనుని పై ప్రగాఢమైన విశ్వాసం కలిగింది ఈ విశ్వాసం క్రమంగా ప్రేమబంధమయింది.

యౌగంధరాయణుడు తన అదృశ్యకరణీ విద్యతో కన్యాంతఃపురంనుంచి మాయమై పోయాడు. ఉదయనుని చెరనుంచి తప్పించడానికి ఉపాయాలు ఆలోచించాడు: 'చండ మహాసేనుడు వాసవదత్తకు భద్రవతి అనే ఆడ ఏనుగును బహూకరించినాడు. అది మహావేగంగా నడవగలది. రాజు వాసవదత్తతోపాటు ఆ ఏనుగుమీద కన్యాంతఃపురం నుంచి ఎవరికంటాపడకుండా పారిపోయి, అవంతిసీమలను దాటపోయాడా, పుళిందకుడు రాజుకు తోడ్పడడానికి సిద్ధంగా వున్నాడు. ఇప్పుడు చేయవలసినపని భద్రవతి మావటివాడు అషాఢకుడనేవాడిని వశపరచుకోడం. వాడు బాగా ధనాశ చూపితే లొంగేట్లు కనిపించాడు'

పిచ్చి యౌగంధరాయణుడు తన ఆలోచన ప్రకారం అన్ని ఏర్పాట్లూ చేశాడు. మరల కన్యాంతఃపురంలో ప్రత్యక్షమై వాసవదత్తను, ఆమె సఖీజనాన్ని నవ్విస్తూ, రహస్యంగా ఉదయనునికి తన ఏర్పాట్లన్నీ తెలిపాడు భద్రవతిని పట్టగల ఏనుగు నడగిరి తప్ప మరొకటిలేదు కాని, నడగిరి భద్రవతిని చూస్తే ప్రపంచమే మరచిపోయి అవశమైపోతుంది గాని, పోరాడనే పోరాడదు. ఈ సంగతులన్నీ యౌగంధరాయణుడు రాజుకు నివేదించాడు. తన బంధనాలను తెంపుకునే యోగవిద్య కూడా అతనికి ఉపదేశించాడు.

యౌగంధరాయణుని తంత్రం పూర్తిగా పారింది భద్రవతి మావటీడు అషాఢకుడు ధనాశకు వశుడయ్యాడు. ఉదయనుడు ఒక రాత్రి యోగంతో తన శృంఖలాలను తెగ తెంపుకొని భద్రవతిని అధిరోహించాడు. వాసవదత్త, ఆమె ప్రేమవిశ్వాసాలకు స్థానమైన కాంచనమాల అనే చెలికత్తె, రాజు నర్మ సచివుడు, మారువేషంతో వున్న వసంతకుడు రాజు వెంటనే ఏనుగును ఎక్కారు.

ఎవరూ గుర్తు పట్టకుండా నల్లటి

వస్త్రాలు ధరించారు. భద్రవతికి ఘంటలు, మువ్వలు మొదలయిన అలంకరణలు తీసివేశారు. అది నిశ్శబ్దంగా బయలుదేరింది ఆషాఢకుడు చాల చతురతతో భద్రవతిని నడిపించాడు. కాని, ఇదంతా ఎంతగుట్టుగా జరిగినా నడిచేది ఏనుగ గదా? రాత్రి ఏనుగు మీద ఎవరో పారిపోతున్నారనో, ఏనుగును ఎవరో అపహరిస్తున్నారనో సందేహం కలిగింది, నగర రక్షకులకు వారు ఏనుగును చుట్టుముట్టారు ఇదంతా అదివరకే ఊహించిన ఉదయనుడు సర్వాయుధాలతోను సిద్ధంగా ఉన్నాడు గనుక నగర రక్షకులను హతమార్చాడు ఏనుగు ముందుకు సాగిపోయింది భద్రవతి వేగంగా పోతూవుంటే ఉదయనుడు, వాసవదత్త ధరించిన ముత్యాలహారాలు కదులుతూ వింతశోభ కలిగించాయి.

ఉజ్జయినిలో రక్షకుల మరణ వార్త తక్కిన భటులకు తెలిసింది. వారు చండమహాసేనునికి ఈ సంగతిని విన్నవించారు. ఇంతలో కన్యాంతఃపుర రక్షకులు కూడా గోడు గోడున రాజసన్నిధికి వచ్చారు ఉదయనుడు వాసవదత్తతో పాటు భద్రవతినెక్కి పారిపోయాడని చండమహాసేనుడు తెలుసుకొన్నాడు పట్టణమంతా రాజభటుల కోలాహలంతో మారుమ్రోగింది. పౌరులంతా, ఏమి జరిగిందో స్పష్టంగా తెలియక తలకొకరీతిగా వార్తలు చెబుతూ, వదంతులు వ్యాపింపజేస్తూ కుతూహలాయత్తచిత్తులైవున్నారు.

చండమహాసేనుని కుమారుడు పాలకుడు ఈ వార్తవిని మండిపడ్డాడు నడగిరిని ఎక్కి భద్రవతిని తరిమిపట్టాలని బయలుదేరాడు. నడగిరి ప్రచండవేగంతో పరుగిడ సాగింది. చండమహాసేనుడు కొంచెం కలవరపడ్డాడు. అతనికి ఉదయనుడు తప్పించుకొనిపోవడం ఇష్టంలేకపోయినా, వాసవదత్తను అతనికి ఇవ్వడం ఇష్టమే. పాలకుడు నడగిరి ఎక్కి ఉదయనుని తరుముతూపోతే, యుద్ధమే పొసగితే, ఏమిటి గతి? అందువల్ల రెండవ కుమారుడు గోపాలుణ్ణి పిలిచి ఇలా అన్నాడు — 'నాయనా, గోపాలా, నీ సోదరుడు పాలకుడు చాల కోపిష్ఠివాడు వత్సేశ్వరుణ్ణి తరుముతూపోయాడు. వత్సేశ్వరుడు శూరుడు,

# ...బృహత్కథా మంజరి

మనకు గౌరవించదగినట్టివాడు కనుక త్వరగా వెళ్ళి పాలకుడు వత్సరాజుతో పోరాడకుండా నివారించు' తండ్రి ఆనతి ప్రకారం గోపాలుడు సుగ్రీవమనే గుర్రం ఎక్కి దౌడుతీశాడు, తన సోదరుణ్ణి మరలించడానికి

వత్సరాజు రాత్రి దట్టమైన చీకటిలో ప్రయాణం చేస్తున్నాడు. ఆ చీకట్లో వారు ధరించిన మెరుస్తున్న ముత్యాలహారాలు తప్ప మరేవీ కనిపించడంలేదు. రాత్రి కొంత గడిచింది. చంద్రుడు ఉదయించాడు లలనల కపోలాల లలితమైన కాంతిలాగ ఉన్నది చంద్రుని కాంతి. రజని అనే రాజతనయ నొసటపెట్టిన కర్పూరపు బొట్టులాగ తెల్లగా కనిపించాడు చందమామ. ఆ చీకటిలో పిడికిలితో పట్టుకోదగినట్టుగా చందురుని కాంతి అంతటా ప్రసరించింది.

ఆకస్మాత్తుగా పిడుగుపాటువలె ఘోరమైన ధ్వని వినిపించింది ఆ ధ్వనికి భూమి పగుళ్ళు వారుతున్నట్టు తోచింది. ప్రళయకాలంలో భ్రాంతచిత్తుడైన చండికాపతి ఉగ్రుడై డమరుకం వాయించాడా అన్నట్టు తోచింది భద్రవతిని నడుపుతున్న మావటి ఆషాఢకుడు ఆ శబ్దం విన్నాడు, ఉదయనునితో ఇలా విన్నవించాడు 'దేవా, ఈ శబ్దం, మహామేఘాల ఘోరమైన ఘోషలాగ వినిపిస్తున్నదే,ఇది నడగిరి ఘీంకారం. ఈ ఘీంకార శబ్దం దిక్కులను స్తంభింపజేస్తున్నది.'

ఆషాఢకుడు ఇలా అంటుండగానే నడగిరి కనిపించిరేది. అది నల్లటి మేఘాల సంబంధంవల్ల నల్లబడిన ఐరావతంవలె వుంది. 'మీ ఆజ్ఞ లేనిదే నాకు స్వస్థావస్థితి లేదు. కనుక ఉత్తరువు దయచేయండి' అని ప్రార్థించడానికి అగస్త్య మహామునిని వెదుక్కుంటూవచ్చిన వింధ్య పర్వతమో అన్నట్టు ఉంది. సిందూరం పూతతో ఎర్రగా వుంటున్నది దాని మహాకాయం రెండు వైపులా పెద్ద ఘంటలు వేలాడుతున్నాయి. అది చూస్తే, ఒక వైపు చంద్రుడు ఉదయిస్తూ, మరొక వైపు సూర్యుడు అస్తమిస్తూవున్న సంధ్యారుణమైన నీలాకాశమో అన్నట్టుఉంది. నడిగిరికి ముందునుంచి వెనుకవరకు చుట్టూ మొగ్గలలాంటి ఏనుగు దంతాలతో దండ (ఛాయాసూత్రం) గుచ్చి కట్టారు. అది దాని నల్లటి దేహంచుట్టూ తెల్లటి గిరి గీచినట్టు వుంది. దానిని చూస్తే, 'మహామత్తేభమా; నీ రోకళ్లవంటి దంతాలతో భూదేవిని కుమ్మవద్దు' అని ప్రార్థించడానికి ఆదిశేషుడే వచ్చి, దానిని చుట్టుకొని బతిమాలుతున్నాడా అన్నట్టు ఉంది. నడగిరి మెడలో నక్షత్రమాలలు వేశారు (నక్షత్రమాల అంటె ఏనుగులను అలంకరించే ఒక విధమైన మణులదండ) ఆ దండలు నక్షత్రమాలికలలాగ మెరుస్తున్నాయి. అది చూస్తే, ఆకాశం అంటే ఈ ఏనుగు తన తొండంతో తమ భర్త అయిన తారాపతిని (చంద్రుణ్ని) లాగి భూమిమీద పారేస్తుందేమోనవే భయంతో తారకలు బారులుకట్టి మెడ పట్టుకొని సేవ చేస్తున్నట్టు ఉంది.

నడగిరి భద్రవతిని సమీపించింది సమర్థుడు, యుద్ధసన్నద్ధుడు అయిన పాలకుడు ఎంత ప్రేరేపించినా, ఎంత ఉసిగొల్పినా నడగిరి భద్రవతిని మార్కొనలేదు. కోపం చల్లారిపోయి ప్రీతితో తొండం ఆడిస్తూ నిలబడిపోయింది. పాలకుడు, ఉదయనుని చీల్చి చెండాడుదామనుకొని బాణం సంధించిన వింటినారిని చెవి వరకు లాగాడు. ఆ మండలాకారమైన ధనుస్సు మధ్యన చండమహాసేనునిపుత్రుడు మరింత చండనాయకుడుగా కనిపించాడు. అంత బలంగా నారిని లాగినవాడు, ముందు చెలెలు వాసవదత్తను చూచి, చల్లబడి



పారిపోయాడు.

పాలకుని కోసం చేళ్లారినదని ఉదయనునికి తెలియదు. అతడు, తనను మళ్లీ బంధించడానికే వచ్చాడనే నమ్మకంతో నిర్భయగా తన ధనస్సు ఎక్కుపెట్టాడు. మొదట్లోనే ఉదయనుడు ధైర్యానికి నిధి. ఇప్పుడు సంభవించిన ఆపద సామాన్యమైనది కాదు. ఒక్క బాణం సంధించి పాలకుని విల్లు రెండు ముక్కలు చేశాడు. మరొక బాణంతో అతని ఖడ్గాన్ని విరిచాడు. ఇంకొక బాణంతో అతని తోమరాయుధం తునియలు చేశాడు. అతని వెంటవచ్చిన వారి ఆయుధాలను ఖండ ఖండాలు చేశాడు విరిగిన ఖడ్గాల ముక్కలతో ఆ సంగ్రామభూమి విజయలక్ష్మి చెవిలో అలంకారార్థం చెక్కుకున్న కలువ రేకులు రాలిన (విజయలక్ష్మి) రతిశయ్యలాగ కనిపించింది.

...లాగా, తండ్రి ఆజ్ఞతో యుద్ధం ఆపడానికి బయలువెడలిన గోపాలుడా అక్కడికి చేరాడు. అతనివెంట మహావేగంగా పరువిడే గుర్రాలమీద రౌతులూ వచ్చారు గోపాలుడు తండ్రి ఆజ్ఞను తన సోదరుడు పాలకునికి వినిపించాడు. అతనిని తనవెంట ఉజ్జయినిని పిలుచుకొనివెళ్లాడు.

మదోత్కటమైన నడగిరి బలం పెంపుతో పోతరించిన రాజపుత్రుడు పాలకుడు వెళ్లిపోయిన తర్వాత, వత్సరాజు మరేమీ అనాహూతం జరుగరాదనే ఉద్దేశంతో త్వరత్వరగా ప్రయాణం సాగించాడు. రాత్రి గడిచింది. అడవిలో ముందుకు పోతూనే వున్నారు.

తెల్లవారింది వత్సరాజు ఆగలేదు మిట్ట మధ్యాహ్నమయింది. సూర్యుడు తన ప్రచండ కిరణాలతో తపింపజేయ సాగినాడు. భద్రవతి తపనపడదొడగింది. 'దేవా, భద్రవతికి దప్పిక అయింది. ఇది నీరు త్రాగాలి. త్రాగితేనేగాని కదలదు' అని ఆషాఢకుడు ఉదయకునికి మనవి చేశాడు. రాజా సరే, ఏదైనా చెరువువద్దకు నడిపించమన్నాడు ఏనుగును.

సమీపంలోనే ఒక తటాకం ఉన్నట్లు గ్రహించాడు ఆషాఢకుడు. అక్కడికి భద్రవతిని తోలుకొని వెళ్లాడు. ఉదయనుడు, వాసవదత్త, వసంతకుడు, కాంచనమాల ఏనుగు దిగారు ఏనుగు తటాకంలోకిదిగింది; నీరు తాగింది, గొంతువరకు గట్టు ఎక్కింది.

కాని, ఆ తటాకం నీరు విషదూషితమైనట్టిది దప్పిగొన్న భద్రవతి మైమరచి తాగివేసింది. చెరువు గట్టు ఎక్కింది వెంటనే కిందికి దొర్లి కాళ్లు, తొండం కొట్టుకొంది. కొంతసేపటికి ప్రాణాలు పోయాయి.

తనకు తండ్రి బహూకరించిన భద్ర

వతి అసువులు బాసినందుకు వాసవదత్త చాల దుఃఖించింది. ఉదయనుడును వ్యథ పడ్డాడు. ఇంతలో అకస్మాత్తుగా ఆకాశం నుంచి ఒక వాక్కు వినిపించింది. అందరూ తల తిప్పిచూశారు. 'వత్సరాజా, నేను విద్యాధరవధువును నా పేరు మాయావతి. నాకు శాపంవల్ల ఏనుగుజన్మ వచ్చింది

## ...బృహత్కథామంజరి

నీకు సేవ చెయ్యడంవల్ల శాపం తొలగింది నా లోకానికి నేను పోతున్నాను. నీకు పుట్టబోయే కుమారుడు సర్వ విద్యాధరులకు ప్రభు వవుతాడు. అతనికి నేను సాయపడుతాను ' అని వినిపించింది

వత్సరాజా వాసవదత్తతోపాటు కౌశాంబి చేరవలె గదా అదివరకే అనుకున్న ప్రకారం మిత్రుడు పుళిందకుని సహాయం పొందాలని నిశ్చయించుకొన్నాడు పుళిందకునివద్దకు తన నర్మసచివుడు వసంతకుని పంపాడు. వసంతకుడు ఆ వికారవేషంతో వెళ్ళితే పుళిందకుడు ఎలా గుర్తుపడుతాడు? అందువల్ల వసంతకుడు రూపపరావృత్తియోగంతో స్వస్వరూపం ధరించాడు. పుళిందకుని పల్లెకు బయలుదేరాడు.

వసంతకుడు వత్సరాజా వృత్తాంతం పుళిందకునికి తెలిపాడు. పుళిందకుడు పరివారంతోపాటు వత్సరాజును తనపల్లెకు పిలుచుకొనిరావడానికి పయనమయ్యాడు. ఆ పుళిందపురంలోనే యౌగంధరాయణుడు అంతకుముందే వచ్చిఉన్నాడు అతడు పుళిందకునితో ఉదయనునివద్దకు పయనమయ్యాడు

మొదలే భయంకరమైన వింధ్యాటవి. ఉదయనుడు, వాసవదత్త, కాంచనమాల మాత్రమే ఉన్నారు మరే పరివారమూ లేదు. ఇది చూచారు దోపిడీ దొంగలు. వారిపై హఠాత్తుగా పడ్డారు సాహసైకభూమి అయిన ఉదయనుడు ధనుర్మాత్ర సహాయుడై వారితో తలపడ్డాడు. పెక్కుమందిని పరలోకానికి పంపాడు ఇంతలో పుళిందకుడు, యౌగంధరాయణుడు శబర సైన్యంతో రావడందొంగలు చూచారు కాలికి బుద్ధి చెప్పారు పుళిందకుడు ఉదయనుని, వాసవదత్తను, ఆమె సఖిని రాచమర్యాదలతో తన పల్లెకు పిలుచుకొనిపోయాడు. మహామాత్యుడు యౌగంధరాయణుడు రూపపరావృత్తి విద్యతో తన రూపంతో రాజును దర్శించుకొన్నాడు రాజు అతనిని స్వస్వరూపంలో చూచి, వాసవదత్తను కలుసుకొన్నంతగా సంతోషించాడు.

ఉదయనుడు పుళిందుడు ఏర్పాటు చేసిన విడిది పటకుటీరంలో వాసవదత్త సేవలు అందుకొంటూ సుఖంగా ఉన్నాడు అప్పుడొక సార్థవాహుడు (వ్యాపారస్థుడు) ఉజ్జయినినుండి ఆ దారిని మరొక్క పట్టణానికి వెళ్ళుతూ, ఉదయనుని దర్శించుకొని కానుకలు సమర్పించి ఇలా విన్నవించాడు:— 'వత్సనృపతీ, మాచండ

(64 వ పేజీ చూడండి)

రంగులరాట్నం

ఏంచేస్తాడో
మనిషిపిల్లాడు
చూసేసేడు!
ఎలా?



## జాగ్వార్

ఇది అమెరికా ప్రాంతాల్లో నివసిస్తుంది. దీన్నే 'అమెరికా పులి' అంటారు. మన దేశంలోని చిరుతకన్నా చిన్నదే అయినా, మరికొంచెం పుష్టిగా ఉంటుంది. తలపెద్దదిగా ఉన్నా, కాళ్లు పొట్టిగా బలంగా ఉంటాయి. శరీరంమీద బంగారు వన్నె ఛాయ ఉంది, దానిమీద చుక్కలు, చిత్రంగా పుష్పం ఆకారంలో—చుట్టూ రేకులున్నట్టు—ఉంటాయి. తోక సుమారు ఒక అడుగుఉంది. దానితో సహా ఈ 'పిల్లి' ఆరుఅడుగుల పొడవు.

ఉత్తరమెరికా టెక్సాసు, మెక్సికోనుండి క్రిందుగా దక్షిణ అమెరికా అంతా వ్యాపించిఉంది.

చెట్లమీద కాపువేసుకొని, అవకాశం రాగానే, జంతువు దగ్గరకి రాగానే, జంతువుమీద పడి సునాయాసంగా చంపుతుంది, ప్యూమా మాదిరిగా దొంగచాటుగా సద్దుచెయ్యకుండా పడదు. పెద్ద శబ్దంతో చెట్లలో తిరుగుతుంది. రాత్రుళ్లు దీని అరుపులు అడవుల్లో ప్రతిధ్వనిస్తూంటాయి. టాపిరు, లేడి, అడవిపంది లాటివి దీని ముఖ్యఆహారం నీళ్లలోచక్కగా ఈదుతుంది. పైగా ఆ ప్రయాణంలో చేపల్ని చిత్రంగా పంజాతో కొట్టి తింటుంది!

మనిషిని చంపగల్గే శక్తి ఉంది. అయితే మనిషి అంటే భయపడుతుంది! ●

—ఇమ్మిడి కోనేటిరావు

## ఆవేశాలూ - అపరాధాలు




అది 17 జూన్ 1911 తెల్లవారే రయిలు బండి మణియాచి స్టేషన్‌లోకి వచ్చి ఆగింది ఈ బండి రాకలో ఏదో ప్రత్యేకత ఉంది అందుకనే స్టేషన్‌మాస్టరు కొంచెం ఇబ్బందిగా మొహం పెట్టి తన అసిస్టెంట్లు ఇద్దరికి ఏదో రహస్యంగా చెప్పాడు వాళ్లిద్దరూ స్టేషన్ అంతటా హడావుడిగా పరిగెత్తుతూ అక్కడి కూలీలకీ, ప్రయాణీకులకీ, అమ్ముకునేవారికీ అందరికీ!—'ఫలానా వారు వస్తున్నారు మర్యాదగా నడుచుకోండి!' అని చెప్పటం మొదలు పెట్టారు

ఆ పెద్దమనిషి కూర్చుని ఉన్న కంపార్టుమెంటు వయిపు మళ్లాయి అందరి కళ్లూ

"కలెక్టర్ ఆష్! తూత్తుకుడి కలెక్టరు ఆష్!' అన్నారు ఆ వ్యక్తిని గుర్తు పట్టినవారు. ఈ సంగతి స్టేషన్ అంతా పాకిపోయింది అంతకి ముందున్న సందడి తగ్గిపోయి ఆ ప్రదేశాన్ని నిశ్శబ్దం ఆవరించింది

అవి బ్రిటిష్ ఆఫీసర్లు మహాప్రభువులుగా చలామణీ అవుతున్న రోజులు వాళ్లు బహిరంగంగా కనిపిస్తేనే చాలు హడలిపోయేవారు చాలామంది! కాని, ఈనాడు మణియాచిలో వాతావరణం మరింత భయాందోళనలతో నిండి ఉంది

ఎందుకని?

కలెక్టరు ఆష్ తూత్తుకుడిలో అసిస్టెంటు కలెక్టరు అయినప్పటి నుంచీ ప్రజల గుండెల్లో రయిలు బళ్లు పరిగెత్తించాడంటే అతిశయోక్తి లేదు

అతను అసిస్టెంటు కలెక్టరు పదవిని ఆక్రమించిన ఏడే ఆ ప్రాంతంలో ఒక కొత్త చయితన్యం ప్రారంభం అయిందనవచ్చు. తూత్తుకుడి రేవులో—20 నవంబరు, 1906 నాడు— 'షల్లన్' అనే స్వదేశీ నావ ఒకటి జలప్రవేశం చేసింది స్వదేశీ సముద్ర వ్యాపారాభివృద్ధి అవుతున్న కాలం అది ఈ కొత్త యుగం ప్రారంభదశలలో ఈ నౌకా జలప్రవేశంతో తూత్తుకుడి ఆధునిక భారతదేశ చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని అలంకరించుకుంది

ఈ యుగాన్ని ప్రారంభించిన వారిలో ప్రముఖుడు, దేశభక్తుడు, వి ఓ చిదంబరంపిళ్లె ఈయన తూత్తుకుడిలో లాయరు వృత్తి కొనసాగిస్తూ ఉండేవాడు తన ఊరి నౌకా వ్యాపారం బ్రిటిష్ ఇండియా స్టీమ్ నావిగేషన్ కంపెనీ వారి నిరంకుశ పరిపాలన కింద ఉండటంచూసి సహించలేకపోయాడు. భారత—సింహళదేశాల మధ్య నావిక వ్యాపారం పూర్తిగా ఈ కంపెనీ చెప్పుచేతల్లో ఉండటం ఈయనకి గొప్ప అన్యాయంగా తోచింది

1906 లో ఆయన 'స్వదేశీ షిప్పింగ్ కంపెనీ' ఒకటి నిర్మించాడు దీనికి 10 లక్షల రూపాయల పెట్టుబడి పెయించాడు.

ఎలా పెయించాడు?

స్థానిక వణిక్ ప్రముఖులు ఈ సంస్థలో డబ్బు పెట్టటానికి భయపడ్డారు అసలు దక్షిణదేశం నుంచి ఎవరూ ముందుకి రానేలేదు!

శ్రీ పిళ్లెని ఆదుకున్న మహాపురుషుడు వేరెవరో కాదు, ఆయన గురువు లోకమాన్య బాలగంగాధర తిలక్ లోకమాన్యుడు బొంబాయిలో ఉండే వివిధ సంపన్నుల చేత ఈ సంస్థకి డబ్బు ఇప్పించాడు.

1906 లో చిదంబరంపిళ్లె నావ తూత్తుకుడి రేవులో బయలుదేరింది.

బ్రిటిష్ పరిపాలకుల కన్నెర్ర చేయించటానికి ఈ ఒక్క సంఘటన చాలు కాని, అంతకన్నా కోప కారణం అనతగ్గ పరిస్థితి ఏర్పడింది యూరోపియన్లు నడిపే బట్టలమిల్లు ఒకదానిలో కార్మికుల సమ్మె ఒకటి ఏర్పాటు చేశాడు చిదంబరంపిళ్లె! ఈ సమ్మె కార్మికులకి జరిగే అన్యాయాలని తొలగించటానికి చేసినదే. సమ్మె జయప్రదంగా జరిగింది.

చిదంబరంపిళ్లెని దండించాలి కాని, అది ఎలా సాధ్యం అవుతుంది? బ్రిటిష్ పాలకులకి ఒక అవకాశం దొరికింది ఒకసారి చిదంబరంపిళ్లె ఒక బహిరంగోపన్యాసం చేశాడు అది చట్టవిరుద్ధమయిన భావాలు కల ఉపన్యాసం అన్నారు అధికారులు. అతని మీద నేరారోపణ చేశారు విచారణ జరిపారు.

చిదంబరంపిళ్లెకి అండమాను ద్వీపంలో 40 సంవత్సరాల కారాగృహ శిక్ష పడింది.

ఇది రాజకీయ నేరవిచారణ ఇందులో మామూలు న్యాయాన్యాయాల పరిశీలనకి తావులేదు కాని, ఆ కారణం చేతనే ఈ శిక్ష ప్రజలలో తీవ్రమయిన అసంతృప్తి, ఆగ్రహాలు కలిగింప చేసింది

తీర్పు, శిక్ష ప్రకటన 7 జూలయి 1908 నాడు వెలువడ్డాయి. తూత్తుకుడిలో అలజడి బయలుదేరింది. ప్రభుత్వం ప్రజల ఆగ్రహానికి గురి అయింది ఎన్నో ప్రభుత్వ భవనాలు నాశనం అయ్యాయి. పోలీసుస్టేషన్ దగ్ధం అయిపోయింది.

ఈ అల్లర్లలో బ్రిటిష్ కలెక్టరు ఆష్ స్వయంగా పాల్గొన్నాడు.

అతని రివాల్వరుకి నాలుగు ప్రాణాలు బలి అయ్యాయి.

పరిపాలకుల బలం ముందు ప్రజలు నిలువ లేకపోయారు. అలజడి సమసిపోయింది. ఆష్ పేరుకి మాత్రం పెద్ద ప్రచారం లభించింది.

కలెక్టరు ఆష్ అంటే ఎందరో హడలిపోయేవారు.

ఈ కలెక్టరుగారు ఆ బండిలో ప్రయాణం చేస్తున్నారంటే మరి ఆ స్టేషనులోని ప్రజలు చలించారంటే ఆశ్చర్యం లేదు...

మరి ఇంత ధైర్యంగా ఆష్ పెట్టె దగ్గిరికి వడిచి విడుతున్న ఈ యువకుడు ఎవరు?

అతని ముఖం మీద భయ చ్ఛాయలే లేవే!

అతను కలెక్టర్ ఆష్ పెట్టె ముందు ఆగాడు.

## ఆవేశాలూ...

కొన్నిక్షణాలు అతని వంక తేరిపార చూశాడు.

'ఢామ్!' అనే శబ్దం ఆ స్టేషనులో ప్రతిధ్వనించింది.

ఆ యువకుడు తన జేబులో నుంచి రివాల్వరు తీసి ఆష్‌ని కాల్చేశాడు.

కలెక్టరు ఆష్ నిర్జీవంగా కింద పడిపోయాడు.

కొన్నిక్షణాలు ఎవరూ ఏమీ చెయ్యలేకపోయారు. కాని, ఆతర్వాత ఆష్ భార్యా, మరికొందరూ, ఆ యువకుడిని పట్టుకోబోయారు. అతను వారికి చిక్కలేదు. ఒక పాయిఖానా లోపలికి వెళ్లి రివాల్వరుతోనే తన ప్రాణాలని అంతం చేసుకున్నాడు.

ఈ యువకుడి పేరు వాంఛ అయ్యర్ అని తర్వాత విచారణలో తెలిసింది. అంతేగాక, అతను ఒక రహస్య సంఘంలో సభ్యుడని కూడా తెలిసింది.

ఈ సంఘం కోసం వేట మొదలయింది. ఎనిమిది మంది సభ్యులని పట్టుకొనటం జరిగింది. ఇతరులు ఆరుగురుని కూడా పట్టుకున్నారు.

వీరందరినీ విచారణకని మదరాసుకి తీసుకు వచ్చారు. విచారణ ప్రధానన్యాయమూర్తి సర్ ఆర్నాల్డ్ వైట్, జడ్జీలు శంకరన్‌నాయర్, సంపులింగ్‌లు జరిపారు.

వారు ఇచ్చిన తీర్పులో ఇలా రాశారు:

"1908 లో తూత్తుకుడిలో జరిగిన అల్లర్లకి ముందు వి. ఒ. చిదంబరంపిళ్లై, సుబ్రహ్మణ్య శివ ఇద్దరూ ఉపన్యాసాలు జరిపారు. అరెస్టు అయిన పదునాలుగు మందిలో ఆర్ముగమ్, సోమసుందరమ్‌లు కూడా ఉన్నారు. వీరు ఈ ఉపన్యాసాలకి వెళ్లేవారు. ఆతర్వాత పుదుచ్చేరి నుంచి వచ్చే, చట్టవిరుద్ధమయిన ప్రచారం కల, పత్రికలని చెప్పించుకునేవారు... నీలకంఠ బ్రహ్మచారి అనే అతను పుదుచ్చేరి నుంచి వచ్చి రహస్యంగా ఒక సమావేశం జరిపాడుట. ఈ సమావేశానికి వీరిద్దరేకాక మరికొందరు కూడా వెళ్లారుట. నీలకంఠ బ్రహ్మచారి 1857 సిపాయి తిరుగుబాటు వంటిది మళ్లీ లేవదియ్యటానికి పథకం వేస్తున్నానని అన్నాడుట... కాళీ పూజ కూడా జరిగిందట.. మూడవ ముద్దాయి రామసామి అయ్యర్ సెన్‌కోట్టలో భారత మాత సంఘం అనే విప్లవ సంఘం ఉండేదని సాక్ష్యం ఇస్తున్నాడు. ఈ విచారణలో ముద్దాయిలుగా నిలిచి ఉన్న ఎందరో ఈ సంఘంలో సభ్యులుట.. వాంఛాఅయ్యర్ దాని నాయకుడుట.. (ఇటీవలే) మరణించిన నాలుగవ ముద్దాయి ధర్మరాజ అయ్యర్, తక్కిన వారూ, అందరూ కలిసి బ్రిటిష్ పరిపాలనని పడగొట్టటానికి ప్రయత్నిస్తూ ఉన్నట్లు తెలుస్తుంది. ఇక్కడి యూరోపియన్లందరినీ హతమార్చాలనే ప్రయత్నం లేకపోలేదు...ఈ ఉద్దేశాలన్నిటినీ వ్యక్తం చేసి ఏర్పాట్లు చెయ్య పూనుకున్న వ్యక్తి అయిదవ ముద్దాయి నీలకంఠ బ్రహ్మచారి. ఇతను 21 ఏళ్ల యువకుడు, విద్యావంతుడు. తంజావూరు జిల్లాలోని ఎరుక్కూరుకి చెందినవాడు. పుదుచ్చేరి నుంచి 'సూర్యోదయ' అనే తమిళ పత్రిక సంపాదకుడు. దీనిని ప్రభుత్వం మార్చి 1910 లో నిషేధించింది. కె. వి. ఆర్ముగమ్ 'ధర్మమ్' అనే మరొక పత్రికకి ఏజెంటుగా పని చేసేవాడుట.. జనవరి 9వ తేదీ (1911) నాడు ప్రభుత్వోద్యోగి అయిన వాంఛ అయ్యర్ మూడునెలల సెలవు తీసుకున్నాడుట.. పుదుచ్చేరి వెళ్లి అక్కడ ఇతర ద్రోహులతో యూరోపియన్లని కాల్చి చంపటం గురించి ఏదేదో మాట్లాడాడుట.. ముందుగా శ్రీ ఆష్‌ని హత్య చెయ్యాలన్నాడుట., ఆయన జిల్లా అధికారి కాబట్టి.. ఇంకా, స్వదేశీ నౌకా సంస్థ అణగదొక్కిన అధికారి కాబట్టి."

సెప్టెంబర్ 11, 1911 నాడు మొదలయిన విచారణ ఫిబ్రవరి 2, 1912 నాడు ముగిసింది..

ముఠా నాయకుడుగా నీలకంఠ బ్రహ్మచారికి ఏడేళ్ల కారాగృహవాసం పడింది. మరొక ఎనిమిది మందికి ఒకటి నుంచి నాలుగేళ్ల దాకా నిర్బంధం శిక్షలు పడ్డాయి. ●



'భలే కోడళ్లు' లో చలం, జయంతి.

చిత్రసమీక్ష

# భలే కోడళ్లు

సహజత్వానికి ఎంత దూరంగా వెళ్తే అంత హాస్యాస్పదంగా వుంటుందన్నది అందరెరిగిన సత్యం అందులో ప్రేక్షకులకి వినోదం లభించకపోదు! తలచుకుని తలచుకుని నవ్వుకునేంత వినోదం లేకపోయినా చూస్తున్నంతసేపూ భలేగా నవ్వించే చిత్రం జెమినీవారి 'భలే కోడళ్లు'

రిటయిర్డ్ స్కూలు మాస్టారు నరసింహానికి ముగ్గురు కొడుకులూ ముగ్గురు కోడళ్లు,—పెద్దకోడళ్లిద్దరికీ కొందరు పిల్లలూ వుంటారు అది చల్లని సంసారం వారింటికి ఒక సినిమాతార వస్తుంది ఆమె ప్రవేశంతో ఆ యింటి స్వరూపమే మారిపోతుంది లేనిపోని ఆడంబరాలకు పోయి చిక్కులు కొనితెచ్చుకుంటారు తెరకు నరిపడినంతమంది పాత్రలతో కళ్లు మాక్స్ సీను కిక్కిరిసిపోయి కావలసినంత వినోదాన్ని అందిస్తూ చిత్రం గందరగోళంగా ముగిసి భలే కోడళ్లే! అనిపిస్తుంది

చిత్రం ఆద్యంతమూ వినోదాన్ని పోషించడానికి ప్రయత్నం జరిగింది అందుకు (అక్కడక్కడ మోటుగా వున్నా) సంభాషణలు బాగా కృషి చేశాయి చిత్రంలో వినోదంతోపాటు చక్కని నీతికూడావుంది

నరసింహంగా యస్ వి రంగారావు పాత్రకి తగిన మోతాదులో చక్కని హాస్యాన్ని అందించారు పెద్ద కోడలుగా జానకి, రెండవకోడలుగా కాంచన, మూడవ కోడలుగా జయంతి చిత్రానికి ప్రాణం పోసిన నటీమణులు ఒకరినిమించి ఒకరు దీటయిన నటన కనబరిచారు అలాగే, ముగ్గురు కొడుకులుగా నాగభూషణం, రామకృష్ణ, చలం చక్కని హాస్యాన్ని అందించారు ఇతర ముఖ్యపాత్రలని రాజశ్రీ, అల్లు రామలింగయ్య, బొడ్డపాటి కృష్ణారావు, రావి కొండలరావు, సచ్చు సామర్థ్యంతో పోషించి చిత్రాన్ని రక్తి కట్టించారు

చిత్రం పొడుగునా చిత్రీకరణ పొంపు వ్యక్తమవుతూ వుంటుంది కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వం వహించిన కె బాలచందర్ కృషి ప్రశంసనీయం భమిడిపాటి రాధాకృష్ణ మాటలు రాశారు పాటలు సి నారాయణరెడ్డి రాశారు పాటలన్నిటికి ఆకర్షణీయమైన బాణీలు కూర్చిన సంగీత దర్శకుడు యం యస్ విశ్వనాథన్ సహకార దర్శకుడు ఈరంకి శర్మ

తెలుగు చలనచిత్రాల నిర్మాణంలో జెమినీ సంస్థకి ఒక ప్రత్యేక స్థానమున్నది స్థాయి నిలుపుకుంటూ ఒక చక్కని వినోదాత్మక చిత్రాన్ని అందించిన నిర్మాత యస్ యస్ వాసన్ అభినందనీయులు

—సీతరాజు ●

# సినిమా

డమ డమ పిస్టలు పేలడరా,
ఇక నీ యిష్టాలు సాగవురా,

అని నాగభూషణం, రాధాకుమారి హైనికల్‌లో పాడడాన్ని సుజాత చిత్ర నిర్మించే సాంఘికచిత్రంలో చూడగలరు ఈపాటను అప్పలాచార్య వ్రాసారు బాలసుబ్రహ్మణ్యం, సుశీల పాడిన ఈ పాటను ఎ వి ఎం, స్టుడియోలో కోదండపాణి రికార్డు చేసారు ఈ చిత్రాన్ని మల్లికార్జునరావు, బాబ్జీలు కలిసి నిర్మిస్తున్నారు కాంచన, కృష్ణ నాయకీ నాయకులు

* * *

ప్రసాద్ ఆర్ట్సు పిక్చర్స్ అధినేత శ్రీ అనుమోలు వెంకటసుబ్బారావు జావర్ సీతారామన్ వ్రాసిన కథను ప్రత్యగాత్మ దర్శకత్వంలో వెండితెరకెక్కిస్తున్నారు ఈ చిత్రం జూలైలో ప్రారంభమవుతుంది. పద్మశ్రీ నాగేశ్వరరావు కథానాయకుడిగా నటిస్తారు సారథి స్టుడియోలో నిర్మించబడే యీ చిత్రానికి సంబంధించిన పాటల రికార్డింగ్ 'మే నెలాఖరులో మొదలెడ్తారని తెలుస్తోంది నేడు సంఘంలోవున్న చెడ్డ వాతావరణాన్ని తొలగించడానికి మనిషి యెలా ప్రవర్తించాలి అనేడి సందేశాన్ని ప్రబోధించడం చిత్రం యితివృత్తం



'జీవితాలు'లో రత్నశ్రీ



శ్రీ బి విఠలాచార్య కుమార్తె చి॥ సౌ॥ కుసుమను, చి॥ మురళీధర్‌కు ఇచ్చి మద్రాసులో వివాహం చేశారు

## కలసివచ్చిన అదృష్టం

'నిండుమనసులు' చిత్రాన్ని నిర్మించిన శ్రీ జగన్నాథరావు వీనస్ స్టుడియోలో శరవేగంతో తయారు చేస్తున్న సాంఘిక చిత్రానికి 'కలసివచ్చిన అదృష్టం' అని పేరు పెట్టారు ఆగస్టు 15 నకు విడుదల కాగల యీ చిత్రాన్ని 'ప్రయివేటు మాష్టారు' దర్శకుడు శ్రీ విశ్వనాథ్ డైరెక్టు చేస్తున్నారు పద్మశ్రీ రామారావు కాంచన, శాంతకుమారి, రాజబాబు, సంధ్యారాణి, సత్యనారాయణ, ధూళిపాళ, ప్రభాకరరెడ్డి ముఖ్య పాత్రలను ధరిస్తున్నారు కుమారి సుకన్యకు యిందులో ఒక ప్రముఖపాత్ర యివ్వబడింది ఈచిత్రం

## సినిమా

షూటింగు జరుగుతూవుండగానే మరొక సాంఘిక చిత్రాన్నికూడా జూన్ మధ్యలో ప్రారంభించదల్చినట్లు జగన్నాథరావు వెల్లడించారు టి వి. రాజా సంగీతసారథిగా ఒక రాగమాలిక ఇటీవల రికార్డు చెయ్యబడింది

*　　*　　*

మురుగన్ ఫిలింస్ శ్రీ గోపి దర్శకత్వంలో నిర్మిస్తున్న 'జీవిత బంధం, షూటింగు గోల్డెన్ స్టుడియోలో గత వారం జరిగింది ఒక 'చక్కని సన్నివేశాన్ని చిత్రీకరించారు విద్వాన్ రాజశేఖర్ వ్రాసిన యీ కథలోని ప్రధాన పాత్రలను కాంతారావు, కృష్ణకుమారి, శోభన్‌బాబు, రామకృష్ణ, రాజసులోచన, గీతాంజలి, చలం, రాజనాల, ముక్కామల, సత్యనారాయణ, త్యాగరాజు, సూర్యకాంతం, జ్యోతి లక్ష్మి, హేమలత పోషిస్తున్నారు కెమెరాను సత్యం, సంగీతాన్ని ఘంటసాల నిర్వహిస్తున్నారు

*　　*　　*

చిన్ని బ్రదర్స్ నిర్మిస్తున్న 'కుంకుమ భరిణె' షూటింగు సగానికిపైగా పూర్తయింది ఏప్రిల్ మూడవవారంలో అంజలీదేవి, కాంతారావులకు సంబంధించిన సన్నివేశాల్ని, శ్రీ ఆదినారాయణచే స్వరకల్పన చెయ్యబడిన పాటను శ్రీ వేదాంతం రాఘవయ్య చిత్రీకరించారు

## సినిమా డైరీ

● ఆర్ వి ఆర్ పిక్చర్స్ చిత్రంయొక్క ప్రారంభపూజ గోల్డెన్ స్టుడియోలో ఏప్రిల్ 21న సరిగ్గా ఉదయం 7 గంటల 45 నిమిషాలకు జరిగింది శ్రీ గిడుతూరి సూర్యం దర్శకత్వంలో శోభన్‌బాబు కథానాయకుడిగానటించే యీచిత్రంయొక్క షూటింగు మే మొదటి వారంలో ప్రారంభించ బడుతుంది

● ఎ వి ఎం సంస్థ నిర్మించిన "రాము" మే 4న ఆంధ్రప్రదేశ్‌లో విడుదలవుతుంది శ్రీమతి జమున, పద్మశ్రీ రామారావు నాయిక, నాయకుల గా నటించిన యీ చిత్రానికి శ్రీ ఎ సి త్రిలోక్‌చందర్ దర్శకులు

● జెమినీసంస్థ శ్రీ కె బాలచందర్ దర్శకత్వంలో నిర్మించిన "భలేకోడళ్లు" చిత్రం ఆంధ్రప్రదేశ్ అంతటా ఏప్రిల్ 26న విడుదలయింది షావుకారుజానకి, రాజశ్రీ, కాంచన, జయంతి, రంగారావు, చలం, రామకృష్ణ ముఖ్యపాత్రధారులు

● సింగపూర్‌కు చెందిన చిత్రనిర్మాణసంస్థ మద్రాసు గోల్డెన్‌స్టూడియోలో "రక్తసై" తమిళచిత్రాన్ని గతశుక్రవారం ప్రారంభించారు శ్రీ ఫక్రుద్దీన్ దర్శకత్వం, వెంకటేష్ సంగీతం, జి కె రాము ఛాయాగ్రహణం నిర్వహించే యీచిత్రం పక్షంరోజుల్లో పూర్తవుతుంది

● విజయవాడ వాస్తవ్యులు శ్రీ వెంకటేశ్వర్లుకు శ్రీ ప్రత్యగాత్మ ఒక సాంఘిక చిత్రాన్ని డైరెక్టు చేస్తారు

## మీకు తెలుసా?

ప్రముఖ హాస్యనటుడు రాజబాబు ఆనాటి "సమాజం" చిత్రంలో ఎక్స్‌ట్రా వేషంవేశాడు

వర్తమాన హాస్యనటుడు కె వి చలం స్వంతంగా హ్యాండ్ కెమెరాను తయారు చేసాడు

ప్రముఖ హాలీవుడ్‌నటుడు మారలన్ బ్రాండో తాత్కాలికంగా తన సినీజీవితానికి స్వస్తిచెప్పి "నీగ్రోహక్కు"కోసం పాటుపడేందుకు నిశ్చయించారు

కె ఎస్ గోపాలకృష్ణన్ నిర్మిస్తున్న చిత్రంలో శ్రీమతి సావిత్రి కథానాయికగా నటిస్తుంది

ప్రఖ్యాత దర్శక, నిర్మాత శ్రీ విఠలాచార్య యింట్లో అర్ధరాత్రికి అతిథి వెళ్లినా కాఫీ సాక్షాత్కరిస్తుంది

కల్పనాచిత్ర నిర్మాత శ్రీ బాబూరావు ఒకప్పుడు ఒక పత్రికలో సబ్-ఎడిటర్‌గా పనిచేసారు

నేపథ్యగాయకి సుమిత్ర "సక్కుబాయి" గా నటించి పేరుగడించింది

శ్రీమతి జమునారమణారావుకు "ఫిలింఫేర్' ఉత్తమసహాయనటి అవార్డు "మిలన్" చిత్రంలో నటించినందుకు వచ్చింది

ప్రముఖ నిర్మాత దర్శకుడు శ్రీ ఆదుర్తి "హారతి" అనేడి పత్రికను నడిపేవారు

సబ్‌రిజిస్ట్రారుగా వుండిన పద్మశ్రీరామారావు తన మొదటిచిత్రం "మనదేశం"లో సబ్—యిన్‌స్పెక్టరుగా నటించారు

పద్మశ్రీ నాగేశ్వరరావు కృష్ణుడిగా నటించిన మొదటిచిత్రం "సంతానం"

పద్మశ్రీ రామారావు కృష్ణుడిగా నటించిన ప్రథమచిత్రం "సొంతవూరు"

## సినిమా

### కర్తవ్యంలో చల్లదనం

ఏప్రిల్ ప్రారంభమయిందో లేదో మండు టెండలు తీవ్రరూపం దాలుస్తుంది. మన తారలు యీ ఎండ దెబ్బలకు తాళలేక వున్నారు. అందుకే ఇన్‌డోర్ షూటింగులు మందకొడిగా సాగుతున్నాయి. అనేక చిత్రనిర్మాణ సంస్థలు ఊటి, కొడైకెనాల్, ఎర్‌కాడ్, హొగెనెక్‌కాల్ ప్రాంతాలకు తమ యూనిట్‌ను అవుట్‌డోర్ షూటింగు నిమిత్తం తీసుకెళ్తున్నారు. తారలు ఒక ప్రక్క తమ కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూ, మరియొక ప్రక్క చల్లదనాన్ని అనుభవిస్తున్నారు. ప్రముఖ నటీనటులు మే, జూన్ మాసాల్లో మద్రాసులో అగుపించడం అరుదైన విషయం. ఈ సంవత్సరం లాగ ముందెన్నడూ ఎండలు యింత అధికంగా లేదని వాపోతున్నారు.

* * *

1968 లో మీకు ఒక ప్రముఖ సంగీత దర్శకుని పరిచయం చేసే అవకాశం, అదృష్టం ప్రసాద్ ఆర్ట్సుకు దక్కింది. ఆయన "ఆడబ్రతుకు"లో పాపులర్ ట్యూన్సును విన్పించిన ఎం. ఎస్. విశ్వనాథం. యువకుడైన ప్రసాద్ వుత్సాహంతో శ్రీ కె. బాలచందర్ వ్రాసిన "అతిథిపూ" కథను "సత్తెకాలపు సత్తెయ్య" పేరుతో తెలుగులో నిర్మిస్తున్నారు. ముఖ్యపాత్రలను శోభన్‌బాబు, గుమ్మడి, రాజశ్రీ, విజయలలిత ధరిస్తున్నారు.



'రాజయోగంలో' గీతాంజలి

# మరువరాని మచ్చు తునకలు

ఏప్రిల్ పదహారున అక్కినేని నాగేశ్వరరావు, నందమూరి తారక రామారావుగార్లు పద్మశ్రీ బిరుదును స్వీకరించారు.

నందమూరితారక రామారావుగార్కిపద్మశ్రీ బిరుదన్నిచ్చిన శుభ సందర్భాన్ని పురస్కరించుకొని చలనచిత్ర పరిశ్రమలోని ప్రముఖులు ఆంధ్రపత్రిక అనుబంధం ద్వారా తమ తమ అభినందల్ని తెలియజేశారు. అందులో కొన్నిమచ్చు తునకలు:

సరోజాదేవి:— కళాతపస్వి, ప్రజానురంజకుడు. ఎం. జి. ఆర్:— శ్రీ ఎన్. టి. ఆర్. ఒక అందాల నటుడు మాత్రమేకాదు, అఖండ ప్రజాసేవకుడు. సముద్రాల జూనియర్:— "పద్మశ్రీమండితునకు పద్మశ్రీ సేధుమధుర భావాంచితహృత్ సద్మునకీ నవభారత పద్మశ్రీ బిరుదు బహుళ బహుమానంబే". పద్మశ్రీ శివాజీ:— అజన్మవాసనా, సంస్కారమూ, కృషిబలమూ, మీలో త్రివేణి సంగమంవలె ఏకప్రవాహమై, మిమ్మల్ని మహానటునిగా రూపొందించినై. వాణిశ్రీ:— సుందరమూర్తి నందమూరి తారకరామా. సావిత్రి:— వారి సత్ప్రవర్తన, కర్తవ్యదీక్ష, షూటింగు కార్యక్రమాలను ఒక సైనికుడిలా పాటిస్తారాయన. ప్రత్యగాత్మ:— నందమూరి వారి నందన వనంలో వికసించిన పద్మశ్రీ. కె. జగ్గయ్య:— క్రమశిక్షణ ఒక దీక్షగా స్వీకరించే వ్యక్తి ఆయన. పద్మనాభం:— నందనందనుడవై యింటింట సాక్షాత్కరించిన మీ హృదయం పద్మరాగోల్లసితం. తోటసుబ్బారావు:— సినిమాలో రాముడైనా, కృష్ణుడైనా, శ్రీమన్నారాయణుడైనా మీరే. పెండ్యాల:— శ్రీరామకృష్ణుల పాత్రలలో మిమ్మల్ని చూడగానే, ఆ భగవంతుడే సాక్షాత్కరించాడేమో అని చేతులెత్తి మ్రొక్కుతాం. సత్యనారాయణ:— కృషితో నాస్తి దుర్భిక్షం అన్న సూక్తి మీపట్ల అన్ని విధాలా సార్థకమైంది. మీవంటి ఉత్తమ మానవునికి పద్మశ్రీ సహజమైన అలంకారం. నందనాఫిలింస్:— కళకు పరమార్థం ప్రయోజనమన్న ఆదర్శాన్ని ఆచరణలో పెట్టిన మీ అఖండ ప్రజాసేవకు "సాక్షి" ఈ పద్మశ్రీ. కాకర్లవెంకటేశ్వరరావు:— శ్రీ రామారావు గారుమహా కళాతపస్వి, దేశాభిమాని, అజాత శత్రువు, విశాల హృదయుడు. జి. వరలక్ష్మి: కళయే మీరుగా, మీరేకళగా రూపొందిన మహాయోగులు. రాజసులోచన:— శ్రీ కరమయిన యీ మూర్తి 'పద్మ' ప్రతిష్ఠితుడు కావడం —అది మా అందరి భాగధేయం. అనూరాధ:— "పాండురంగ మహత్మ్యం"లో సక్కుబాయిగా శ్రీ ఎన్. టి. రామారావు నన్ను తెరకు ప్రసాదించారు. టి. వి. రాజు:— "మందారమకరంద మాధుర్యమున దేలు మధుపంబుబోవునే మదనములకు". కె. హేమాంబధరరావు:— నటునిగా, నిర్మాతగా, దర్శకునిగా ఆదర్శవంతమయిన ప్రమాణాలు నెలకొల్పిన మహావ్యక్తి. బి. ఎ. సుబ్బారావు:— దేశమంటే మట్టిగాదోయ్— దేశమంటే మనుషులోయ్, వట్టిగొప్పలు చెప్పుకోకోయ్, గట్టిగా ఒకమేలు చేసి చూపెట్టవోయ్ అన్న గురజాడ అప్పారావు గారి సందేశాన్ని నిర్మాణాత్మకంగా నిరూపించిన మీకివే మా జోహార్లు. నాగభూషణం:— ఉత్తమ దర్శకులుగా, అఖండ ప్రతిభావంతులయిన నటులుగా, దేశసేవాపరాయణులుగా మీకృషి, మీసేవలు చరితార్థమయ్యాయి, ఎస్. భావనారాయణ:— మీరు నటులలోరత్నం మనుష్యులలో మాణిక్యం, మంచితనంలో మీకుమీరే సాటి, సకల గుణాభిరాములైన మీకీర్తి మకుటంలో ఈపద్మశ్రీ బిరుదం మరొక మణిపూస. రేలంగి:— అందరం నటులమే—కాని మీరు నటరత్నం—అందుకే మీకీ పద్మశ్రీ. డా. సి. నారాయణరెడ్డి:— రామరాజును, రారాజును రంగరించుకున్న అభినేత, క్షా మ ని ధి కి, స ం క్షే మ ని ధి కి ఉ ద్గా త. అ త ని య శో ర మ్య ద్యుతి ఆచంద్రార్కం అలరారుగాక. అన్నయ్య: మీ అందం, మిమ్మల్ని వివిధ కోణాల్లో చిత్రీకరించే మాకు ఉత్సాహకరం. విఠలాచార్య, శ్రీనివాస్: —ఆదరానికి, అప్యాయతకు మీరు ఉదాహరణ. కళయే జీవితంగా, ప్రజాసేవ ధ్యేయంగా అనుక్షణం పురోగమించే మీకీ పద్మశ్రీ బిరుదు ప్రదానం సహస్రకిరణుడైన భాస్కరునికి వందన ప్రదానం వంటిది. బుష్యేంద్రమణి:— మీరు సిద్ధసంకల్పులు. రవికాంత్‌నగాయిచ్:— మీ నీడన నిలిచి, మీ క్రమశిక్షణలో, రక్షణలో ఎందరో సిద్ధహస్తులైనారు— వారందరికీ ఈనాడు పర్వదినం. ఎస్. డి. లాల్:— ఎస్. ఎస్. లాల్— అఖిలాంధ్ర ప్రజల అందాలరాముడు. గీతాంజలి:— నా గురుతుల్యులు. ముక్కామల:— సహజ సుకుమారమైన మీ హృదయపద్మం సాహసశ్రీకి ఆలవాలం. నాగిరెడ్డి, చక్రపాణి:— విజయాసంస్థకు విజయసారథియై విరాజిల్లిన 'నటరత్న'.

# సినిమా

చిత్రానికి ఆయువు పట్టయిన పాత్రను రెలిత పోషిస్తున్నారు. ఈ చిత్రం యొక్క షూటింగు వాసూ స్టూడియోలో శరవేగంగా తయారవుతుంది.

## బంగారు సంకేళ్లలో హరిశ్చంద్ర

వాహిని స్టూడియోలోని మూడవ ఫ్లోర్‌లో "బంగారు సంకెళ్ళు" షూటింగు గతవారం రోజులుగా జరిగి, 11 రీళ్ళ చిత్రాన్ని పూర్తి చేసుకుంది. మొన్న జరిగిన షెడ్యూలులో వీరబాహుగా రాజబాబు, నక్షత్రకుడిగా రమాప్రభ నటించడాన్ని దర్శకులు రామినీడు చిత్రించారు. ఈ చిత్రంలో యిది ఒక "అంతర్నాటకం" మాత్రమే. చక్కటి యితివృత్తం గల యీచిత్రంలో శ్రీమతి జమున, గుమ్మడి, హరనాథ్, జి. వరలక్ష్మి, బాలయ్య, ప్రభాకరరెడ్డి, టి. జి. కమలాదేవి, రాజబాబు, రమాప్రభ, కాకరాల ముఖ్యభూమికల్ని ధరిస్తున్నారు. శ్రీస్వామి అనితర సాధ్యమయిన కెమెరా పర్కును చూపెడుతున్నారు. ఈ చిత్రాన్ని శ్రీ సత్యనారాయణ, విక్రం సింహాలు నిర్మిస్తున్నారు. పూర్ణా విడుదల చేస్తారు.

*　　　*　　　*

వాణి మహల్‌లో త్యాగబ్రహ్మ గానసభ ఆధ్వర్యంలో కుమారి కళ్యాణి నృత్య ప్రదర్శన జరిగింది. రాధగా "మధురానగరిలో చల్లనమ్మ బోదు దారి విడువుము కృష్ణా" అనెడి పాటలో ప్రదర్శించిన అభినయం చూసి ప్రేక్షకులు బాగా ప్రశంసించారు. ఈమె "అమాయకుడు" చిత్రంలో చేసిన "డమ్ డమ్" డ్యాన్సు ఆకర్షణీయంగా వుందని పల్వురు వ్యక్తపర్చారు.

## కె. ఆర్. విజయకు శిశుజననం

ప్రముఖ నటి శ్రీమతి కె. ఆర్. విజయ మెసర్స్



తిక్క శంకరయ్యలో రామారావు.



## తప్పక చూడండి

శ్రీ ఉదయశ్రీ మోషన్ పిక్చర్ ప్రొడ్యూసర్స్ (హైదరాబాద్) వారి

# అమాయకుడు

దర్శకత్వం: అడ్డాల నారాయణరావు

సంగీతం: బి. శంకర్

నిర్మాతలు:
వెంకట నర్సయ్య
ఎం. శంకరయ్య

డిస్ట్రిబ్యూటర్స్

ఆంధ్ర: రాయల
విజయవాడ

సీడెడ్: శ్రీగౌరి
గుంతకల్లు

నైజాం: ఉషా ఫిలింస్
సికింద్రాబాద్

సుదర్శన్ ట్రేడింగ్ కార్పొరేషన్ అధినేత శ్రీ వేలాయుధాన్ని వరించి పరిణయమాడింది గదా! ఆమె గర్భవతి అనికూడా మీకు తెలుసు. గత మంగళవారం విజయకు లేడీ వెలింగ్టన్ వైద్యశాలలో కలకలలాడే ఆడబిడ్డ పుట్టింధి. తల్లి, బిడ్డ సౌఖ్యంగా వున్నారు. రెండు మాసాలు విశ్రాంతి తీసుకుని మరలా యధాప్రకారం సినిమారంగంలో నటిగా తన కర్తవ్యాన్ని



ఇటీవల పార్క్‌టౌన్ మాంటెస్సరీ స్కూలులో శ్రీమతి సావిత్రివద్ద ప్రథమ బహుమతి అందుకుంటున్న కుమారి గోమతి లక్ష్మి (6 సం) చిత్రంలో శ్రీయుతులు ఘంటసాల వెంకటేశ్వరరావు, రామోజీరావు గార్లను కూడా చూడవచ్చు

## సినిమా

నిర్వహించడానికి విజయ నిర్ణయించడాన్ని పరిశ్రమలోని వల్వురికి ఆనందదాయకం అని అనడంలో తప్పులేదేమో!

* * *

బాక్సాఫీస్ నిర్మాతగా, దర్శకుడిగా పేరందిన శ్రీ విఠలాచార్య తన కుమార్తె సౌభాగ్యవతి కుసుమను విజయవాడ మోడరన్ ఉడిపి గ్రూప్ హోటల్ అధినేత కుమారుడు చిరంజీవి మురళీధర్‌కు యిచ్చి ఏప్రిల్ 18న ధర్మప్రకాశ కళ్యాణమండపంలో వైభవంగా వివాహం చేసారు. చిత్ర నిర్మాతలు, దర్శకులు, నటీనటులు వచ్చి వధూవరుల్ని ఆశీర్వదించారు. ఆరోజు సాయంకాలం రిసెప్షన్‌లో "కృష్ణ పారిజాతం" నృత్య నాటిక ప్రదర్శింపబడింది.

### శ్రీశైలంలో బంగారు పంజరం

వాహినీ యూనిట్ తమ "బంగారు పంజరం" చిత్రానికి సంబంధించిన కొన్ని ముఖ్యసన్నివేశాల్ని శ్రీశైలంలో చిత్రీకరించి ఏప్రిల్ 20న మద్రాసుకు చేరుకున్నారు. అక్కడ షూటింగు సక్రమంగా జరిగిందని, కానీ ఎండలు సరిగ్గా రానందున కాస్త శ్రమ పడాల్సి వచ్చిందని ఆచిత్రంలో నాయిక వేషం వేసే వాణిశ్రీ చెప్పింది. అంతేకాదు అక్కడికి మూడుమైళ్ల దూరంలోగల పాండవులు పరమేశ్వరుని గూర్చి తపస్సు చేసిన స్థలాన్ని చూచినట్లు, అక్కడ లంబాడీలు తన్ను చుట్టుముట్టేసారని, వాళ్ళు చేసిన నృత్యాలు తన్ను మైమరిపింప చేసి తన చేత కూడ కొన్ని స్టెప్స్ వేయింప చేసిందని వెల్లడించింది వాణిశ్రీ.

* * *

బాబూమూవీస్ యూనిట్ కూడ మణికొండలో తమ "ఉండమ్మా బొట్టు పెడతా" చిత్రంలోని కొన్ని దృశ్యాలను చిత్రీకరించి ఏప్రిల్ 23న, మద్రాసుకు తిరుగుముఖం పట్టారు. ఈ చిత్రం పేరు వినగానే విచిత్రంగా వుంది కదూ! శ్రీ వెళ్ళిపోతుంటే కథానాయిక "ఉండమ్మా—బొట్టు పెడతా" అని లక్ష్మిని భూస్థాపితం చెయ్యడమే యీ చిత్రం యొక్క కథాంశం. శ్రీ కులకర్ణి కథకు ఆదుర్తి స్క్రీన్‌ప్లే వ్రాసారు. నంది సంభాషణలను రచించారు. శ్రీ కె. విశ్వనాథ్ దర్శకత్వం నిర్వహిస్తున్నారు. శ్రీ రామకృష్ణారావు ఛాయాగ్రహణం. శ్రీ సుందరం నిర్మించే యీ చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని విన్పిస్తున్నారు.

—శ్రీనివాస్.



జ్యోతి పబ్లిసిటీస్ మేనేజరు బి. గంగాధరరావుకు చి. సౌ. రత్నకుమారికి బోడపాడులో వివాహం జరిగింది.

# గురుదోృగ పర్వం

(10-వ పేజీ తరువాయి)

'మంత్రం" వేసి మర్రోజు సాయంత్రం తన కేవన్నా పనుంటె— 'రేప్పొద్దున్నే వచ్చి మంత్రం వేయించుకెళ్ళు..... సాయంత్రం అక్కర్లేదు' అని పంపించేస్తాడు. ఏడవ్వంగానే వో అయిదారుగురు పిల్లలొచ్చి వరండాలో కూర్చుంటారు. వాళ్ళని వచ్చే ఏటికి హైస్కూల్లో చేర్చాల్సిన బాధ్యత సర్వేశ్వర్రావుది. చేర్చుకున్న ప్రతివాడినీ హైస్కూల్లో చేర్చాడు సర్వేశ్వర్రావు. బాగా చదువు చెపుతాడంటా రందరూ. కొందరు 'అతగా చదువు చెప్పి చేర్పిస్తున్నాడా స్కూళ్ళల్లో? అదేం కాడు. హైస్కూళ్ల వాళ్లతో చెప్పి చేర్పిస్తున్నాడు' అంటారు. 'ఏవయితే నేం.... మా పిల్లలు స్కూళ్లల్లో చేరుతున్నారు. మాక్కావల్సిందది' అంటారు పెద్దవాళ్ళు........

యిలాంటి సర్వేశ్వర్రావు వెంకట్రావుగారి కెప్పుడూ సలహా లిస్తూ వుంటాడు: 'వెంకట్రావ్!.. ఆ పెన్షన్ కోసం ఎన్నాళ్ళిదుర్చూస్తావ్? అదే వున్నా వచ్చేదా? చచ్చేదా? దాన్సంగతి మీా మన పశు చూసుకుంటాళ్ళేద్దూ!.... దానికోసం కని పెట్టు క్కూర్చుని యిట్లా కోరికల లిస్టు తయా రేసుకునే బదులు ఏదన్నా నాలుగు రాళ్లొచ్చేపని చెయ్యరాదూ?' అనేవాడు.

'నాకేం వచ్చు సర్వేశ్వర్రావూ!' అనేవాడు వెంకట్రావుగారు.

'ఏంవీరావూ?!.... కనీసం వైద్యం చెయ్యటం అన్నారాదా?' అనేవాడు సర్వేశ్వర్రావు.... కానీ వెంకట్రావుగారేం చెయ్యడు. అవన్నీ తనకు రావని నమ్మకం. కానీ పెన్షనొస్తుందని మాత్రం నమ్మకం.

పోస్టాఫీసు దార్లో పచారీ కొట్లో ఫాన్ పక్కన కూర్చున్న వరహాల్రావు వెంకట్రావు గార్ని పిల్చాడు. 'ఏం?.... కులాసానా?' అన్నాడు.

'ఏం కులాసాలే' అన్నాడు వెంకట్రావుగారు. వరహాల్రావు నవ్వి—

'యివ్వు డనుకుంటే ఏం లాభం? ఏదో చిన్న వుద్యోగం దొరకంగానే సంబరవడి పోవటం, దాంట్లో చేర్టం..... పోనీ చేరావయ్యా....దాంట్లోనే పై సంపాదన పట్టి నాలుగురాళ్ళు వెనకేసుకోటం లేదు. యిప్పుడ హోరిస్తే ఏం లాభం?... అదిగోఅట్నాడు బజార్లో చెట్లన్నిటినించీ ఆకులుత్తెంపుకుంటూ పోతున్నాడే...... అతగాడి పేరు చలపతి రావు. వుద్యోగంలో ఎవర్నీ పట్టుకోలేదు నీ మాదిరే. పెళ్లాన్ని వంటలకుపయోగిస్తుంది కదా అని మిగతా కొడుకు తీసుకు పోతూ వుంటారు. యితగాడీ వూళ్లో వున్న కొడుకు దగ్గరుందావనుకుంటె కోడలింట్లోకి రానివ్వదు. ఎక్కడో వుడకేసుకుతింటూ చేతులు కాల్చుకుంటున్నాడు. అట్లా చేతులు కాల్చుకుని బయట కొచ్చిట్లా ప్రతిచెట్టు ఆకూ పట్టుకుంటాడు. చేతులు కాలాక ఆకులు పట్టుకుంటె ఏంలాభం చెప్పు?' అన్నాడు వరహాల్రావు..

వరహాల్రావు, వెంకట్రావు చిన్నప్పణ్ణించీ స్నేహితులు. ఎస్సెల్సీ పేసయ్యాక యిద్దరూ వుద్యోగాల కోసం వో ఏడాది తిరిగారు. చివరికి వెంకట్రావు గుమాస్తాగా చేరాడు. కొన్నాళ్లు చూసి వరహాల్రావు యిదేం లాభం లేదనుకుని వో కిళ్లీ కొట్టు పెట్టాడు.

'ఛీ..... యిదేం పనన్నారు కొందరు. అయినా వరహాల్రావేం మాట్లాళ్లేదు...... అట్లా అట్లా వెనకేసి కిళ్లీకొట్టు పక్కనే వో పచారీ కొట్టు పెట్టాడు..... కొన్నాళ్ల తర్వాత దాని పక్కనే హోటలు పెట్టాడు..... యింకొన్నేళ్ళకి ఫ్యాన్సీ షాపు పెట్టాడు. ఆ ప్రాంతంలోనే ఒక డాబా కట్టుకున్నాడు. చుట్టుపక్కలనున్న ఆఫీసర్లందరూ కార్లేసుకొచ్చి కొనుక్కుపోతూ వుంటా రితగాడి కొట్లల్లోంచి........

వరహాల్రావు చెప్పటం మొదలెట్టాడు:

'నేనప్పుడు చెపితే విన్నావూ?.... నువ్వూ వో కిళ్లీ కొట్టు పెట్టుకుంటె యిప్పుడీ పోస్టాఫీసుట్టూ తిరగాల్సిన పనుండేది కాదుగా?.....అయినా ఎందు కొచ్చిన చదువులివి?..... పాతికేళ్లదాకా చదువు కోటం.... తర్వాతో అయిదేళ్లు వుద్యోగాల కోసం తిరగటం, పోస్టాఫీసుట్టూ తిరగటం..... వుద్యోగం కోసం తిరిగి తిరిగి విసిగిపోయి, దొరికిందిగదా అనుకుని గాలి పీల్చే లోపల రిటయిరవ్వటం.... తర్వాత మళ్లీ పెన్షన్‌కోసం పోస్టాఫీసుట్టూ తిరగటం.... అబ్బెబ్బే.... నిన్ను చూస్తుంటె నాకే వనిపిస్తూ వుంటుందో తెల్సా? మన హిస్టరీ మేష్టారు 'చరిత్ర తిరిగి తిరిగొస్తుందం'టూ చెప్పేవాడు... ఆ సంగతి గుర్తుకొస్తుంది నాకు నిన్ను చూసినప్పుడల్లా. చదువయ్యాక పోస్టుమేన్ చుట్టూ యిట్లానే తిరిగావ్! మళ్లీ రిటయిరయ్యాక్కూడా తిరుగుతున్నావ్..... ప్చ్' అన్నాడు వరహాల్రావు.

'సరే ఏం చేస్తాం?.... నే నట్లా పోస్టాఫీసు కెళ్లొస్తా' నంటూ లేచాడు వెంకట్రావుగారు.

'యిదిగో..... యీ పటిక బెల్లం బుగ్గన పెట్టుకుపో. అసలే ఎండ మండి పోతుంది' అంటూ పటిక బెల్లం ముక్క బయటకుతీశాడు వరహాల్రావు.

'వద్దులే..... యిప్పుడే భోంచేసి బయల్దేరాను'అంటూ నడిచివెళ్లిపోయాడు వెంకట్రావుగారు.

'మనిషి మహా నిక్కచ్చి మనిషి..... చెయ్యి చాచడు. ఆఫీసులో పన్చేసేటప్పుడూ అంతే,. అందుకే యిలా కష్టాలు పడుతున్నాడు. లేకపోతే యీాయన తోటి వాళ్లంతా వేలకి వేలు సంపాయించి కాలుమీద కాలేసుకుని కూర్చుంటె యీాయన కాళ్లరిగేటట్టు పోస్టాఫీసుట్టూ యీ అయిదేళ్లనించీ పెన్షన్‌కోసం తిరుగుతున్నాడు' అని పక్కనున్న వాడితో అంటున్న వరహాల్రావు మాటలు వెంకట్రావుగారు విన్నాడు. అన్ని కష్టాల్లోనూ ఏదివిటో కొంచెం సంతోషం వచ్చింది. కాస్సేపు సంతోషించాడు. అదే అతగాడికి మిగిలిన తృప్తి.

....పోస్టుమేన్ సైకిల్తీసుకుని బయటకొస్తున్నాడు. వెంకట్రావుగారతగాణ్ణి పిల్చి—

'నాకో మనియార్డరుండాలి చూడు'అన్నాడు.

పోస్టుమేన్ కట్టంతా తీసి వెతికి—

'లేదండి' అంటూ సైకిలెక్కి వెళ్లిపోయాడు.

(అయిపోయింది) ●

ఈ 'ఉదోృగపర్వం'లోని కథలన్నిటినీ వృద్ధులయిన అమ్మకూ,నాన్నకూ అంకితం చేస్తున్నా—

వాళ్ళ చిన్నబ్బాయ్

---

ఆ ట లు

# దక్షిణాఫ్రికా బహిష్కరణ

రాబోయే అక్టోబరులో మెక్సికోలో వొలింపిక్స్ ఆటలు జరుగుతాయా లేదా అనే సందేహం తీరిపోయింది.

భారతదేశం పాల్గొనటం కూడా ఖాయం లాగే కనిపిస్తోంది.

అంతర్జాతీయ వొలింపిక్ కమిటీవారు దక్షిణ ఆఫ్రికాని ఆడనివ్వరాదని తీర్మానించారు. అంతకుముందు దక్షిణ ఆఫ్రికాకి పంపిన ఆహ్వానాన్ని రద్దు చెయ్యమని సభ్యులని కోరారు. ఈ ఆహ్వానాన్ని పోయిన ఏడు మూడు వోట్ల మెజారిటీ తీర్పువల్ల ఇచ్చారు. ఇప్పుడు 40 దేశాలు ఈ పిలుపుని రద్దు చెయ్యకపోతే తామూ ఆటలలో పాల్గొనమని చెప్పేశాయి.

దక్షిణఆఫ్రికా జాతివిచక్షణ విధానాలని అవలంబిస్తోంది కాబట్టే ఈ పేచీ వచ్చింది. దక్షిణఆఫ్రికా వారు తమ జట్టులో నల్లవారిని కూడా వేస్తామన్నా లాభం లేకపోయింది.

ఆఫ్రికన్ దేశాలు చాలా, ముఖ్యంగా రష్యా ఈ ఉద్యమానికి నాయకత్వం వహించాయి. భారతదేశం కూడా ఇదే విధానాన్ని అనుసరించింది. అందుకనే వొలింపిక్ సంస్థవారు ఈ ఆహ్వానాన్ని తిరిగి పరిశీలించి, వోటింగు పెట్టి పయిన చెప్పిన నిర్ణయానికి వచ్చారు.

ఇటీవలే జరిగిన డా. మార్టిన్ లూథర్ కింగ్ దారుణ హత్య దక్షిణఆఫ్రికా పేరుని మరింత చెడగొట్టిందనవచ్చు.

రాజకీయాలని ఆటలకి దూరంగా ఉంచాలని నేనే ఇంతకిముందు అన్నాను. అయితే, దక్షిణఆఫ్రికా జాతి—విధానం దారుణంగా ఉంటోంది. అసలు వొలింపిక్ సంస్థ అధికారులు ఆదేశానికి ఆహ్వానాన్ని ఎందుకు ఇచ్చినట్లు? ఇచ్చిన తర్వాత ఎందుకు ఉపసంహరించుకున్నట్లు? ఇదంతా ఎబ్బెట్టుగా ఉంది.

దక్షిణఆఫ్రికా దగ్గర 'నల్లవారిని కూడా ఆడనిస్తా'మనిహామీతీసుకుంటేపోయేదికదూ?

* * *

భారత జూనియర్ చాంపియన్ (టెన్నిస్) ఆనంద్ అమృతరాజు ఇటీవలే ఎం. సి. సి. టోర్నమెంటులో రెండు బిరుదులు గెలుచుకున్నాడు. సింగిల్స్‌లో బాలసుబ్రమణ్యాన్ని వోడించాడు. అతనితోనే డబుల్స్ ఆడి ఆ బిరుదు గెలుచుకున్నాడు.

మాజీ సినిమా నటి కమలాదేవి ఆడవాళ్ల సింగిల్స్ టయిటిల్ గెలిచింది. లీలారత్నంని వోడించింది.

వెటరన్ డబుల్స్‌లో ఆంధ్రకి చెందిన టి. వీరభద్రరావు, బాబూరావులు గెలిచారు.

ఇ. సి. ప్రభాకర్ సింగిల్స్‌లో వీరభద్రరావుని వోడించి టయిటిల్ దక్కించుకున్నాడు.

—కె. ఎస్. నరసింహన్

# పుస్తకాలు

**ఎన్‌జీవో**

ఎన్‌జీవో మాసపత్రిక మా కార్యాలయం చేరింది. రంగనాథ్ సంపాదకత్వంతో వెలువడుతున్న ఈ 34 పేజీల పత్రిక వెల 35 పైసలు. ప్రతులకు 9/188 ఏ, కమలానగర్, అనంతపురం.

**ఉదయకవిత**

దేవరయాంజాల జిల్లా పరిషదున్నత పాఠశాల బాలవిజ్ఞాన సంచిక. పలువురి ప్రముఖుల అభినందనలు, రచనలు పాఠశాలచరిత్ర మొదలైన విషయాలు సంచికలో పొందుపరిచారు.

**శశి**

శశి సాంస్కృతిక మాసపత్రికకు సంపాదకుడు వన్నిధానం యజ్ఞ నారాయణమూర్తి. పలువురి సాహిత్యాభిమానుల రచనలు గల ఈ పత్రిక వెల 50 పైసలు. రవిప్రకాశ్ ఎంటర్‌ప్రయిజెస్, వి. జ్యోతి భవన్, చిక్కడపల్లి, హైదరాబాదు—20.

# న్యూఢిల్లీ లేఖ

(6వ పేజీ తరువాయి)

కొన్నిసందర్భాలలో చంపవచ్చునవేవారిని దడిపిస్తున్నారు.

వ్యవసాయ పరిశీలనసంఘం మాత్రం ఏమిచేయగలదు? (బహుశ ఎన్నికయి వోడిపోయిన కాంగ్రెసువారికి ఉద్యోగాలు సృష్టించగలదు!) ప్రభుత్వం సూచనలని ఆచరణలో పెట్టాలికదా?

కేంద్ర విద్యాశాఖవారు ఇలా అన్నారు. రాష్ట్రాల ఆర్థికస్తోమత ఇక పెరగదనే అభిప్రాయాన్ని ఏకగ్రీవంగా అందరూ బలపరుస్తున్నారు. కేంద్రం సహాయంలేఃదే ఏ రాష్ట్రప్రభుత్వమూ ఏ అభివృద్ధినీ సాధించలేదు..."

చాలా రాష్ట్రాలు భూమిశిస్తులని రద్దుచేశారు. కాని వ్యవసాయ—ఆదాయం మీద పన్నువేయటం లేదు. ఇంకా కొత్త మార్గాలద్వారా ఫెడరల్ నిర్మాణాన్ని సడలింపచేస్తారా?

ఏ కమిషన్ నివేసినా ముందు గౌరవా గౌరవ భావాలు కొన్నిటివి శాశనం చెయ్యాలి. ●





# ...బృహత్కథామంజరి

(54వ పేజీ తరువాయి)

మహాసేనమహారాజా మీరు జామాత అవుతున్నందుకు ఎంతో ఆనందిస్తున్నారు. మీకు రాజకుమారి వాసవదత్త నిచ్చి కళ్యాణమహోత్సవం కడువైభవంగా చేయడానికి తమ కుమారుడు గోపాలువారిని పంపుతున్నారు. ఆయన రత్నరాసులు, గుర్రాలు, ఏనుగులు మొదలయిన అరణంతో వస్తున్నారు.'

సార్థవాహుని మాటలకు ఉదయనుడు వాసవదత్త సంతోషించారు. వాసవదత్త తన అన్నగారు కానుకలతో వస్తున్నందుకు మరింత ఆనందించింది. రాజా సార్థవాహుణ్ని సత్కరించి పంపివేశాడు. పిదప తన సైన్యంతోపాటు సేనాపతి రుమణ్వంతుణి రమ్మని చెప్పడానికి కౌశాంబికి వార్తాహరుణ్ని పంపాడు. తన సైన్యం రాకను ఎదురుచూస్తూ, పుళిందకుని పల్లెలోనే వేచిఉన్నాడు.

వాసవదత్త ఆనందంతో పొంగిపోతున్నది. వివాహం ఎప్పుడెప్పుడా అని ఉవ్విళ్లూరుతున్నది. ఆ ఉత్సుకతలో ఆమెకు క్షణమొక యుగంగా గడుస్తున్నది. వసంతకుణ్ణి పిలిపించి, 'మనస్సుకు వినోదం కలిగించే కథ ఏదైనా చెప్పు బ్రాహ్మణోత్తముడా?' అని ఆదరంతో కోరింది.

(ఇంకావుంది)



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# ఒకడజను యింత చక్కని ఫోటోలు తీయండి



రు. 46.50 (పన్నులు అదనం)

## ...కెమెరా కొన్న రోజునే Agfa క్లిక్ III

మొదలు పెట్టుటకు శ్రేష్ఠము
వదలి పెట్టుట కష్టము!

* గురిపెట్టి క్లిక్ చెయ్యండి. చిక్కుపెట్టే సాధనా లేమీ లేవు. పొరబాట్లు చేసే అవకాశంలేదు.
* 120 సైజు రోలు ఫిల్ముమీద 12 పెద్ద (6X6సెం. మీ) ఫోటోలు తీయవచ్చు.
* ఎవరెడీ కేసు పోర్‌ట్రెయిట్ లెన్సు, యింకా ఫ్లాష్ గన్ అదనంగా కొనుక్కోవచ్చు.



కళ కళ లాడే ప్రింట్లకు,
ఎన్‌లార్జ్‌మెంట్లకు అగ్ఫా ఫోటో
పేపర్లు మాత్రమే కావాలని అడగండి

అగ్ఫా పర్యవేక్షణ క్రింద తయారుచేయువారు : ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్, బరోడా.

AGI దేశానికంతా డిస్ట్రిబ్యూటర్లు :
ఆగ్ఫా-గెవర్టు, ఇండియా లిమిటెడ్
బొంబాయి • న్యూఢిల్లీ • కలకత్తా • మద్రాసు

CNAG-103 203 TL

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.





తప్పక చూడండి!









STUDIO ERANKI

హైదరాబాద్ మూవీస్ చిత్రం

# అర్ధరాత్రి

దర్శకత్వం..... P. సాంబశివరావు

నిర్మాత!..... P. గంగాధరరావు



ఆంధ్ర: ప్రీమియర్.. నైజాం: దివ్యదత్త.. మైసూర్: శారద.. సీడెడ్: నవభారత్.....